


విజ్ఞానానికి... వినోదానికి... వికాసానికి...



బల్బు వెలిగింది...

బంగారు జింక

అద్దంలో సింహం

మహా విశ్వం

పులి - తాబేలు

నల్లగుర్రం

భలే కథలు

ఆదర్శబాల్యం

చెట్టు

పొడుపు కథలు

చింగ్ చదువు

పిల్లల ప్రశ్న - సైన్స్ జవాబు

దయామయుడు దావూద్

కథలంటే మాకిష్టం 1

విశ్వవిఖ్యాత శాస్త్రజ్ఞులు

కథలే పాఠాలు

విద్యావేత్తలు,
టీచర్స్,
పిల్లలు
ఎంపిక చేసిన
100 పుస్తకాలు

పిల్లలు ఎలా నేర్చుకుంటారు?

పిల్లల గణితం

భాష - భావం

టీచర్

విముక్తి - విద్య

బోధన - శోధన

ప్రజాశక్తి బుక్‌హౌస్



సాహిత్య
ప్రస్థానం
జులై-సెప్టెంబర్ 2004
సంపుటి :1 సంచిక : 1

PRSU/02A113

# ఈ సంచికలో...



సంపాదకుడు
తెలకపల్లి రవి
ముద్రాపకులు, ప్రచురణకర్త
వి. కృష్ణయ్య
మేనేజర్
కె. లక్ష్మయ్య

## మనవి

సైజు మారిన ప్రస్థానం ఇంతకు ముందు కంటే బాగుందని పలువురు సాహితీ మిత్రులు అభినందించారు. సౌకర్యంగా వుందన్నారు. కొద్దిమంది బాగాలేదన్నారు. ఒక పాఠక మిత్రుడైతే ఇదివరకటి సైజుకు ఇప్పటి సైజుకు మధ్య తేడావల్ల ఎంత స్పేసు నష్టపోతున్నది లెక్కలతో సహా రాశారు. ఏది ఏమైనా ఇది అనివార్యమైన మార్పు. దీనివల్ల నాణ్యతలో నష్టం కలగకుండా చూసుకుంటామని మరోసారి హామీ ఇస్తున్నాం. సాంకేతిక కారణాలవల్లనే సంపుటి, సంచికల సంఖ్య కూడా మారింది. నిజానికి వచ్చే సంచికతో ప్రస్థానం రెండేళ్ళు పూర్తి చేసుకుంటుంది.

ఈ నెలరోజులు అంతకు ముందు నుంచి రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో వివిధ రకాలైన సాహిత్య చర్చలు సమాలోచనలు జరిగాయి. ఇదెంతైనా హర్షణీయం. ఈ కృషిని ప్రోత్సహించే ఉద్దేశంతోనే వాటిపై వివరమైన నివేదికలు ఇచ్చాం. అంశాల విస్తృతి తెలియడానికి నివేదికలు ఉపయోగపడతాయని ఆశిస్తున్నాం. ఈ కథనాలు ఇంకా విశ్లేషణాత్మకంగా మలుచుకోవలసిన అవసరముంది. భవిష్యత్తులో మీ ప్రాంతాలలో జరిగే కార్యక్రమాలను సమ్మేళనాలను సాహిత్య కోణం నుంచి రాస్తే ప్రచురించగలం. తెలుగునాట ఈ విధంగా ప్రగతిశీల సాహితీ శక్తులు పునస్సమీకృతం కావడం ముదావహం.

ప్రపంచ ప్రసిద్ధుడైన ప్రజాసాహిత్య స్రష్ట పాబ్లో నెరూడా శతజయంతి సందర్భంగా ఆయనపై ప్రత్యేక కథనం ఇస్తున్నాం. ఆయన స్మృతికి ప్రస్థానం జోహార్లర్పిస్తోంది.

కెన్యా ప్రసిద్ధ రచయిత గూగీ వా థియాంగాపై దాడిని, ఆయన భార్యపై అత్యాచారాన్ని ప్రస్థానం తీవ్రంగా ఖండిస్తోంది.

ముఖచిత్రం : ప్రభాకర్
లోపలి చిత్రాలు : శేఖర్, అక్బర్, ప్రభాకర్

అడ్రస్ :
సాహిత్య
ప్రస్థానం
1-1-187/1/2,
వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోన్లు : 27660013, 27635136

# డాలరు డేగ రెక్కల నరుకుడు

డా॥ నాగినేని భాస్కరరావు

పెరిగిన ధరల భగభగలతో
ఎగిసిన మబ్బులతో కొలువుతీరింది ఆకాశం
అట్టహాసంగా పెరిగి
కాలుతున్న అడవులునిండిన ఎత్తైన కొండశిఖరంకేసి చూసింది
కొండకింద
వానల్లేక, బానల్లో నీళ్లులేక
బీడుపడ్డ భూములు చూసి చూసి కళ్లెండిన బక్కరైతుల గుంపు

ఉన్నది అమ్మేసి, యింకా అక్కడక్కడా పని చేసి
చదువుకొన్నాక
వచ్చిన డిగ్రీలకు విలువలేదని - చిరుద్యోగాలకు సైతం
పెడుతున్న బూటకం పరీక్షలు రాసి, రాసి
ఉద్యోగాలు రాక, అసలు ఆ అవకాశాలు ఉండవని తెలిసి
టీస్టాలో, బూట్ పాలిషో, పబ్లిక్ టెలిఫోనో
జిరాక్సు మిషనో
కడుపు నింపటానికి పెట్టుకున్న -నవయువత

'కంప్యూటరైజేషన్'లో కడుపుకు మెతుకులు కోల్పోయి
'గోల్డెన్‌షేక్‌హేండ్'లో జరుగుబాటులు తప్పిపోయి
'పొదుపు ప్రక్రియ'లో ఉపాధులు ఉడిగిపోయి
తమ దుస్థితికి కారణాలు లెఖ్ఖిస్తూ రోడ్డునపడ్డ మాజీ ఉద్యోగులు

ప్రైవేటు రంగంలో శ్రమదోపిడీ పాలయిన చిరుద్యోగులు
ప్రపంచీకరణ పేరిట
ప్రపంచ బ్యాంకు ఆదేశాలకు లొంగి
ఎన్నికల ప్రచారంలో యిచ్చిన వాగ్దానాలను మరచిపోయి
హైటెక్ అవినీతిని అరికట్టలేక
ప్రభుత్వం రోజురోజుకు పెంచుతున్న పన్నుల బరువుకు
నడ్డివంగి, మెదడు కృంగి ఆశలుడిగిన ప్రజలు
అందరూ
నిశ్శబ్దంగా కొండకింద పెద్ద ప్రజాస్వామ్యాల బండరాయిచాటున
పొంచివున్నారు
మెదళ్ళు విదిల్చివున్నారు. పిడికిళ్ళు బిగించి వున్నారు
తమ కష్టాల కారకుడు
పెట్టుబడిదారుల పెద్దన్న - ప్రపంచ రౌడీ రాకను గమనిస్తున్నారు
అంతలో
పెనుగాలులు వీచాయి - శబ్దాలు వినిపించాయి
భయంకర అరుపు వినిపించింది - దుమ్ములేచింది

ఉక్కు ముక్కుతో గర్వంగా, ఠీవిగా ఇనుపరెక్కలాడిస్తూ
కింద వున్న చిరుదేశాల, బికారిదేశాల, బడుగుదేశాల
వెన్నెముక కోల్పోయిన దేశాల - సంపద పావురాలను తినాలని
తీక్ష దృక్కులతో వూగిపోతూ
వెర్రెక్కివాలింది ప్రజాస్వామ్యాల పెద్దబండరాయి మీద
అప్పుడే ఇరాను పావురాల్ని మేసిమేసి
కడుపునిండి కునికిపాట్లు పడుతూ
మెరిసిపోతున్న డాలరుడేగ
మురిసిపోతున్న డాలరుడేగ
ప్రపంచపు ఏకైక రౌడీలా రెచ్చిపోతూ
డాలరుడేగ చుట్టూ చూసింది



విదేశీ అప్పు చేయని ప్రణాళికా కత్తులతో, గొడ్డళ్ళతో
కొడవళ్ళతో, పారలతో, నాగళ్ళతో బక్క రైతులు
ప్రపంచీకరణను వ్యతిరేకిస్తూ
స్వయంపాలన, స్వావలంబన ఆయుధాలతో మాజీ ఉద్యోగులు
ప్రపంచ బ్యాంకును త్రోసి రాజనే వ్యూహంతో
దేశ సంపదను పెంచే కృషి ఆయుధంతో నవయువత
ప్రపంచశాంతి కాంక్షిస్తూ...
యుద్ధ వ్యతిరేకభావ రక్షణలో
స్వయంశక్తి, మానవతాభ్యుదయాల ఆయుధాలతో చిరుద్యోగులు
క్యూబా, వియత్నాం, చైనా సోషలిస్టుశక్తుల అండతో
ఐక్యతా శూలంతో - మిగిలిన దేశాల ప్రజలు
ఒక్కసారే
ఒక్కొక్కరు ఒకే పోటుతో
డాలరు డేగ రెక్కల నరుకుడు!
గావుకేకలుపెడుతూ, గెంతుతున్న
డాలరుడేగ రెక్కల నరుకుడు చప్పుడు!!
నెత్తురోడుతూ ఎగురలేని డాలరు డేగ
ప్రజాపావురాలు ముక్కున పొడుస్తుంటే
ఎగురలేని డాలరు డేగ! గెంతుతున్న డాలరుడేగ!
ఎగిరిన ప్రజాపావురాలతో నిండిన కొండ
ఎగిసిన శాంతి కాంతి పుంజాలతో నిండి ఆకాశం

# అవిశ్రాంత నాట్యం

పి.ఎల్. శ్రీనివాసరెడ్డి

నర్తకీమతల్లి
భారతి
నాట్యమాడుతోంది అవిశ్రాంతంగా
కుడిచేతిని కొంచెంగా
ఎడమచేతిని ఎంచక్కా చాపి
పెట్టుకొని పెనుగొండను తలమీద
నిలబడి ఒంటికాలిమీద
నీళ్ళమీద

# పాబ్లో నెరుడా

## విప్లవోద్యమం-రచనా వ్యాసంగం



'హి వాజ్ క్లోజర్ టు బ్లడ్ దేన్ ఇంక్'

ఆడం ఫైన్‌స్టైన్

**1971లో** సాహిత్యానికి నోబెల్ పురస్కారం దక్కించుకున్న పాబ్లో నెరుడా గురించి తెలియని సాహితీ ప్రియులు ప్రపంచంలో ఎవరూ ఉండరు. ఈ అత్యున్నత పురస్కారాన్ని అందుకోవడానికి ముందే, అంటే సుమారు 50 ఏళ్ళ క్రితమే, ఆయన రచించిన ఇరవై ప్రేమ పద్యాలు (ట్వంటీ పోయమ్స్ ఆఫ్ లవ్, 1924) అప్పటి యువతను విశేషంగా ఆకట్టుకున్నాయి. ఆయన రచనల్లోని నిరాడంబరత, హుందాతనం పాఠకులను మైమరపించేవి. ఎలిమెంటరీ ఓడ్స్ (1958), రెసిడెన్స్ ఆన్ ఎర్త్ (1933), కాంటో జనరల్ (1950), ఎస్త్రావెగారియో (1958) గ్రంథాలు నెరుడా సాహిత్య ప్రతిభకు తార్కాణాలు. రసజ్ఞ సాహిత్యంలో మణిమకుటాలు.

ఇరవయ్యో శతాబ్దానికి చెందిన ప్రముఖ సాహిత్యకారుల్లో నెరుడా అగ్రగణ్యుడు. ఎందరో ప్రముఖులైన సాహిత్యకారులు, కళాకారులతో ఆయనకు స్నేహం ఉండేది. వారిలో ఫెడెరికో గార్క్ -లోర్కా, పాబ్లో పికాసో, పాల్ ప్రముఖులు. సాహిత్యశక్తి, మానవతా విలువలు, జీవితంపట్ల వాస్తవిక వైఖరి నెరుడాను పాఠకులకు మరింత దగ్గర చేశాయి. ఈ విషయాన్ని ఆయన రాజకీయ శత్రువులు కూడా అంగీకరిస్తారు.

### బహుముఖ వ్యక్తిత్వం

నెరుడా కేవలం కవి, దౌత్యవేత్త, రాజకీయ నాయకుడే కాదు. మద్యం, మగువ, పాటలను కూడా బాగా ఆస్వాదించే వాడు. స్పానిష్ అంతర్యుద్ధం తర్వాత సుమారు రెండు వేల మంది రిపబ్లికన్లను ఆయన సముద్ర మార్గం ద్వారా చిలీకి చేరవేశాడు. స్వంత దేశంలోనే అధ్యక్షుడు గాబ్రియల్ గోన్సాలేజ్ విడేల వేటాడుతున్న కారణంగా సుమారు సంవత్సరం పాటు అజ్ఞాతవాసం గడపాల్సి వచ్చింది. తుపాకీ గుళ్ళను తప్పించుకుంటూ ఆయన గుర్రంపై ఆండీస్ పర్వతప్రాంతాలను దాటి వెళ్ళడం ఇప్పటికీ ఒక అపూర్వ సంఘటనగా గుర్తుంచుకుంటారు. ఐరోపాలో ఆయన మూడేళ్ళపాటు రహస్య జీవితం గడిపారు. వెనీస్‌లో ఒకసారి పడవపై ప్రయాణిస్తూ ఇటలీ అధికారుల నుండి తప్పించుకున్నారు. స్వదేశంలో ఆయనను అధ్యక్ష పదవికి అభ్యర్థిగా బరిలో దించారు. అయితే తన ఆప్తమిత్రుడు సాల్వడార్ అలెండి అభ్యర్థిత్వాన్ని నెరుడా బలపరిచారు. తాను కలిసిన ప్రతి వ్యక్తిపై నెరుడా బలమైన ప్రభావం చూపారు. 'నెరుడా సిరా కంటే రక్తానికే చాలా దగ్గర', అని ఆయన గురించి లోర్కా వ్యాఖ్యానించారు. 'హి వాజ్ క్లోజర్ టు బ్లడ్ దేన్ ఇంక్'. నెరుడా వ్యక్తిత్వం కూడా విలక్షణమైనది. తన వ్యక్తిత్వంలోని వైరుధ్యాల గురించి ఆయన ఓసారి ఇలా అన్నాడు. 'పాబ్లో నెరుడా... నా అత్యంత టక్కరి శత్రువు.

1904 జులై 12న జన్మించిన నెరుడా అసలు పేరు రికార్డో ఎలీసర్ నెఫ్టాలా రయిస్ బాసాల్టో తన పదహారవ ఏట పాబ్లో నెరుడాగా పేరు మార్చుకున్నాడు. చెక్ రచయిత జాన్ నెరుడాకు శ్రద్ధాంజలిగా తన పేరును మార్చుకొని ఉంటాడని కొందరు చెబుతారు. తన తొలిరచన ట్వంటీ లవ్ పోయమ్స్ అండ్ ఎ సాంగ్ ఆఫ్ డిస్పైర్ ప్రచురితమైనపుడు నెరుడా వయస్సు ఇరవై ఏళ్ళు. దౌత్య కార్యాలయంలో పని చేస్తూనే కవితా రచన కొనసాగించాడు.

### నా హృదయంలో స్పెయిన్

ఈశాన్యదేశాలలో దౌత్యవేత్తగా పనిచేస్తుండగా 1933లో ఆయనను అర్జెంటీనాకు బదిలీ చేశారు. అక్కడే ఆయనకు లోర్కాతో పరిచయం ఏర్పడి మంచి మిత్రులుగా మారిపోయారు. తరువాతి సంవత్సరంలో ఆయనను స్పెయిన్‌కు బదిలీ చేశారు. 1936 ఆగస్టులో తన మిత్రుడు లోర్కా హత్యకు గురైనపుడు నెరుడా దీర్ఘాలోచనలో మునిగిపోయాడు. రిపబ్లికన్లకు మద్దతు ఇవ్వడానికి తన దౌత్యాధికారి పదవి అడ్డంకిగా నిలుస్తోందని భావించాడు.

స్పానిష్ అంతర్యుద్ధంలో ప్రాణాలు కోల్పోయిన వారికి నివాళిగా నా హృదయంలో స్పెయిన్ 'Espaa end corazan' (Spain in My Heart) కవితా సంపుటిని రచించాడు. సామాజిక, రాజకీయ న్యాయానికి తాను కట్టుబడి ఉన్నానని ఈ రచన ద్వారా ఆయన ప్రపంచానికి చాటి చెప్పాడు.

1937 కల్లా ఆయన చిలీకి తిరిగి వచ్చాడు. స్పెయిన్ నుండి కాలినడకన ఫ్రాన్స్‌కు వలసపోయిన సుమారు ఐదు లక్షల మంది స్పానిష్ రిపబ్లికన్ల పరిస్థితిపై చిలీలో సర్వత్రా ఆందోళన వ్యక్తమైంది. ఫ్రాంకో దమనకాండ నుండి తప్పించుకోవడానికి రిపబ్లికన్లు దేశం విడిచి వెళ్ళాల్సి వచ్చింది. ఎలాంటి పారిశుధ్య వ్యవస్థ, ఆరోగ్య

సేవలు లేని శరణార్థుల శిబిరాల్లో వారు దుర్భరమైన జీవితం గడిపారు. రిపబ్లికన్లను యుద్ధఖైదీలుగా గుర్తించి పటిష్టమైన బందోబస్తు మధ్య పై కప్పులేని శిబిరాల్లో ఉంచారు. చలికి, వానకు వారు విలవిలలాడి పోయారు. రొట్టెముక్కలు, నీరు తప్ప వారికి ఎలాంటి ఆహారం అందించేవారు కాదు. ఈ విషయాలను వార్తాపత్రికల్లో చదివి నెరుడా చలించిపోయాడు. వెంటనే ఫ్రాన్స్‌కు చేరుకొని సహాయ కార్యక్రమాలు చేపట్టాడు. ఫ్రాన్స్‌లోని ఇతర శరణార్థి శిబిరాల నుండి కూడా నెరుడాకు వేల సంఖ్యలో ఉత్తరాలు వచ్చాయి. విన్నీపెగ్ అనే పడవను అద్దెకు తీసుకొని రెండు వేల మంది శరణార్థులను ఆయన చిలీకి తరలించాడు.

**వీధుల్లో రక్తం**

చిలీలో ప్రతి విపక్ష పత్రికలు, ఎల్ డయరియో ఇల్లస్ట్రాడో, దేశం అంత మంది శరణార్థులు భారం మోసే స్థితిలో లేదని గగ్గోలు పెట్టాయి. ఇదే విషయంపై చిలీ పార్లమెంటులో కూడా వాదప్రతివాదనలు జరిగాయి. శరణార్థుల రాకను సమర్థిస్తున్న వారు, వ్యతిరేకిస్తున్న వారిగా పార్లమెంటు సభ్యులు చీలిపోయారు.

వేలకిలోమీటర్ల దూరంలోని ఫ్రాన్స్‌లో ఉన్న నెరుడాకు స్వదేశంలో రేగుతున్న చిచ్చు గురించి బాగా తెలుసు. విన్నీపెగ్ నౌక బయల్దేరే సమయానికి ముందు రోజులు ఎంతో ఉద్రిక్తంగా కొనసాగాయి. ఫ్రాన్స్‌లోని వివిధ శిబిరాల నుండి శరణార్థులు రైళ్లలో మూడవ శ్రేణిలో ప్రయాణించి బోర్డియాక్స్ చేరుకున్నారు. ఆకలి దప్పులతో, అనారోగ్యంతో వారు చితికిపోయారు. పాయిలాక్ ఓడరేవు నుండి 1939 ఆగస్టు 4న విన్నీపెగ్ చిలీకి బయల్దేరింది.

తెల్ల టోపీ ధరించిన నెరుడా తన కాబోయే రెండవ భార్య డెరియా డెల్ కార్రిల్‌తో కలిసి వచ్చి నౌకను జెండా ఊపి సాగనంపాడు. కొన్ని విషయాలు వివరిస్తాను (Let Me Explain a Few Things). కవితలో రాజకీయ, సామాజిక న్యాయం పట్ల మారిన తన వైఖరిని నెరుడా స్పష్టంగా వివరించాడు. ప్రపంచంలో అన్యాయం ఎక్కడ జరిగినా తాను ప్రతిస్పందిస్తానని ప్రతిజ్ఞ చేశాడు.

"మీరు అడుగుతారు
పుష్పాలు ఎక్కడ అని
గంజాయితో నిండిన
భౌతిక వాదం ఎక్కడా అని
అక్షరాల ఆ
జడివాన ఎక్కడా అని?

మీరు అడుగుతారు
అతని కవిత ఇప్పుడు
ఆకులు, కలల గురించి
ఎందుకు మాట్లాడడం లేదు
తన జన్మస్థానంలోని
పెద్ద అగ్నిపర్వతాల గురించి
ఎందుకు ప్రస్తావించడంలేదు అని
ఒక్కసారి వచ్చి చూడండి
వీధుల్లో పారుతున్న రక్తాన్ని




**ప్రజలతో మమేకం**

నెరుడా కమ్యూనిస్టు పార్టీలో క్రియాశీల సభ్యత్వం తీసుకోకముందే, 1944లో ఆయనను అటకామా ఎడారి ప్రాంతంలోని టారాపాక్, అంతోఫగాస్తా నియోజకవర్గాల నుండి సెనేటర్‌గా పోటీ చేయాలని కొందరు సంప్రదించారు. జీవితంలో తొలిసారిగా అత్యంత వెనుకబడిన, పేదవారైన ప్రజలతో నెరుడాకు అక్కడ పరిచయం కలిగింది.

"ఆ ప్రాంతాల్లోని ప్రజల పేదరికాన్ని కళ్ళారా చూసిన నాకు ఆ జ్ఞాపకాలు గుండె కలచివేసేవిగా ఉన్నాయి. ఇక్కడ (పాన్ డి అజ్కర్) ఒక శిబిరాన్ని చెత్తకుప్పపై నిర్మించుకున్నారు. ఇళ్ళను తనిఖీ చేస్తున్నప్పుడు ఒక పంపా మహిళ వచ్చి తమ పై కప్పు నుండి అకస్మాత్తుగా కొన్ని ఎలుకలు వచ్చి పడుతున్నాయని ఫిర్యాదు చేసింది. కొన్నిసార్లు పారవేసిన చెప్పులు కూడా వచ్చి పడతాయని చెప్పింది. ఆ ప్రాంతం నిజంగా ఒక మురికి కూపాన్ని తలపించింది. ఇళ్ళ నేల నుండి పై కప్పు వరకు అంతా మురికే. ఆ మహిళ ఇంట్లోకివెళ్తే మూలన ఉన్న ఒక పాడుబడిన మంచాన్ని, కొన్ని కుర్చీలు, బల్లలను చూపించింది. ఇంటిలో వంటగది లేదు. నేలపై ఒక పాతబడిన, చిలుముపట్టిన స్టవ్ వుంది. "దీనిపై వంట చేస్తే ఆహారం మాడిపోతుంది' అని ఆ మహిళ నాతో చెప్పింది."

**నేను - నా పార్టీ**

టారాపాక్, అంతోఫగస్తా నుండి కమ్యూనిస్టు పార్టీ తరఫున నెరుడా సెనేటర్‌గా ఎన్నికయ్యారు. నాలుగు నెలల తర్వాత ఆయన అధికారికంగా చిలియన్ కమ్యూనిస్టు పార్టీలో సభ్యుడయ్యాడు. ఆయన చేరికను పురస్కరించు కొని సాంటియాగోలోని కౌపోలికన్ ప్రాంతంలో ఒక పెద్ద సభను ఏర్పాటు చేశారు. తన జీవితంలోనే విశేష ప్రాధాన్యం ఉన్న ఆ సభ గురించి నెరుడా A mi partido (To My Party) సంకలనం కింద Canto General గ్రంథంలో వివరించాడు.

"నాకు తెలియని వ్యక్తితో
సోదరత్వం కల్పించారు మీరు
అక్కడ జీవిస్తున్న వారందరి
శక్తిని మీరు నాకిచ్చారు
నా కొత్త జన్మలో నాకు
నా దేశాన్ని తిరిగి అప్పగించారు
ఒంటరి మనిషికి లేని
స్వాతంత్ర్యాన్ని నాకు కల్పించారు
బడబాగ్ని మాదిరిగా నాలోని
మానవత్వాన్ని రేపారు
చెట్టుకు అవసరమైన నిలకడను
మీరు నాకు ఇచ్చారు
ప్రజల్లో ఐకమత్యాన్ని,
వైరుధ్యాలను గుర్తించేలా చేశారు
సామూహిక విజయంలో ఒక వ్యక్తి
బాధ ఎలా మాయం కాగలదో నిరూపించారు
ప్రపంచాన్ని వాస్తవిక దృక్పథంతో,
ఆశావహంగా అన్వేషించేలా చేశారు
నన్ను వినాశనానికి అతీతునిగా తీర్చిదిద్దారు
ఎందుకంటే నా ఒక్కడితోనే నేను ముగిసిపోను."

1947 అక్టోబరులో చిలీ ప్రభుత్వ దమనకాండ పెరిగిపోవడంతో లోటాలో గని కార్మికులు సమ్మెకు దిగారు. లోటా, ఇతర చుట్టుపక్కల ప్రాంతాలకు రాష్ట్రపతి విదేలా తన సైనికులను పంపాడు. సమ్మె చేస్తున్న వారిని అదుపులోకి తీసుకొని యుద్ధ నౌకల్లో వారిని సాంతామారియా, క్విరిక్వినా దీవులకు పంపారు. సమ్మెకు నాయకత్వం వహిస్తున్న వారిని అదుపులోకి తీసుకున్న అధికారుల్లో 33 ఏళ్ళ అగస్టో పినోషే ఉగార్టే ఒకరు. బందీలుగా తీసుకున్న కార్మికులను పిసాగువా చెరసాలకు తర్వాత తరలించారు. దేశవ్యాప్తంగా అరెస్టయిన కార్మికులను కూడా అదే చెరసాలకు పంపారు. పినోషేను పిసాగువా చెరసాలకు అధిపతిగా నియమించారు. సంవత్సరంపాటు ఎమర్జెన్సీ జోన్ ప్రధాన భద్రతా దళాధికారిగా కూడా పినోషే వ్యవహరించాడు.

1947 నవంబరు 27న నెరుడా

కార్యరంగంలో దిగాడు. దేశంలో పత్రికలపై నిషేధం ఉండడంతో వెనిజులా పత్రికల్లో ఎల్‌నేషానాల్‌లో 'చిలీలో ప్రజాస్వామ్య సంక్షోభం పాలకుల నిర్బంధాన్ని తీవ్రంగా ఖండిస్తూ వ్యాసాలు రాశాడు. అధ్యక్షుడు విడేలా నాజీలను తలపిస్తున్నాడని నిరసించాడు.

"పిల్లల గుండెలపై తుపాకులు ఎక్కుపెట్టి వారి తల్లితండ్రుల ఆచూకీ కోసం ప్రశ్నిస్తున్నారు. లోటా ప్రాంతంలోని కార్మికులను, వారి కుటుంబ సభ్యులను రైళ్ళలో కుక్కి తరలించారు. నాజీలు కూడా ఈ తరహాలోనే వ్యవహరించేవారు. రైలు ప్రయాణం రోజులపాటు సాగి రైలు పెట్టెలే జైళ్ళుగా మారాయి. ఆహారం ఇవ్వకుండా ఒంటరిగా ఉంచిన కార్మికులకు ఎవరు కూడా ఎలాంటి సహాయం చేయకుండా అడ్డుకున్నారు. ఇలా వ్యవహరించడంతో ఎంతో మంది పిల్లలు, పెద్దలు మృత్యువాత పడ్డారు. కొండలపై కార్మికుల శవాలు గుట్టలుగుట్టలుగా పడి ఉన్నా ఎలాంటి విచారణ సాధ్యంకాలేదు. ఎందుకంటే ఆ ప్రాంతంలో ప్రజల రాకపోకలపై నిషేధం విధించారు."

**చారిత్రత్మక ప్రసంగం : అజ్ఞాతవాసం**

1948 జనవరి 6న నెరుడా సెనేట్‌లో నిలబడి చిలీ పార్లమెంటు చరిత్రలోనే విప్లవాత్మకమైన ఉపన్యాసం ఇచ్చాడు. ఆ ఉపన్యాసం 'యొ అక్యూసో'గా చిలీ చరిత్రలో నిలిచిపోయింది. అంతకు ముందు 50 ఏళ్ళ క్రితం ఫ్రెంచి పార్లమెంటులో జోలా తన దేశ ప్రభుత్వాన్ని విమర్శిస్తూ (ఆల్ఫ్రెడ్ డ్రేఫస్ వ్యవహారంలో) చేసిన ప్రసంగం తర్వాత నెరుడా ఉపన్యాసమే చారిత్రాత్మకమైనది. పిసాగువా చెరసాలలో ఖైదు చేయబడ్డ 628 మంది కార్మికుల పేర్లను ఆయన చదివి వినిపించాడు. ఖైదీలను ఏ విధంగానూ విచారించలేదని, అసలు వారిపై ఉన్న నేరారోపణలు ఏమిటో కూడా తెలుపలేదని విమర్శించాడు.

ఈ ప్రసంగం తర్వాత నెరుడా ప్రభుత్వానికి ప్రమాదకరమైన వ్యక్తిగా మారిపోయాడు. తనను నిర్బంధిస్తారని, అసలు తన ప్రాణానికే ముప్పు రాగలదని, చిలీ వదలిపోవడం తప్పదని నెరుడాకు బాగా తెలుసు. ప్రభుత్వ పత్రిక ఎల్ ఇంపారికల్ నెరుడాను పట్టుకునే అధికారికి భారీ మొత్తంలో రివార్డు ప్రకటించింది. అప్పటికే ఆయన ఆచూకీ కోసం 300 మంది అధికారులు వేట ప్రారంభించారు. నెరుడా తన జ్ఞాపకాల్లో తర్వాత చెప్పినట్లు, "అజ్ఞాతంలోకి వెళ్ళి సమయం కోసం ఎదురుచూడడమే ఇక ఏకైక మార్గం. అజ్ఞాత జీవితం గడుపుతూనే ప్రజాస్వామ్య పునరుద్ధరణకు



నోబుల్ పురస్కారంతో నెరుడా

పోరు సాగించాలి... చిలీ ఆ కాలంలో ఎన్నో బాధలను, కష్టాలను, హృదయం చలించిపోయే సంఘటనలను ఎదుర్కోవలసి వచ్చింది. అమెరికా మద్దతుతో, మన దేశ ప్రజలచేత ఎన్నుకోబడిన అధ్యక్షుడు నేడు కిరాతకునిగా, నెత్తురు తాగే రాక్షసుడిగా మారిపోయాడు".

**ప్రకృతితో... పక్షులతో...**

ఒక సంవత్సరంపాటు స్నేహితుల ఇళ్ళలో తలదాచుకుంటూ నెరుడా రహస్య జీవితం గడిపాడు. పరిస్థితులు మరింత ప్రమాదకరంగా మారిపోవడంతో 1949 ఫిబ్రవరి మొదటి వారంలో ఆయన దేశం విడిచివెళ్ళాల్సి వచ్చింది. పెద్ద గడ్డం పెంచుకొని, నల్లటి కళ్ళద్దాలు పెట్టుకొని ఆంటోనియో రూయిజ్ లాగోరెట్టా అనే పేరును సూచించే ప్రమాణ పత్రాలతో పక్షుల పరిశోధకునిగా (Ornithologist) జీవితం గడపాల్సి వచ్చింది. నెరుడాకు ఈ వ్యవహారమేదో బాగా నచ్చింది. పక్షుల గురించి ఆయన ఎంతో విజ్ఞానం సంపాదించుకున్నాడు. 1966లో పక్షుల గురించి వివరిస్తూ Arte de Jares (The Art of Birds) అనే పుస్తకాన్ని కూడా రచించాడు. తనకు తెలిసిన ప్రకృతి పరిజ్ఞానంతో నెరుడా ఒక టింబర్ మిల్లు యజమానిని పిచ్చిపట్టించేవాడు. జార్జ్ బెల్లెట్ ఆ సంఘటనను గుర్తుకు తెచ్చుకొని ఇలా చెప్పారు. "కిటికీపై అప్పుడే రాలిపోయిన పురుగు గురించిన అన్ని వివరాలు ఆయన (నెరుడా) చెప్పేవాడు. రోడ్డు పక్కన ఉన్న చెట్టు చిలీలో ఎప్పుడు ప్రవేశించింది, ఎలా వృద్ధి చెందిందో కూడా వివరించేవాడు. ప్రకృతి గురించి అతడికి అన్ని విషయాలు, పూర్తి వివరాలతో సహా తెలుసు.

రహస్య జీవితంలో తొలిసారిగా కొన్ని ఉత్కంఠభరితమైన క్షణాలను గడపాల్సి వచ్చింది. బెల్లెట్ కారును ఒక పోలీసు అధికారి ఆపి తనను కొన్ని వందల మైళ్ళు రోడ్డు మార్గాన తీసుకెళ్ళమని కోరాడు. అదృష్టవశాత్తు ఆ అధికారి ముందు సీట్లో కూర్చొన్నాడు. వెనుక సీటులో రగ్గు కప్పుకొని నిద్రపోయిన నెరుడాను పట్టించుకోలేదు. ఆ తర్వాత ప్రయాణంలో ఎలాంటి ఇబ్బందులు ఎదురుకాలేదు. గమ్యస్థానమైన మ్యాహూ నదీ తీరంలోని ఎస్టేట్‌కు చేరుకున్నారు. అక్కడి నుండి గుర్రంపై స్వారీ చేస్తూ ప్రయాణం చేయాల్సిన పరిస్థితి కలిగింది నెరుడాకు. బాల్యంలో ఎప్పుడో ఒకసారి సావెద్రా బీచ్‌లో గుర్రంపై స్వారీ చేసి ఉన్నాడు.

**ప్రమాద ప్రయాణం**

1949 మార్చి 8న మ్యాహూ నది పశ్చిమ ప్రాంతం నుండి ఒక చిన్నపడవలో అవతలి తీరానికి ప్రయాణం కట్టాడు. తీరం చేరుకోగానే నెరుడాకు ముగ్గురు పశువుల కాపర్లు స్వాగతం పలికారు. వారిని మూడు గుర్రాలతో నెరుడా పోల్చేవాడు.

వారి ప్రధాన లక్ష్యం కరింగ్ నదిని దాటడం. నెరుడా గుర్రం తన వీపుపై అమూల్యమైన వస్తువులను మోసుకెళుతోంది. వాటిలో లాటిన్ అమెరికాకు చెందిన మహాకవి, ఒక విస్కీసీసా, కాంటో జనరల్ రాతప్రతులు. ఆ రాతప్రతులు తమ రచయిత లాగే మారువేషంలో ఉన్నాయి. వాటిపై ఒక బూటకపు కవరు, అంతే మోసపూరితమైన శీర్షిక 'Risas of grimas' (నవ్వు-ఏడుపు Laughter and Tears) బెన్నిగ్నో ఎస్పినోజా పేరును కవిగా సూచిస్తోంది. టైపురైటరును కూడా తెచ్చుకుంటానని నెరుడా పట్టుబట్టాడు.

ప్రమాదాలతో కూడుకున్న ఈ ప్రయాణంలో నెరుడా దాదాపుగా చనిపోయేవాడే. 1971 నోబెల్ బహుమతి అందుకున్నపుడు నెరుడా ఈ సంఘటనను గుర్తు చేసుకున్నాడు. "మేము ఆ నదిని దాటి తీరాల్సి ఉంది. ఆండీస్ పర్వత శ్రేణుల నుండి పారే ఆ సన్నటి కాలువలు తమ శక్తినంతా కూడగట్టుకొని రాళ్ళు రప్పలు కదిలిస్తూ నదిలో కలుస్తుంటాయి. అయితే ఆ సందర్భంలో మాకు అద్దంలా మెరిసిపోతున్న ఒక చిన్న కుంట కనిపించింది. దాన్ని దాటడం తేలికే అనుకున్నాము. గుర్రాలు నీటిలో దూకాయి, కాని పట్టును కోల్పోయాయి. తర్వాత క్షణంలో నీటిలో తేలుతూ తీరంవైపు ఈదడం మొదలు పెట్టాయి. అంతే త్వరగా నా గుర్రం కూడా నీటిలో మునిగిపోయింది. నీటిలో కిందికి పైకి తేలుతూ ఒడ్డుకు చేరుకోవడం కోసం కాళ్ళు ఆడించసాగాను. మరోవైపు నా గుర్రం తన తలను నీటిపై నిలపడానికి అన్ని ప్రయత్నాలు చేస్తోంది. కొద్దిసేపటి తర్వాత అవతలి ఒడ్డుకు చేరుకున్నాము. అక్కడికి చేరుకున్న వెంటనే నన్ను అనుసరిస్తున్న ముగ్గురు వ్యక్తులు నవ్వుతూ నాకో ప్రశ్న వేశారు. "మీరు భయపడ్డారా?" "చాలా. నా చివరి క్షణాలు దగ్గరపడ్డాయను కున్నా" అని నేనంటే "అయ్యగారు మేము మీ వెనుకాలే ఉన్నాం... తాళ్ళతో సిద్ధంగా,' అని వారు నవ్వుతూనే బదులిచ్చారు. మరుసటి రోజు ప్రయాణం ఎంతో కష్టమైనది. 'స్మగ్లర్ల రహదారి'గా ప్రసిద్ధిగాంచిన ఆండీస్ పర్వత ప్రాంతాల నుండి వెళ్ళే ఆ మార్గాన్ని దాటాల్సి ఉంది. ఆండీస్ కాళ్ళ వద్ద చేరుకున్న

వెంటనే నెరుడా బెల్లెట్‌వైపు తిరిగి, "ఈ ప్రాంతాన్ని ఏమని పిలుస్తారని చెప్పావు?" అని అడిగాడు. 'లిల్పేలా పాస్', అని బెల్లెట్ సమాధానమిచ్చాడు. అక్కడే ఉన్న చెట్టుపై చాకుతో ఓ పద్యాన్ని చెక్కమని బెల్లెట్‌కు సూచించాడు నెరుడా. ఆ పద్యం ఇలా సాగింది :

"లిల్పేలా పాస్‌లోని ఈ గాలి
ఎంతో పరిమళంగా ఉంది
ఎందుకంటే నమ్మకద్రోహి
గోన్సాలేజ్ పిరుదుల మధ్య నుండి వెలువడే
మలం ఇక్కడికి ఇంకా చేరుకోలేదు"

ఒక కఠోరమైన ప్రయాణం తర్వాత వారు అర్జెంటీనా సరిహద్దుకు చేరుకున్నారు. తమ లక్ష్యాన్ని సాధించారు.

ఆ తర్వాత 1949 పారిస్‌లో జరిగిన ప్రపంచ శాంతి సదస్సులో నెరుడా గురించి తెలుసుకుంది. సభికుల సంభ్రమాశ్చర్యాల మధ్య ఆయనను పికాసో సభకు పరిచయం చేశాడు.

### అలెండీ విజయం

1952 వరకు ఆయన ఐరోపాలో అజ్ఞాత జీవితం గడిపారు. కొద్దికాలం రెండవ భార్య దేలియా, మరికొంత కాలం మాతిర్దే ఉర్రూషియా అనే ప్రియురాలి వద్ద ఉండేవాడు. 1955 తర్వాత చిలీలో మాతిల్దేతో కాపురం మొదలుపెట్టాడు. అధ్యక్ష పదవికి ఎన్నోసార్లు పోటీ చేసి పరాజయం పాలైన సోషలిస్టునేత సాల్వడర్ అలెండి 1970లో జరిగిన ఎన్నికల్లో విజయం సాధించారు. ప్రజాస్వామ్యయుతంగా ఎన్నికైన తొలి మార్క్సిస్టు నేతగా చరిత్రకెక్కారు. మరుసటి సంవత్సరం ఆయన నెరుడాను ఫ్రాన్స్‌కు రాయబారిగా నియమించారు. అప్పటికే క్యాన్సర్‌తో అనారోగ్యంగా ఉన్న నెరుడా 1971లో నోబెల్ అందుకోవడానికి స్టాక్‌హోం వెళ్ళాడు. 1972 సెప్టెంబరులో తిరిగి స్వదేశానికి చేరుకున్నాడు.

1973 జూన్ 29న లెఫ్టినెంట్ కల్నల్ రోబెర్టో సౌపర్ నాయకత్వంలోని అభివృద్ధి నిరోధక శక్తులు సాంటియాగో ముఖ్యకేంద్రాన్ని, రక్షణశాఖ కార్యాలయాన్ని, అధ్యక్షుడి భవనాన్ని స్వాధీనం చేసుకున్నాయి. ప్రభుత్వ అనుకూల దళాలు ఈ తిరుగుబాటును అణచివేయగలిగాయి. 42 ఏళ్ళలో ప్రజాస్వామ్యయుతంగా ఎన్నికైన అధ్యక్షునిపై సైనిక తిరుగుబాటు చేయడం అదే మొదటిసారి. అయితే తిరుగుబాటును తిప్పికొట్టినా దేశంలో పాలనా వ్యవస్థ కుప్పకూలిపోవడం ప్రారంభించింది.

1973 జులై 12న నెరుడా తన 69వ జన్మదినం జరుపుకున్నాడు. వాస్తవంగా ఆయన ఎలాంటి ఆర్భాటాలకు పోలేదు. 'కేవలం కొద్ది మంది స్నేహితులు మాత్రమే ఆయనకు శుభాకాంక్షలు తెలపడానికి వెళ్ళారు'.



అలెండీతో నెరుడా

### సైనిక కుట్ర

కవితలు రాయని సమయాల్లో నెరుడా తన బుల్లి రేడియోను చెవికి దగ్గర పెట్టుకొని దేశ రాజకీయ పరిణామాలను తెలుసుకునేవారు. లేదా టీవీలో వార్తలు చూస్తూ తాజా సమాచారాన్ని తెలుసుకునేవారు. ఆ వార్తలు ఆయనకు ఎంతో ఆందోళన కలిగించేవి. దేశంలో సైనికకుట్రను ప్రోత్సహిం చేందుకు అమెరికా డబ్బును ధారాళంగా వెచ్చిస్తోంది. ఆగస్టు 2న బస్సు, ట్యాక్సీ యజమానులు సమ్మె ప్రకటించారు. ఆగస్టు 23న జనరల్ ప్రాట్స్ గోన్సాలేజ్ రక్షణ మంత్రి పదవికి, సైన్యాధిపతి పదవికి రాజీనామా చేశారు. తన స్థానంలో అగస్తో పినోషెట్‌ని నియమించాలని రాష్ట్రపతి అలెండికి సిఫార్సు చేశారు. ఆ సమయం వరకు పినోషెట్ సైన్యంలో ఎంతో నమ్మకమైన అధికారిగా పని చేసి ఉన్నాడు. అయితే అతడి నియామకం ఎంత ప్రమాదకరమైనదో తర్వాత తెలిసింది. మూడు రోజుల తర్వాత వ్యాపారులు అలెండికి వ్యతిరేకంగా సమ్మె చేపట్టారు. ప్రభుత్వ మద్దతుదారులు ఎదురుదాడికి దిగారు. సుమారు లక్ష మంది శాంటియాగో వీధుల్లో ప్రదర్శన నిర్వహించారు. ఆ రోజు (సెప్టెంబరు 4) అలెండి ఎన్నిక మూడవ వార్షికోత్సవం నిర్వహించారు. మూడు రోజుల తర్వాత నౌకాదళాధిపతి అడ్మిరల్ రావుల్ మోంటేరోను బర్తరఫ్ చేశారు. దీంతో సైనిక తిరుగుబాటుకు చివరి అడ్డంకి కూడా తొలగిపోయింది.

### నిరసన సన్నాహాలు

'టీవీలో వచ్చే అన్ని వార్తా ప్రసారాలను నెరుడా వీక్షించేవాడు. రేడియో వినేవాడు. పత్రికలన్నీ తిరిగేసేవాడు. 'అతి త్వరలో మనం అంతర్యుద్ధాన్ని చూడబోతున్నాం. దీని గురించి నీవు ఆలోచించావా?' అని నన్ను ప్రశ్నించాడు, అని చిలీ విలేకరి లూయి అల్బర్టో మాన్సిల్లా గుర్తు చేసుకున్నారు. ప్రభుత్వానికి మద్దతుగా ఒక అంతర్జాతీయ సమావేశాన్ని నిర్వహించేందుకు ఏర్పాట్లు చేయాలని, సభకు జీన్‌పాల్ సార్త్రే, మారియో వర్గాస్ లోసా, గాబ్రియల్ గార్సియా మార్క్వెజ్, ఆర్థర్ మిల్లర్ మొదలగు ప్రముఖ రచయితలను ఆహ్వానించాలని నెరుడా మాన్సిల్లాకు సూచించాడు. తన 70వ జన్మదినోత్సవాన్ని సాకుగా చూపి ఈ సమావేశం నిర్వహించి అధ్యక్షుడు అలెండికి అంతర్జాతీయ ప్రముఖుల మద్దతు కూడగట్టాలన్నదే నెరుడా లక్ష్యం.

కాని అప్పటికే సమయం మించిపోయింది. 1973 సెప్టెంబరు 11న ఉదయం ఏడు గంటలకు వరాస్ నెరుడాకు ఫోన్ చేసి వాల్పరాసోలో సైనిక తిరుగుబాటు జరిగిన విషయం తెలిపారు. అక్కడ నెరుడా, మాతిల్దేలకు ఒక ఇల్లు ఉండేది.

'నిన్ను తర్వాత కలుస్తాను. బహుశా కలవలేనేమో', అని నెరుడా ఆమెకు జీరబోతున్న గొంతుతో చెప్పాడు. అదే నిజమైంది.

### అలెండి హత్య

సెప్టెంబరు 11న సైన్యం ఏకమై ప్రభుత్వాన్ని దుర్మార్గంగా గద్దె దించింది. అధ్యక్ష భవనాన్ని ఆక్రమించింది. ఎవరికీ అంతుపట్టని రీతిలో అలెండి చనిపోయారు. ఆయన హత్యకు గురై ఉండొచ్చు లేదా ఆత్మహత్య అయినా చేసుకొని ఉండొచ్చు. సాధారణ పౌరులు కూడా వేల సంఖ్యలో హతులయ్యారు.

నెరుడా ఆరోగ్యం క్షీణించినప్పటికీ అలెండి ప్రభుత్వం గనుక కొనసాగి ఉంటే ఆయనకోలుకునే అవకాశం ఉండేదని మాతిల్దే చెప్పారు. తన స్వీయ చరిత్రను, ఏడు కవితా సంపుటాలను తీసుకురావాలని నెరుడా ఆలోచించాడు. ఆయన మరణానంతరమే ఇవన్నీ ప్రచురితమయ్యాయి.

నెరుడా తన స్మృతుల్లో ఇలా రాశాడు : "అలెండి చర్యలు, పనులు దేశానికి ఎంతో మేలు చేశాయి. అయితే మన విముక్తిని సహించలేని శక్తులకు ఆయన చర్యలు తీవ్ర ఆగ్రహం కల్గించాయి. అధ్యక్ష భవనాన్ని బాంబులతో పేల్చి వేయడం వారి ఆగ్రహానికి నిదర్శనం. ఎలాంటి రక్షణా వ్యవస్థలేని విదేశీ నగరాలపై నాజీల యుద్ధభేరిని ఇది తలపించింది. నగర పౌర జీవనానికి చిహ్నమైన అధ్యక్ష భవనాన్ని వైమానిక దళ పైలట్లు బాంబులతో ధ్వంసం చేశారు. నాకు చాలా ఆప్తుడైన కామ్రేడ్ అలెండిని హతమార్చిన ఈ సంఘటనల మూడు రోజుల తర్వాత ఈ వ్యాఖ్యలను నా స్మృతుల కోసం త్వరగా రాశాను. అలెండి హత్యకేసును కప్పిపుచ్చారు. అతడిని రహస్యంగా ఖననం చేశారు. కేవలం అతడి భార్యనే

అంత్యక్రియలకు అనుమతించారు."

## సైన్యం వేధింపు

ఇస్లా నెగ్రాలో ఉన్న నెరుడా ఇంటిని సైనికులు సోదా చేశారు. ఆ సంఘటనను గుర్తు చేసుకుంటూ మాతిల్డే ఇలా చెప్పారు. "మేము కొన్ని అరుపులు విన్నాం... ఆ క్షణంలో మా డ్రైవరు భయభ్రాంతుడై లోనికి వచ్చాడు. సైనికులు దాడి నిర్వహిస్తున్నారని చెప్పాడు. ఒక బస్సు నిండా సైనికులు రాత్రి వేళ అక్కడికి చేరుకొని అందరూ ఇంటి బయటకు రావాలని హెచ్చరిక జారీ చేశారు.

అపుడు నెరుడా పై అంతస్తులో మంచంపై ఉన్నారు. లాంతర్లు చేతబట్టి ఇంటి ఆవరణలోని చెట్లను, మొక్కలను పరిశీలిస్తున్న సైనికులను తన కిటికీ నుండి ఆయన చూడగలిగారు. నెరుడా ఎక్కడున్నారని ఆ సైనికుల కమాండర్ ప్రశ్నించాడు. ఆయన ఎక్కడున్నారో వారు చెప్పక కమాండర్ పైకి వెళ్ళాడు, చేతిలో తుపాకీ పట్టుకొని, 'గదంతా గాలించు. నీకు ఇక్కడ దొరికే ఏకైక ప్రమాదకరమైన వస్తువు నా కవితలే', అని నెరుడా కమాండర్‌తో అన్నాడు.

సైనికులను అక్కడి నుండి ఉపసంహరించారు. అయితే సాంటియాగోలో ఉన్న నెరుడా ఇంటిపై కూడా దాడి చేసి దానిని సర్వనాశనం చేశారు. సెప్టెంబరు 18 చిలీ స్వాతంత్ర్య దినోత్సవం. ఆ రోజు నెరుడా ఆరోగ్యం క్షీణించింది. మధ్యాహ్నం ఎండలో ఆయనను అంబులెన్స్‌లో ఆసుపత్రికి తరలించాలని మాతిల్డే నిర్ణయించింది.

దారిలో వారిని సైనిక గస్తీ దళం నిలిపివేసింది. అనారోగ్యంతో ఉన్న నెరుడాకు సహాయంగా ఆసుపత్రికి వెళుతున్నానని మాతిల్డే ఎంత మొరపెట్టుకున్నా వారు వినలేదు. అంబులెన్స్ నుండి ఇద్దరు దిగాలని ఆదేశించారు. సుమారు అరగంటపాటు వారిని రోడ్డుపై నిలబెట్టారు. అంబులెన్స్‌ను క్షుణ్ణంగా పరిశీలించారు.

ఆసుపత్రి వద్ద నెరుడాను వదలి కొన్ని వస్తువులు తీసుకురావడం కోసం మాతిల్డే ఇంటికి బయల్దేరింది. ఆమె ఇంటికి చేరుకోగానే నెరుడా నుండి ఫోను వచ్చింది. 'నీవు త్వరగా వచ్చేయి. ఇక్కడ పరిస్థితులు ఏ మాత్రం బాగోలేవు', అని నెరుడా ఆమెతో చెప్పాడు. మాతిల్డే ఆసుపత్రికి చేరుకోగానే, "వారు ప్రజలను చంపేస్తున్నారు. ముక్కలు ముక్కలుగా నరికేస్తున్నారు. చనిపోయిన వారితో శవాల గదంతా నిండిపోయింది. బయట వందల సంఖ్యలో ప్రజలు తమ వారి శవాల కోసం వేచి చూస్తున్నారు. రచయిత, గాయకుడైన



విక్టర్ జారాకు ఏమైందో తెలుసా? ముక్కలుముక్కలుగా నరికివేయబడ్డ వారిలో ఆయన కూడా ఉన్నాడు. జారా శరీరం ముక్కలైంది. అతడి చేతులను నరికివేశారు. దేవుడా! అతన్ని చంపడమంటే కోయిలను చంపినట్లే. వాళ్ళుఏమంటున్నారో తెలుసా! జారా పాడుతూనే ఉన్నాడు. ఎంత వారించినా పాడటం ఆపలేదు. అందుకే కోపంతో అతడిని హత్య చేశారు' అని వివరించాడు.

సెప్టెంబరు 22వ తేది రాత్రి నెరుడా, మాతిల్డే బాగా మాట్లాడుకున్నారు. మాతిల్డే పట్ల నెరుడా చాలా అన్యోన్యంగా ప్రవర్తించాడు.కాసేపు నిద్రపోతే కొద్దిగా శక్తి వస్తుందని మాతిల్డే బుజ్జగించి నెరుడాను నిద్రపుచ్చింది. కొన్ని గంటలపాటు నిద్రపోయి మేల్కొన్న నెరుడా మునుపటి మనిషిలా లేడు. అతడి అంతరాత్మ, చనిపోయిన తన స్నేహితుల కోసం పరితపిస్తోంది. మధ్యమధ్యలో "వారిని కాల్చేస్తున్నారు.. వారిని కాల్చేస్తున్నారు', అని తడబడుతూ అరిచేవాడు. తర్వాత శక్తిని కోల్పోయి మంచంపై వాలిపోయాడు. ఆదివారం ఉదయం కోమాలోకి వెళ్ళిపోయాడు. 1973 సెప్టెంబరు 23న ఉదయం 10.30 గంటలకు నెరుడా కన్నుమూశాడు. 'మీ ఓయ్' (నేను వెళ్ళిపోతున్నా) ఆయన చివరి పలుకులు.

సాంటియాగోలోని చాస్కోనా ఇంటికి నెరుడా మృతదేహాన్ని తరలించాలని మాతిల్డే పట్టుబట్టింది. నెరుడా మిత్రుడు హర్నే లయోలా ఆ సంఘటనను గుర్తు చేసుకుంటూ ఇలా అన్నారు. "ఎందుకు ఈ కష్టమంతా అని నేను ఆమెను అడిగాను. ఆ ఇంటిని సైనికులు పూర్తిగా ధ్వంసం చేశారు. అక్కడ వస్తువులన్నీ చిందరవందరగా పడి ఉన్నాయి. అక్కడికి ఎందుకు తరలించాలి అని నేను ప్రశ్నించాను. దానికి మాతిల్డే సమాధానం "ఇల్లు ఎంత అస్తవ్యస్తంగా ఉంటే పాబ్లోకు అంత మంచిది కదా?' నెరుడాను ఆ ఇంటికి తరలిస్తే దౌత్యవేత్తలు, విదేశీ పత్రికల వారు వస్తారు. ప్రభుత్వ దమనకాండను కళ్ళారా చూడగలుగుతారని మాతిల్డే సరిగానే ఊహించింది. ఫాసిస్టు శక్తులు దేశానికి చెందిన మహాకవి, నోబెల్ విజేత పట్లే నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించాయని ప్రపంచానికంతా తెలుస్తుందని ఆమె ఉద్దేశం.

## ఆఖరి వీడ్కోలు

రెండు రోజుల తర్వాత నెరుడా మృతదేహాన్ని దెబ్బతిన్న ఆ ఇంటి నుండి బయటికి తరలించారు. "కార్మికులు, విద్యార్థులు వందల సంఖ్యలో ఆ వీధిలో గుమికూడారు. వారిలో ఒకరు "కామ్రేడ్ పాబ్లో నెరుడా" అని గట్టిగా అరిచాడు. మిగతా వారంతా "హాజరు" అని ముక్తకంఠంతో ప్రతిస్పందించారు. సామూహిక కార్యకలాపాలపై నిషేధం అమల్లో ఉన్నా నెరుడా అంతిమ యాత్ర ధిక్కార ధోరణితో ముందుకు సాగింది. దారి పొడవునా ప్రజలు యాత్రలో చేరుతూనే వున్నారు. చివరికి వేల సంఖ్యలో ప్రజలు అవెనిడా డి లా పాజ్ సిమెట్రీ వద్దకు చేరుకున్నారు. అంతిమ యాత్ర ప్రజాప్రతిఘటన యాత్రగా మారిపోయింది. సెప్టెంబరు 11 తర్వాత అంత పెద్ద సంఖ్యలో ప్రజలు గుమికూడి నిరసన తెలపడం అదే తొలిసారి. అక్కడి వాతావరణం చూసి నాలో వణుకు మొదలైంది. ఎందుకంటే ప్రజలు పెద్ద గొంతుతో 'ఇంటర్నేషనల్' గీతాన్ని ఆలపిస్తున్నారు. నాకు తెలియకుండానే నా పిడికిలి బిగిసింది. నేను కూడా పాడటం మొదలెట్టాను. సిమెట్రీకి ఎదురుగా ఉన్న వీధిలో సాయుధులైన సైనికులు పెద్ద సంఖ్యలో మోహరించారు. ఏ క్షణంలోనైనా వారు తమ అధునాతన ఆయుధాలకు పని చెబుతారని నేను బలంగా నమ్మాను. అంతలోనే ఒకరు "కామ్రేడ్ పాబ్లో నెరుడా" అని గట్టిగా అరిచారు. వేల సంఖ్యలో ఉన్న ప్రజలు ఒక్కసారిగా "అమర్ రహే" అని నినాదాలు చేశారు" అని లయోలా అప్పటి సంఘటనలను వివరించారు. నెరుడా అంత్యక్రియలు జరిగిన మరుసటి రోజు ఆయన స్నేహితుడు ఫ్రాన్సిస్కో వెలాస్కో లా సెబాస్టియానా (వాల్పరాసోలోని నెరుడా ఇల్లు)కు బయల్దేరాడు. ఇంటి చుట్టూ జనం పెద్ద సంఖ్యలో చేరారు. అక్కడి వాతావరణం ఉత్కంఠంగా ఉంది.

(పాబ్లో నెరుడా : ఒక జీవిత చరిత్ర నుండి పై వ్యాసం సంకలించబడింది. రచయిత : ఆడం ఫైన్‌స్టెన్)



# 'గ్లోబలి'



కాలువ మల్లయ్య

ఇమ్లీబన్ బస్సు స్టేషన్ రద్దీగా ఉంది. వచ్చేపోయే వాహనాల అందతో, జనాల అరుపులతో సందడిగానే ఉంది. కరీంనగర్ దిక్కున వెళ్ళే ప్రాంగణం దగ్గర స్తంభాని కొరిగి కూర్చున్నాడు రాజారాం...

ఐస్ వాటర్ సార్... ఐస్ వాటర్... చల్లటి నీల్లు, నీల్లుసార్ నీళ్ళు... ప్లాస్టిక్ సంచీలో నీటి పొట్లాలు వేసుకొని అరుస్తూ తిరుగుతున్నాడో వ్యక్తి... అతని వయసు ముప్పై ఏళ్ళకు పైన్నే ఉంటుంది.

'నీళ్ళుసార్... చల్లటి నీళ్ళు... రెండురూపాయలకు పొట్లం.." రాజారాం దగ్గరకొచ్చి అరుస్తున్నాడా వ్యక్తి.
'నీళ్ళ వాడకాన్నిబట్టి మనిషి నాగరికతను నిర్ణయించవచ్చు... ఎక్కడో చదివింది జ్ఞాపకం చేసుకున్నాడు రాజారాం... రెండ్రూపాయలకు పొట్లం నీళ్ళమ్మే చోట ఏం నాగరికతున్నట్టు...?' తనలో తాననుకున్నట్టనుకున్నాడు.
'నీళ్ళ సార్ నీళ్ళ' అటూ ఇటూ తిరుగుతూ అరుస్తున్నాడా వ్యక్తి.. అతన్ని పరీక్షగా చూశాడు రాజారాం.
అతనిదివరకు ఎక్కడో చూసినట్టు జ్ఞాపకం..
ఎక్కడ? ఎక్కడ తానతన్నెనూ చూసాడు?
తనను తానే ప్రశ్నించుకున్నాడు.
గుర్తుకు రావడంలేదు...
బస్సులొస్తున్నాయి పోతున్నాయి.. రాజారాం ఎక్కాల్సిన బస్సు మాత్రం రావడంలేదు.
వెనక్కి తిరిగి చూశాడు రాజారాం.
బేణీల్లో తెల్లటి ప్లాస్టిక్ సీసాల్లో నీళ్ళు.. పాలథిన్ కవర్లలో నీళ్ళు... నీళ్ళమ్మడమేటి? తాను నీళ్ళమ్మే వ్యక్తి నెక్కడ చూసాడు...?
ఇట్రా...! నీళ్ళమ్మే వ్యక్తిని పిలిచాడు.
రాజారాం దగ్గరికొచ్చి నిల్చున్నాడా వ్యక్తి
"ఏంటి సార్...?" అడిగాడు.
"ఓ నీళ్ళ పొట్లం ఇవ్వు..." పొట్లం రాజారాం చేతికిచ్చాడా వ్యక్తి.
పొట్లానికెంత? రెండ్రూపాయలు...
'రెండు బుక్కలన్నా కావీ నీళ్ళు రెండు రూపాయలా?'
'చారెడో బుక్కెడో? పొట్లం రెండు రూపాయలు సార్...!
'ఒక్క రూపాయికిస్తేం బోతుంది?'
రెండు రూపాయల బిళ్ళ అతని చేతికిస్తూ అన్నాడు రాజారాం..

"సార్ గీ నీళ్ళను కూడా బేరమాడుతారా..."

"నీళ్ళను అమ్ముతున్నప్పుడు బేరమాడకూడదా...?"

"ఏమోసార్... నాకు గవ్వన్ని తెలువయి..."

అని అక్కన్నుంచి వెళ్ళబోయాడా వ్యక్తి.

"నీ పేరేంటి?" రాజారాం ప్రశ్నతో ఆగాడు.

"ఎందుకుసార్? నా పేరు వీరయ్య ఎక్కన్నుంచో వచ్చి బతుకుతున్న.. నీళ్ళమ్మెటోన్ని పేరు మీకెందుకు సార్..?"

'వీరయ్య... వీరయ్య...ఈ పేరుతాను విన్నదే.. ఈ వ్యక్తి తనకు తెలిసిన వాడే.. కాని...కాని.. ఎక్కడ...?

కొద్దిక్షణాలాగి 'ఏ ఊరు మీది' అన్నాడు రాజారాం. 'కరీంనగర్ జిల్లా రామగుండం సార్...'

అవును... అతనే.. పాతికేళ్ళ క్రితం నీళ్ళ కోసం తపించిన పిల్లవాడు... ఈ రోజు నీళ్ళమ్ముతూ...

వీరయ్యెవ్వరో గుర్తించాడు రాజారాం... కాని రాజారాంను గుర్తించలేదు వీరయ్య..

'వీరయ్యా...! నువ్వు...' ఏదో మాట్లాడబోయాడు రాజారాం.

"నేను నీళ్ళమ్ముకోవాలె... ఒక్కకాడుంటె బతుకుతనాసార్.." అన్నాడు వీరయ్య.

"ఇంకో పొట్లం కొంటాను కాని అట్లాగు"

రెండు రూపాయలిచ్చి మరో పొట్లం తీసుకున్నాడు రాజారాం.

"వీరయ్యా...! నీళ్ళమ్ముతుంటే నీకేమనిపించడం లేదా?"

"ఏమనిపించుడేంది సార్... ఇది పట్నం ఇక్కడన్నీ అమ్ముడు కొనుడే... నీళ్ళిప్పుడు పల్లెటూళ్ళకు పొయ్యేబస్సలల్ల గూడా అమ్ముతండ్రుగద సార్... నీళ్ళమ్ముడొక్కటే కాద్సార్. ఇంకొన్ని రోజులయితే గాలిని కూడా అమ్మే రోజులత్తయి...."

వీరయ్య మాటల్ని ఆశ్చర్యచకితుడై వింటున్నాడు రాజారాం.

"సరేగాని వీరయ్యా...! నేనిప్పుడు కూడా నీకు జ్ఞాపకం రావడంలేదా...? మాది గోదావరిఖని దగ్గరున్న జనగామ... నా పేరు రాజారాం నీ చిన్నతనంలో నువ్వు నీళ్ళ కోసం అల్లాడిపోతుంటే...? నేను..."

ఆ మాటలు వింటున్న వీరయ్య ముఖంలో రంగులు మారుతున్నాయి.

"ఆం...ఆం...యాదికొచ్చిందిసార్.." వీరయ్య కళ్ళవెంట పటపటా నీళ్ళు కారుతున్నాయి.

జేబులున్న దస్తీ తీసి కండ్లు తుడుచుకున్నాడు వీరయ్య. కొద్ది సేపెవరేం మాట్లాడలేదు.

"అప్పుడట్లయిందా సార్...! ఇప్పుడు చూడుండ్రి.. అంతకంటే ఘోరం గనిపిస్తుంది.. తల్లితండ్రులకు బువ్వ పెట్టెటోల్లు కూడా లేకుంట యిండ్రుసార్... అందుకే ముసలోల్లను అనాథ శరణాలయాల్లో పారేత్తండ్రు.." వీరయ్య కంఠం గద్గదమైంది.

అతన్ని విస్ఫారిత నేత్రాలతో చూస్తున్నాడు రాజారాం.

"నువ్విక్కడికొచ్చి ఎన్నేళ్ళయింది" అన్నాడు కొద్దిసేపాగి

"ఇరువయేండ్ల కెక్కోనే అయిందిసార్. పిల్లగానప్పుడే ఊళ్ళె నుంచి దెంకపోయచ్చిన... కూలో నాలో ఏదో పని చేసుకుంట బతికిన.. ఏది దొరుకుతే గదే... గప్పుడు ఊళ్ళళ్ళ మాదిగిమన్నె పోల్లు బతికెటట్టుండె నా సార్...గందుకే ఇక్కడి వచ్చి బతుకుతున్న... అగో సార్... గోదావరి ఖని బస్సొత్తుంది. ఎక్కుండ్రి.." అని అక్కన్నుంచి వెళ్ళిపోయాడు వీరయ్య.



గబగబా వెళ్ళి బస్సెక్కాడు రాజారాం.

దొరికిన సీట్లో కూర్చున్నాడు. కొద్ది సేపట్లోనే బస్సు కదిలింది. ఓ పొట్లాన్ని కొరికి అందులోని నీళ్ళన్నీ తాగాడు.

చల్లగానే ఉన్నా ఆ నీళ్ళెందుకో రుచించలేదు. చిన్నతనంలో సుల్తానాబాద్ తాలూకాలో ఉన్న అమ్మమ్మ ఊళ్ళో ఉండి చదువుకున్నాడు రాజారాం విపరీతంగా నీళ్ళు...

చెలిమనీళ్ళు... అమృతంలా కమ్మటి నీళ్ళు... చేదబావి నీళ్ళు.. తియ్యతియ్యగా నీళ్ళు.. ఒర్రెల్లో నీళ్ళు... ఎన్ని నీళ్ళని...?

తాను బకెట్లకొద్దీ నీళ్ళతో స్నానం చేస్తూ... చెర్లో ఈతగొడుతూ... వానలో తడుస్తూ... మోటకాలువలో దొర్లుతూ... చెరువు మత్తడి కింద కూర్చోని పై నుండి ప్రవాహంగా నీళ్ళు పడుతుంటే ఆనందిస్తూ... ఊర కాలువలో బడికెళ్తూ నీళ్ళను తన్నుతూ... పొలాలకు పారే వేల కొలది లీటర్ల నీరు..నీరు..నీరు... తన ఇంటికొచ్చిన వాళ్ళందరికీ కుండలోంచి చల్లని నీరు తీసి పోసేది తన తల్లి... మరిప్పుడు...?

పాలిథిన్ పొట్లాల్లో నీళ్ళు... ప్లాస్టిక్ సీసాల్లో నీళ్ళు... రెండు రూపాయలకు చారెడు నీళ్ళు... నీళ్ళను కొనుక్కోవాల్సిన పరిస్థితి...

బస్సు కరీంనగర్ దిక్కు పరుగులు తీస్తుంది.

రాజారాం మనసు నిండా ఆలోచనలు... వీరయ్య జ్ఞాపకాలతన్ని పాతికేళ్ళ గతంలోకి లాక్కెళుతున్నాయి. రాజారాం యువకుడుగా ఉన్నప్పుడు వీరయ్య పిల్లవాడు. ఆ రోజు జరిగిన సంఘటన రాజారాంపై చెరగని ముద్రనే వేసింది..

పదేళ్ళ వయసైనా లేని పసివాడు వీరయ్య మండుటెండలో నడిచొస్తున్నాడు. దాహంతో నాలుక పిడచగట్టుకుపోతోంది. జనగాం ఊరు చేరుకున్నాడు.

"అమ్మా... బాగా దూపయితంది కొంచెమన్ని నీళ్ళు పోయిండ్రి..." ఓ ఇంటి ముందు నిల్చొని అడిగాడు వీరయ్య.

"మీదేకులం...?" మాదిగోల్లం...

"మాదిగోల్లకు నీళ్ళెవరు పోస్తరు..."

కసిరినట్టన్నాడు ఇంటి యాజమాని...

"మాదిగిండ్లు ఊరు అవతలి కడకున్నాయి. బాగ దూపయితంది. నాలుకెండిపోతుంది...? అక్కడికి పోయేవారకు చచ్చిపోతా.."

దీనంగా వేడుకుంటున్నాడు వీరయ్య...

అయినా ఎవరి గుండే కరగడంలేదు.

అతనికెవరూ నీళ్ళివ్వడంలేదు.

"చచ్చిపోతే చచ్చిపో మాదిగోనికట నీళ్ళట..." అని ఇంట్లోకెళ్ళారా ఇంటి వాళ్ళు.

రెండు మూడిండ్లు తిరిగినా ఎవరూ నీళ్ళు పోయడంలేదు... అందరూ కసురుకునే వాళ్ళే...

"మరో ఇంటి వాకిట్లోకెళ్ళి నిల్చున్నాడు వీరయ్య.."

"అవ్వా... కొంచెమన్ని నీల్లు పోయిండ్రి. ఉప్పునీల్లయినా మంచిదే.. నాలుకెండుకపోయి చచ్చిపోతున్న" వేడుకుంటూ అన్నాడు వీరయ్య..

"అట్లాగు నీళ్ళు తీసుకస్త..." అని ఇంట్లో కెళ్ళాడు రఘురాం. అతని రాక కోసం ఆశగా ఎదురుచూస్తున్నాడు వీరయ్య.

చెంబునిండా నీళ్ళతో వాకిట్లో కొచ్చాడు.

వీరయ్యకు కొంత దూరంలో నిల్చున్నాడు. నీళ్ళు పోయబోయి ఆగాడు.

"మీదేకులం...?" అడిగాడు.

వీరయ్య ముఖం మాడిపోయింది. మాదిగోల్లం... అన్నాడు.

"మాదిగోనివై ఉండి నీల్లు కూడా పొయ్యిమంటన్నవా పో...పో..."

చెంబుతీసుకొని వెనుదిరిగాడు రఘురాం.

అప్పుడే వాకిట్లో కదుగుపెడ్తున్న రాజారాం ఆ సంఘటన చూసాడు. గబగబా వచ్చి అన్న చేతిలోని చెంబు లాక్కున్నాడు.

"దాహంతో అలమటిస్తున్నాడు పిల్లవాడు నీళ్ళు పొయ్యవు ఏందిది...?" అన్నాడు కోపంగా...

"వాడు మాదిగోదురా..." అన్నాడు రఘురాం. 'అంటేంది?'

'అంటరానివాడు...' 'అనేక్కడ రాసుంది?'

''ఊరిబయట చెలిమకాడికి పోతే మస్తునీల్లు దొరుకుతయిగద..."

"అక్కడికి పోయెదాకా బతుకాలెగద..." అని వాకిట్లో కూచున్న వీరయ్య చేతుల్లో నీల్లు పోస్తున్నాడు రాజారాం...

వాట్ని గటగటా తాగుతున్నాడు వీరయ్య.

పొలమారినట్టుంది.. దగ్గాడు.. నీళ్ళపోయడమాపాడు రాజారాం...

"తొందరతొందరగా తాగకు... కుతికెపడ్తది. మెల్లగ తాగు... నీకెన్ని నీల్లయినా పోస్త..." అన్నాడు రాజారాం...

మొన తీసుకుంటున్నట్టుగా ఆగాడు వీరయ్య... కొద్దిసేపాగి రెండు చేతుల్ని కలిపి దోసిలిగా పట్టుకున్నాడు. నోటి దగ్గర పెట్టుకున్నాడు. ఆ చేతుల్లో నీల్లు వంచుతున్నాడు రాజారాం.. గటగటా కడుపు నిండా నీల్లు తాగాడు వీరయ్య ప్రాణం లేచివచ్చినట్టయింది. తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు లేచినిల్చున్నాడు.



రాజారాం దిక్కు కోపంగా చూస్తున్నారక్కడున్న వాళ్ళంతా... "నేనేదో తప్పు చేసినట్టు అసహ్యంగా చూస్తున్నారేంది.. ఓ మనిషి దూపతో చచ్చిపోతుంటే చూస్తూ ఊర్కోవడం మీకే చెల్లింది" అన్నాడు కోపంగా...

"మాదిగోనికి నీళ్ళు పోసుడే కాక మమ్మల్నే అంటున్నవా..."

"ఛీ..."అని వాళ్ళ దిక్కు అసహ్యంగా చూసి లోపలికెళ్తున్నాడు రాజారాం...

"నీ బాంచెను పటేల... నా పానం కాపాడింద్రు" అని అక్కన్నుంచి వెళ్ళిపోయాడు వీరయ్య...

చీకటిని చీల్చుకుంటూ బస్సు పరుగులు తీస్తుంది.

రాజారాం మెదడు నిండా ఆలోచనలు... ఏవేవో ఆలోచనలు... అంతులేని ఆలోచనలు...

'నీటి చుక్కనే నోచుకోని వీరయ్య ఈ రోజు నీళ్ళమ్ముతూ... కాని... కాని... నీళ్ళు కూడా అమ్మకపు సరుకు కావడం...?...? ఇందులోని వైరుధ్యాల నెలా అర్థం చేసుకోవాలి...? వీరయ్య లాంటి వాళ్ళ పరిస్థితుల్లో వచ్చిన మార్పుకీ -నీరూ అమ్మకపు సరుకుగా మారడానికి మధ్య ఏమైనా సంబంధముందా...?'

ఆలోచిస్తూనే ఉన్నాడు రాజారాం..

ఎటూ తేల్చుకోలేకపోతున్నాడు...

కరీంనగర్ వరకు ఆగకుండా (నాన్‌స్టాప్) పరుగెత్తాల్సిన ఆ బస్సు విసుగు లేకుండా పరుగులు తీస్తూనే ఉంది.

రాజారాంను మాత్రం ఆలోచనలు వదలడం లేదు.. నీళ్ళను అమ్మే పరిస్థితిని తలుచుకుంటేనే అతనికి దుఃఖమొస్తుంది.

ప్రపంచీకరణ... గ్లోబలైజేషన్...

ఈ మధ్య ఈ మాటల్ని తరచుగా వింటున్నాడు రాజారాం...

అంటే...? అంటే...? ప్రపంచీకరణ అంటే డబ్బు తనమా...? నీళ్ళ పొట్లాలూ అమ్మబడటానికి కారణం...? ఇదేనా...?

తనను తానే ప్రశ్నించుకున్నాడు రాజారాం.. సమాధానాలు స్పష్టంగానే కనబడుతున్నాయి.

తాను చదువుకునే రోజుల్లో ఎన్ని ఆదర్శాలు..?

తాను, తన మిత్రులు కాలేజీ వీడ్కోలు సభలో మాట్లాడిన మాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి.

కాలేజీలో ఫైనలియర్ విద్యార్థుల వీడ్కోలు సభ. లెక్చరర్లంతా కుర్చీలపై కూర్చొనున్నారు. విద్యార్థులు తాము డిగ్రీ తీసుకున్న తర్వాత ఏం చేయబోతున్నారో చెబుతున్నారు.

"నేను బిఎస్సీ పూర్తి చేసినా డాక్టర్ కోర్సు చదువుతాను. డాక్టరు కావడం కేవలం డబ్బు బాగా సంపాదించడానికి మాత్రమే కాదు..."

"నేను ఉపాధ్యాయుడు నవుతాను. పల్లెల్లో పని చేసి భావిభారత పౌరులను తీర్చిదిద్దుతాను..."

"నేను కలెక్టర్ నవుతాను. ప్రజల కందదండగా ఉంటాను..."

"నాకు ప్రజానాయకుడు కావాలనుంది గాంధీ, నెహ్రూలు నాకాదర్శం..."

"నేనేవృత్తిలో స్థిరపడ్డా సామాజిక సేవలో పాల్గొంటాను..."

విద్యార్థులు తమ భావాలను వెల్లడిస్తున్నారు... అందరి మాటల్లోనూ ఏదో ఆదర్శం... ఆవేశం దేశానికేదో చేయాలన్న తపన...

ఇప్పుడు రాజారాం వంతొచ్చింది.

"కొద్ది రోజుల్లో ఈ కాలేజీ వదిలిపోతున్నందుకు నాకెంతో దుఃఖంగా ఉంది. నేను ఉపాధ్యాయుడిగానో, లెక్చరర్‌గానో తప్ప మరే వృత్తిలోనూ స్థిరపడను. పిల్లలను భావిభారత పౌరులుగా తీర్చిదిద్దుతాను. సమాజాన్ని మరమ్మతు చేయడానికి నావంతు కృషి చేస్తాను. వరకట్నం లాంటి సామాజిక రుగ్మతలను రూపుమాపుతాను. అందుకు నాందిగా నేను కట్నం లేకుండానే పెళ్ళి చేసుకుంటాను. పుట్టినందుకు బతకడం కాదు... జీవించి చూపుతాను దేశం కోసమే బతుకుతాను.."

కరతాళ ధ్వనులతో హాలంతా దద్దరిల్లింది...

లెక్చరర్లంతా రాజారాం ఆదర్శాలను మెచ్చుకున్నారు...

చివరగా ప్రిన్సిపాల్‌గారు ముఖ్యఅతిథి సందేశమిచ్చారు...

ఆదర్శాలను గుండెనిండా నింపుకొని జీవితంలోకి ప్రవేశించాడు. ఉపన్యాసక వృత్తిలో స్థిరపడ్డాడు. ఎన్నో మార్పులను గమనిస్తున్నాడు. ఈ మధ్య కాలంలో వస్తున్న మార్పులు మాత్రమాతనికి మింగుడుపడటంలేదు.

తాను లెక్చరర్‌గా సీనియర్ ఇంటర్ విద్యార్థుల వీడ్కోలు సభలో పాల్గొన్నాడు. తానే ఆ సభకు అధ్యక్షుడు.

విద్యార్థులొక్కొక్కరే మాట్లాడుతున్నారు.

"నేను కంప్యూటర్ ఇంజనీర్ నవుతాను బాగా సంపాదిస్తాను. అందుకోసం అమెరికా కెళ్తాను..."

"నేను డాక్టరునయి బాగా సంపాదిస్తాను..."

"నాకు అమెరికాలోనే స్థిరపడాలనుంది... ఈ దేశంలో ఏం లేవు..."

"నాకు బిల్ గేట్స్ ఆదర్శం..."

"నేను అణుశాస్త్రవేత్త నవుతాను..."

"నేను పనిలో స్థిరపడ్డా బాగా సంపాదిస్తాను..."

దాదాపందరూ ఇలాంటి మాటలే మాట్లాడారు... ఒకరిద్దరు ఏవో ఆదర్శాలు మాట్లాడినా ఆ మాటల్లో బలం లేదు..

'అప్పటికీ ఇప్పటికీ ఎంత తేడా...?

అబ్రహం లింకనా బిల్‌గేట్సా అంటే బిల్ గేట్స్ అంటున్నారు.

గాంధీ ప్రేమ్‌జీలలో ప్రేమ్‌జీనే కోరుకుంటున్నారు.

బస్సు కరీంనగర్ చేరుకుంది. అర్ధరాత్రి దాటి రెండు గంటలయింది. కొద్ది సేపట్లోనే గోదావరిఖని దిక్కు బయలుదేరింది బస్సు.

ఎంత ప్రయత్నించినా రాజారాంకు నిద్రరావడంలేదు.

కళ్ళు మూసుకుంటే చాలు ఆలోచనల జోరీగలు ముసురుకుంటున్నాయి.

మళ్ళీ పాతికేళ్ళ గతంలో కెళ్ళాడు రాజారాం.

సలసలకాగే యువరక్తంతో ఆదర్శాల వేడితో చదువు ముగించాడు రాజారాం.. త్వరలోనే ఉద్యోగమైంది.

"బిడ్డా..! నీకు మంచి చదువుంది... గవర్నమెంటు ఉద్యోగముంది.. యాభై వేల వరకట్న మిస్తనని వస్తున్నారు. ఏదో ఒక సంబంధం నిర్ణయించుకో.." పెళ్ళిప్రసక్తి తెచ్చాడు తండ్రి..

తండ్రి మాటలకు ఆశ్చర్యపోయాడు రాజారాం.



తాను ఏడాదంతా కరీంనగర్‌లో ఉండి చదివితే అయిన ఖర్చు వేయి రూపాయలు. ఎకరం పొలం ధర నాలుగు వేలు. తులం బంగారం ధర ఆరువందలలోపే... ఇలాంటి సమయంలో తన కులంలో యాభైవేల కట్నమంటే చాలా ఎక్కువే. కాని తాను కట్నం తీసుకోదలుచుకోలేదు... తన ఆదర్శాలకు తిలోదకాలివ్వ దలుచుకోలేదు.. కానీ తనను కష్టపడి చదివించిన తండ్రికి కష్టం కల్గించకుండా ఒప్పించాలి...

తనలో తానే దృఢనిర్ణయం చేసుకున్నాడు.

"నాన్నా..! మీరు నా చదువుకోసమెంతో కష్టపడ్డారు... ఇక ముందు జీవితంలో మీకే కష్టం కలుగకుండా కూర్చోబెట్టి సాదుతాను.. కాని నా పెళ్ళి విషయంలో నాకొన్ని అభిప్రాయాలున్నాయి... ఎట్టి పరిస్థితిలోనూ కట్నం తీసుకొని నేను పెళ్ళి చేసుకోను. కట్నం తీసుకోవడమంటే అమ్ముడుపోయినట్టేనని నా అభిప్రాయం.." అన్నాడు.

"ఏంది బిడ్డా నువ్వనేది...? యాభై వేల కట్న మొస్తుందంటే వద్దనెటోన్ని నిన్నొక్కన్నే చూసిన.."

"వద్దునాన్నా...! కష్టపడకుండా ఊరికే వచ్చే సొమ్ము వద్దేవద్దు. నేనుకట్నం తీసుకోదలుచుకోలేదు. మంచి కుటుంబంలోంచి వచ్చిన అమ్మాయి అయితే చాలు..."

"పోనియ్... నువ్వెరినైనా ఇష్టపడుతున్నావా...?"

"అదేం లేదు. మీరు చూసినమ్మాయినే చేసుకుంటాను.. కట్నం లేకుండా..."

"ఏమోబిడ్డ... గన్ని పైసలొస్తున్నాయంటే వద్దన వద్దవి.. సరె. నీ ఇష్టమున్నట్టే కానియ్... నేనేమొ గాయిదొన్నయితి... నువ్వేమొ చదువుకున్నోనివైతివి. చదువుకున్నోల్లు నాలుగు కండ్లతోని చూస్తరంటరు...

కట్నం విషయంలో కుటుంబంతో ఘర్షణ పడాల్సిన అవసరం కలుగనందుకు సంతోషించాడు రాజారాం.

శంకరమ్మతో రాజారాం పెళ్ళయింది. వాళ్ళు కట్నం ఇవ్వగలిగే స్థితిలోనే ఉన్నా రాజారాం వద్దన్నాడు. రాజారాంకు శంకరమ్మ అన్ని విధాలా సహకరిస్తుంది. సహధర్మచారిణి అన్న మాటకు మారుపేరై నిలిచింది.

ఏవేవో మార్పులు రావడం గమనిస్తున్నాడు రాజారాం. ఎలక్ట్రానిక్ మీడియా జోరు వటుడింతై అన్నట్లు పెరిగిపోవడం చూస్తున్నాడు. గత పదేళ్ళుగా జరుగుతున్న భాగోతం రాజారాంకసలే మింగుడుపడటంలేదు. అసలేం జరుగుతుందో అర్థం కావడంలేదు. అయితే తమవి కానివేవో భావాలు, సంస్కృతి రుద్దబడుతున్నట్టు కొద్దికొద్దిగా అర్థమవుతుంది. ఆదర్శాలనీ ప్రేలాపనల్లా, పేకమేడల్లా కూలిపోతున్నట్టనిపిస్తుంది. సంక్షేమం బలహీనుల పాలిట దయకలిగి ఉండాలన్న భావం మచ్చుకు లేకుండా పోతున్నట్టు గమనిస్తున్నాడు. ఈ పోరులో మానవాంశ ప్రశ్నార్థకం కావడం అతని దృష్టి పథాన్ని దాటిపోలేదు.

'ఈ మార్పులు తన ఇంట్లోకీ ప్రవేశించాయా...?' రాజారాం హృదయం ఆవేదనతో బరువెక్కింది.

బస్సు గోదావరిఖని చేరుకుంది.

"సార్... మీ ఊరొచ్చేసింది.." లైట్లేస్తూ అన్న కండక్టర్ మాటలతో ఈ లోకంలోకొచ్చాడు రాజారాం.

"నేనేం నిద్రపోవడంలేదు..." అన్నాడు లేచి నిల్చుంటూ రాజారాం.

'నిద్రవంటి కూడా గాఢమైన ఆలోచనలో మీరున్నారు సార్..."

''కావచ్చు. మరి నిద్రకంటే ఆలోచన నయమేకదా...!"

అంటూ సూట్‌కేసుతో బస్సు దిగాడు రాజారాం...

ఆటో మాట్లాడుకొని ఇంటికెళ్ళాడు...

"ఏమైందండీ...! కాయా...?పండా..?"

గడపదాటి ఇంట్లో కదుగుపెడ్తున్న భర్త నడిగింది శంకరమ్మ...

"కాయా కాదు.. పండూ కాదు... మురిగిపోయింది... సరేనా ఈ రాత్రే చరిత్రంతా చెప్పాలా...?" అన్నాడు విసుక్కుంటూ...

"ఏంటి...? ఉరిమురిమి మంగళం మీద పడ్డట్టు చెయ్యవద్దరి; నేనే మన్నానని.. ఏమైందని అడిగాను తప్పా...?" అంది శంకరమ్మ..."

"నువ్వేమన్లేదు... నీదేం తప్పు లేదు. నాదే తప్పు... సరేనా..? మిగిలిన రెండు గంటలయినా నన్ను పడుకోనిస్తావా...? లేదా...?"

డ్రెస్ మార్చుకుంటూ అన్నాడు రాజారాం...

"నాన్న అలసిపోయున్నాడు. పొద్దున మాట్లాడుకోవచ్చు.. పడుకుందాం పదమ్మా...!" అంది సరళ...

లైటార్పి నిద్రలో కొరిగారు వాళ్ళు.

ముసురుకుంటున్న ఆలోచనలను బలవంతంగా పక్కకు పెట్టి నిద్రలో కొరిగాడు రాజారాం. నిద్రపోయి లేచినా రాజారాం ముఖంలో ఆందోళన తగ్గలేదు. కాలకృత్యాలు ముగించుకొని టిఫిన్ చేసి సోఫాలో

కూర్చున్నాడు రాజారాం. టిఫిన్ ముగించి తండ్రి పక్కనేకూర్చుంది సరళ. శంకరమ్మొచ్చి వాళ్ళకెదురుగా కూర్చుంది.

"ఏమైంది నాన్నా...! మీరెలాగో ఉన్నారేంది... అసలేం జరిగింది...?" అంది సరళ తండ్రికి మరింత దగ్గరగా జరుగుతూ

"ఏం జరిగిందంటే ఏం చెప్పమంటావమ్మా...? ఆలోచించే మనసుండటం శాపమైంది నాకు... జరిగేవన్నీ చూస్తూ మనం మనం కాకుండాపోవడం భరించలేకుండా పోతున్నానమ్మా...! అసలేం జరుగుతుందో అర్థం కాని దౌర్భాగ్య పరిస్థితి.

"మీరంటున్న దాంట్లో ఒక్క ముక్క కూడా నాకర్థం కాలేదు. అమ్మాయి పెళ్ళి సంబంధం గుర్చి మేం మాట్లాడుతుంటే మీరేమో దాడంటున్నారేంటి...? కొంచెమర్థమయ్యేట్టు చెప్పండి..." అంది విసుగ్గా శంకరమ్మ.

"నువ్వు నీ ఆలోచనలు మనం పెండ్లి చేసుకున్నప్పటి రోజుల్లా ఉంటే నా మాటలు వెంటనే అర్థమయ్యేంది.."

"మళ్ళీ అదేమాట..! అప్పట్లాగే ఇప్పటి కాలముందా అలాగే ఉండటానికి అట్లాగే ఉండడం మీకు సాధ్యమేమోకాని నాక్కాదు" కాలంతోపాటు పరుగెత్తకుంటే మనం చతికిలపడిపోతాం. ఇంతకీ అమ్మాయి సంబంధం విషయమేమైంది...?"

"ఏమయింది...? ఏమీకాలేదు... ఇదివరకు పెళ్ళి సంబంధమంటే చూసేవి కుటుంబ నేపథ్యం... చదువు... సంస్కారం... సాంప్రదాయం... బతుకగలిగే ఆర్థిక స్థితిలో ఉన్నారా?... లేదా...? ఇలాంటివన్నీ చూసేవారు. మరిప్పుడు కావాల్సింది...? ఫారిన్ ఉద్యోగం చేస్తున్నాడా? ఫారిన్‌కెళ్ళి ఉద్యోగం చేస్తాడా? అక్కడ్నే స్థిరపడతాడు కదా! ఇవే కదా చూసేవి... వీటితోపాటు ఎంత భారమైనా సరే కట్నం పేరు మీదో మరో పేరు మీదో ఇచ్చే ఆస్తిపాస్తులు... నువ్వూ... సరళా చెప్పినవీ ఇవే కదా...! మీ ఇష్టప్రకారమే నేనూ వెతుకుతున్నాను. వాళ్ళ నిబంధనలకు మనం మన నిబంధనలకు వాళ్ళూ సరితూగాలి కదా...! ముఖ్యంగా మనం మన అమ్మయిని విదేశాలకర్పించగలగాలి... నీకు కాని, సరళకు కాని ఈ దేశంలో ఉండే సంబంధం అక్కర్లేదాయె... ఇవన్నిటినీ దృష్టిలో పెట్టుకొనే సంబంధాలు వెతుకుతున్నాను...



తండ్రి మాటలకు ముఖం మాడ్చుకుంది సరళ... "నాన్నా...! ప్రపంచమంతా ఓ కుగ్రామంగా మారుతున్న సమయమిది... మీరేమో ఇంకా దేశ సరిహద్దులు... రాష్ట్ర సరిహద్దులు... గ్రామ సరిహద్దులు దాటవద్దంటూండటం ఏం బాగుంది...? ఇప్పుడు దూరాలు నిమిషాల్లోకి మారాయి. మీరింకా పాత పద్ధతిలోనే ఆలోచిస్తున్నారెందుకు...?" అంది...

కూతురు మాటలనే సమర్థించింది శంకరమ్మ...

వాళ్ళ మాటలు వింటున్న రాజారాంకు అరవాలనిపిస్తుంది. మొత్తుకోవాలనిపిస్తుంది.. వస్తున్న కోపాన్ని బలవంతంగా అణుచుకున్నాడు.

"ప్రపంచాన్నంతా ఓ కుగ్రామంగా మారుస్తున్నారు కదతల్లీ...! అంటే ఏందమ్మా..! అనంత వైవిధ్యంతో కూడుకున్నదైన... అందమైన అద్భుతమైన ఈ భూగోళాన్ని ఒకే మూసలోకి తీసుకు రావాలంటావు. మన తిండి, మన వస్తువులు, మన దేశంలో ఉండటమే నామోషీ అంటే ఎలా...? పెళ్ళంటే ఓ సామాజిక బాధ్యత... ఓ కట్టుబాటు... ఓ అనుబంధం... ఓ ఆదర్శం కావాలి కాని డబ్బుతో ముడిపెట్టేదే అయితే ఆ పెళ్ళికి అర్థమేముందమ్మా...? ఇందులో నీ తప్పేముందమ్మా..' చిన్నతనం నుండి నిన్ను గారాబం చేస్తూ ఐస్‌క్రీమ్, కూల్‌డ్రింక్స్, బేకరీ ఫుడ్స్ తినిపించినప్పుడే మొదలయిందీ బలి... అదిప్పుడు సంపూర్ణ స్థితిలో కొచ్చింది. అందుకేనమ్మా మనిషి తనమనేది మచ్చుకు లేకుండా పోతుంది. నాలాంటి వాడు ఎంత మొత్తుకుంటే మాత్రమేం లాభం...? ఆ హోరు ముందు ఇలాంటి గొంతుల ధ్వనెంత బలహీనమైందో తెలుసుకదా...!"

అన్నాడు రాజారాం పొంగుకొస్తున్న ఉద్వేగాన్నాపుకుంటూ... తండ్రి మాటల్లోని లోతునర్థం చేసుకుంది సరళ... కాని వాట్నే మాత్రం సీరియస్‌గా తీసుకోదలుచుకోలేదు. భర్తేంటో అర్థమైనా మాటలకేమాత్రం విలువివ్వదలుచుకోలేదు శంకరమ్మ... తన సహజ ధోరణిలోనే భర్తనాడిపోసుకుంటూ అంది.

"ఊరందరిదొక దారయితే ఉలిపికట్టె దొకదారన్నట్టున్నాయి మీ మాటలు. అందరేమో అమెరికా సుఖమంటుంటే అమెరికా సంబంధాల కొరకు నానా ప్రయత్నాలు చేస్తుంటే మీరేమో మీనమేషాలు లెక్కించినట్టు చేస్తున్నారు... మీ ఆలోచనలు మరీ వెనుకబడున్నాయి..."

"అవునోయ్... నావి వెనుకబడ్డ ఆలోచనలే... డాలర్ల మోజులో పడకుండా ఉండమనడం చాలా బ్యాక్‌వర్డ్ ఆలోచన... అమానవీయతనే అభివృద్ధనుకుంటే నేను అభివృద్ధి నిరోధకున్నా... సరేనా..?"

"మీతో వాదించడం నావల్ల కాదుగాని అసంబంధం సంగతేమైంది...?" అదే చెప్పబోతుంటే మీరు చెప్పనివ్వడం లేదు.. మన సంబంధం అన్ని విధాలా నచ్చిన సంబంధమేనట. మనమ్మాయి చదువు, అందం అన్నీ నచ్చాయట... వాళ్ళకూ అమెరికాలో ఉంటాననే మనమ్మాయి లాంటి వాళ్ళే కావాలట..." అన్నాడు రాజారాం.

"ఒప్పుకున్నారా మరి...?" 'ఒప్పుకోలేదు...' 'ఎందుకు..?" 'అన్ని నచ్చినా ఒకటి మాత్రం నచ్చలేదు..."

"ఏంటది...?" 'మనమిచ్చేకట్నం...'

శంకరమ్మ, సరళ ముఖాలపై ప్రశ్నార్థకాలను చూసాదు రాజారాం..

కొద్దిసేపెవరేం మాట్లాడలేదు.

"మీరెంత కట్న మిస్తామన్నారు...?" అడిగింది శంకరమ్మ.

"పది లక్షలు... ఖర్చులకు మరో పద్నాలుగు లక్షలెలాగూ అవుతాయి కదా...! ఇవి పాతికేళ్ళు చెమటోడ్చి కూడబెట్టిన సంపాదన... మన కుటుంబ నేపథ్యానికి ఇంత కట్నమివ్వడం ఎక్కువే కదా...!" అన్నాడు రాజారాం...

తండ్రి మాటలు పూర్తయ్యాయో లేదో రకీమనంది సరళ... "నాన్నా...? ఈ కాలంలో పది పన్నెండు లక్షలంటే ఏ మూలకు సరిపోతాయి... అమెరికాలో మూడు నెలల జీతం... అంతేకదా...! ఇంత మాత్రానికే మీరు మాకోసమేదో చేసినట్టు, బాగా కష్టపడ్డట్టు మాట్లాడుతున్నారు..."

"నేనందుకే చెప్పాను... బాగా సంపాదించాలని..." అంది శంకరమ్మ...

తాను ఉప్పుడి ఉపాసమున్నా ఫర్వాలేదు పిల్లలను సుఖంగా పెంచాలని, కూతురు పెండ్లి కోసం నానా కష్టాలు పడి కూడబెట్టిన డబ్బును అతి తేలికగా తీసివేసిన కూతుర్ని, భార్యను విస్మయంగా చూస్తున్నాదు రాజారాం.

తానెంతో ఎక్కువనుకున్న డబ్బు వాళ్ళకు లెక్కలోకి రానంతే కావడం అతని కాశ్చర్యకరంగానే ఉంది. చాలా సేపటివరకు వాళ్ళ

మాటల షాక్ నుండి తేరుకోనేలేదు రాజారాం...

నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ మళ్ళీ శంకరమ్మ అంది.

'వాళ్ళెంతడిగారు...?'.. 'ఇరవై లక్షలు...'

'మీరొప్పు కోవాల్సిందీ సంబంధానికి...'

'ఒప్పుకుంటాం సరే... మిగతా డబ్బులు ఎక్కన్నుంచి తెస్తాం...?'

"మీ పి.ఎఫ్.డబ్బు పూర్తిగా తీసేద్దాం... అవసరమైతే ఇక్కడున్న ఇల్లూ అమ్మి పారేద్దాం..."

సహధర్మచారిణి దిక్కు విస్మయంగా చూస్తున్నాడు రాజారాం.

"మనబ్బాయి స్థిరపడటం, తర్వాత మనం బతకడం సంగతటు వదిలి పెడ్దాం... నేనూ కొద్దిసేపు నీలాగే ఆలోచించాను. కాని వాళ్ళు నాకు డబ్బు మనుషుల్లా కనబడ్డారు... వాళ్ళను చూస్తుంటే డబ్బే అన్నిటికీ మూలం డబ్బుతోనే సుఖం అనే వాళ్ళలా కనబడ్డారు. అలాంటి కుటుంబంలో మనమ్మాయి సుఖపడ్తుందని నేననుకోను... అందుకే ఈ సంబంధాన్ని కాదన్నాను..."

భర్త మాటలకు సివంగిలా లేచింది శంకరమ్మ...

"భలే వారండీ మీరు...! మీ పనికిరాని ఆదర్శాలతో పిల్లల భవిష్యత్తును నాశనం చేయకండి. డబ్బుతో కాకుంటే మరిదేంతో సుఖమొస్తుందో నాకైతే అర్థం కాని విషయం... ఇలాంటి మాటలు డబ్బు సంపాదించడం చేతగాని వాళ్ళంటారు... అందుకే పదేళ్ళుగా మొత్తుకుంటున్నాను... అవసరాలు పెరుగుతున్నాయి బాగా సంపాదించాలని మొత్తుకున్నా విన్నారా మీరు...? ఇల్లు కట్టుకున్నాం... పది లక్షలిచ్చి అమ్మాయి పెండ్లి చేస్తాం. ఇంకేందని తృప్తిపడ్డారు. మీరెంతయినా అల్ప సంతోషులు కదా! ఇప్పుడేమో బిచ్చగాల్ల సంబంధం తెస్తానంటున్నారు. ఏదేమైనా మనమ్మాయికి అమెరికా సంబంధం తేవాల్సిందే..." ఖచ్చితంగా చెప్పేసింది శంకరమ్మ...

"నాన్నా...! నాకు అమెరికా సంబంధమే కావాలి... నేనీ దేశంలో ఉండను..."

మరింత ఖచ్చితంగా చెప్పింది సరళ...

భార్య, కూతుర్ల మాటలు వింటున్న రాజారాం తలదిమ్మెక్కిపోతుంది. మనసంతా ఆవేదనతో మూలుగుతుంది....

"తప్పకుండా ఆ సంబంధమే చేస్తానమ్మా...! నా తలతాకట్టు పెట్టయినా, నేనమ్ముడుపోయయినా సరే ఇరవై లక్షల కట్నంతో వచ్చే అమెరికా సంబంధమే తెస్తాను. అందులోనే సుఖముందని మీరంటుంటే కాదనడానికి నేనెవర్ని...? ఇప్పుడే ఫోన్ చేసి వాళ్ళను రమ్మని చెబుతాను. ఈ ఇల్లును అమ్మేచెబుతాను. ఈ రోజే ప్రావిడెంట్ ఫండ్ 80% తీసుకుంటానికి దరఖాస్తు చేస్తాను. సరేనా..?"

అని లేచి నిల్చున్నాడు.

ఆ మాటల్లోని వ్యంగ్యం అర్థమయినా సీరియస్‌గా తీసుకోదలుచుకోలేదు సరళ, శంకరమ్మ...

వాళ్ళ మౌనం రాజారాంను మరింత వేదనకు గురి చేస్తుంది.

"సముద్రాల మీదుగా ఆకాశమార్గాన చెట్లు, గుట్టలు, నదీ నదాలు దాటుకుంటూ సిటీల్లో, నగరాల్లో, గ్రామాల్లోనూ ప్రవేశించి స్వరపిశాచం ఇంటింటికీ ప్రవేశిస్తుంది. దాని ముందు ఆనందంగా తలొగ్గుతానంటే ఆపడం నాబోటివాడికి సాధ్యమవుతుందా...? ఎలక్ట్రానిక్ వస్తువులు, సబ్బులు, నూనెల్నుండి ఆహార పదార్థాల పరకూ చేరిన 'గ్లోబలి' నీటినీ వదల్లేదు... రేపు మనం పీల్చే గాలి కూడా మార్కెట్ సరుకవుతుంది. అప్పుడు మనం గాలి పీల్చుకోవడానికి కూడా ఇతర్ల అనుమతి, ఖరీదు తప్పదు... ఎందుకంటే గ్లోబలీయులు గాలి మీదా పేటెంట్ హక్కులు తీసుకున్నా ఆశ్చర్యపడాల్సిందేం లేదు..."

అన్నాడు ఫోన్ చేతిలోకి తీసుకుంటూ రాజారాం... "గ్లోబలి" అంటేంటి నాన్నా..?"

"గ్లోబును 'బలి' తీసుకోవడం..."

"మరి నా చదువు, సెటిల్‌మెంట్ బుక్స్‌లెలా నాన్నా?" అన్నాడు కొడుకు.

నా సర్వశక్తులొడ్డే సంపాదిస్తాను. నావల్ల కాకుంటే నీ చదువు కోసం చేసిన యునైటెడ్ ఇన్సూరెన్సు డబ్బులు, మిగతా ఖర్చుల కోసం యూలిప్, అభయ, ఎల్.ఐ.సి. డబ్బులు వచ్చేట్టు చేస్తాను. యాక్సిడెంటయితే అదనంగా డబ్బు వస్తుంది. సరేనా...?"

అన్నాడు హైదరాబాద్‌కు ఫోన్ కలుపుతూ.



# మినీలు

**అనిశెట్టి రజిత**

యంత్రంలా మనిషిప్పుడు
ఎన్నో పనులు చేస్తున్నా
మనిషికన్నా మరబొమ్మే
నయంలే అనిపిస్తుందే!
...
కొండంత వెలుగును
మింగే గోరంత చీకటి!
సామాజిక అరాచకం
మనిషి నైచ్యం!!
...
కొయ్య కొరుకుడు పడదు
నిప్పు మింగుడు పడదు
సత్యం సమ్మతం కాదు
నయవంచనే ముద్దు!
...
తిన్నది అరగని
రోగం కొందరికి
తినడానికే లేని
అభాగ్యం ఎందరికో!
...
తరిమికొట్టు
పాతరబెట్టు
దోపిడీదారు
ఎవడైతేమి!

# ఆధునిక తెలుగు సాహిత్యంపై మేధామథనం



ప్రసంగిస్తున్న శివారెడ్డి, వేదికపై ఎస్వీ, ఓల్గా, కేతు

ప్రొ॥ ఎస్వీ సత్యనారాయణ

'20వ శతాబ్దం తెలుగు సాహిత్య చరిత్రలో ఒక విశిష్టమైన మైలురాయి. అనేక సాహిత్య ప్రక్రియలు, ధోరణులు, ఉద్యమాలతో సుసంపన్నమయిన శతాబ్దమిది. తెలుగునాట తలెత్తిన సకల సామాజిక, రాజకీయ, సాంస్కృతికోద్యమాలకు ఇక్కడి రచయితలు స్పందించారు. అద్భుతమైన సాహిత్య ప్రక్రియలను, కళారూపాలను సృజించారు. ప్రతి దశాబ్దం ఒక వినూత్న ప్రక్రియతో, ధోరణితో పులకించిపోయింది. ప్రతి సాహిత్య ధోరణి ఒక కొత్తతరం కవులనూ, రచయితలనూ, విమర్శకులనూ రూపొందించుకున్నది. ఆయా సాహిత్య ధోరణులన్నీ ఆయా నిర్దిష్టమైన చారిత్రక, సామాజిక, రాజకీయ నేపథ్యాల నుండి ఆవిర్భవించాయి. ఒక సాహిత్య ధోరణి వైఫల్యం నుండి మరొక సాహిత్య ధోరణి ఆవిర్భవించదు, ఒక ధోరణికి మరొకటి కొనసాగింపుకాదు, ఒక నూతన ధోరణి రాగానే, అప్పటి దాకా కొనసాగుతున్న సాహిత్య ధోరణి అంతరించదు, అదృశ్యంకాదు. ఉధృతిలో హెచ్చు, తగ్గులు ఉండవచ్చు. ఆయా సాహిత్య ధోరణుల ప్రచార, ప్రాచుర్యాలకు కృషి చేస్తున్న సాహితీ సంస్థల కార్యకలాపాలలో ఒడిదుడుకులు, ఆటుపోట్లు రావచ్చు. సాహితీ సృజనవేరు, సంస్థాగత కార్యక్రమాల పరిమితులు వేరు. సంక్లిష్టమైన భారతీయ సామాజిక జీవితంలో ఏకకాలంలో అనేక సాహిత్య ధోరణులు, ఉద్యమాలు సమాంతర స్రవంతులుగా ప్రవహిస్తూ ఉంటాయి. వాటి లక్ష్యాలను ప్రచారం చేస్తూ ఉంటాయి.'

ఈ అవగాహనతో రాష్ట్ర, రాష్ట్రేతర డిగ్రీ కళాశాలల తెలుగు అధ్యాపకుల కోసం ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని యుజిసి అకడమిక్ స్టాఫ్ కాలేజీలో "ఆధునిక సాహిత్యం – విభిన్న ప్రక్రియలు, ధోరణులు, ఉద్యమాలు" అన్న ప్రధానాంశంపై మూడు వారాలపాటు (జులై 7-28, 2004) పునశ్చరణ తరగతులు నిర్వహింపబడినాయి.

జులై 7న ఉదయం అకడమిక్ స్టాఫ్ కాలేజీ సంచాలకులు ప్రొ॥ వి.ఎల్. విశ్వేశ్వరరావు అధ్యక్షతన జరిగిన పునశ్చరణ తరగతుల ప్రారంభోత్సవ సదస్సుకుతెలుగు అకాడమీ సంచాలకులు డా॥ ఆవుల మంజులత ముఖ్యఅతిథిగా హాజరయ్యారు. పునశ్చరణ తరగతులను ప్రారంభిస్తూ – 'భాషలో, భావ వ్యక్తీకరణంలో విద్యార్థులకు, అధ్యాపకులకు స్పష్టత అవసరం. సమాజంలోనూ, సాహిత్యంలోనూ నిరంతరం జరుగుతున్న పరిణామాలకు అధ్యయనం చేయాలి. తద్వారా మన విశ్లేషణా పరిధి విస్తృతమవుతుంది' అంటూ డా॥ మంజులత అభిభాషించారు. ఉస్మానియా తెలుగుశాఖ సీనియర్ ఆచార్యుడు ఎల్లూరి శివారెడ్డి, సుమతీ నరేంద్రలు పునశ్చరణ తరగతుల ప్రయోజనాన్ని వివరించారు.

'ఆధునిక సాహిత్యనేపథ్యాన్ని' డా॥ అద్దేపల్లి రామ్మోహనరావు విశ్లేషిస్తూ 'ఆధునికత అన్నది కేవలం కాలవాచికాదు, భావవాచి. భావం ప్రధానమైనది. సంప్రదాయాలనూ, సంప్రదాయకమైన విశ్వాసాలనూ, ఆచారాలనూ హేతువాద దృష్టితో, ఆధునిక విజ్ఞాన శాస్త్రాల దృష్టితో పరిశీలించేది ఆధునికత. విద్యాలయాలు, విశ్వవిద్యాలయాలు, ఆంగ్ల విద్య, పాశ్చాత్య సాహిత్య పరిచయం, పత్రికలు, ప్రచార సాధనాలు –సంఘ సంస్కరణోద్యమాలు, జాతీయోద్యమ ప్రభావాలతో ఆవిర్భవించినది ఆధునికత. ఆధునిక చైతన్యంతో వెలువడినదే ఆధునిక సాహిత్యం' అంటూ వివరించారు.

'ప్రాచీన సాహిత్యం – పునర్మూల్యాంకనం' అన్న అంశంపై ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య ప్రసంగిస్తూ – 'మూల్యాంకనం అంటే వెలకట్టడం. పునర్మూల్యాంకనమంటే మళ్ళీ వెలకట్టడం. సాహిత్య మూల్యాంకనంలో తుది నిర్ణయాలుండవు. కాలానుగుణంగా, మారిన ఆలోచనా ధోరణుల దృష్టి కోణాలతో పునర్మూల్యాంకనం జరపడం సాహిత్య చరిత్ర అధ్యయనానికి తోడ్పడుతుంది' అన్నారు.

'ఆధునిక సాహిత్యంపై పాశ్చాత్య సాహిత్య ప్రభావాన్ని' ఆర్వీయార్ వివరించారు.

'ఆధునిక సాహిత్య విమర్శ – శైలీ పరిశీలనం' అన్న అంశంపై ప్రసంగించిన ఆచార్య పరిమి రామ నరసింహం – 'వస్తువుపై జరుగుతున్నంత చర్చ సాహిత్య ప్రక్రియల శైలిపై నిర్మాణ పద్ధతులపై జరుగకపోవడం ఒక వెలితిని సూచిస్తున్నది. ప్రతి ప్రక్రియనూ, దాని శైలిని బట్టి అధ్యయనం చేయడానికి వీలున్నది' అంటూ కథానిక నిర్మాణాన్ని శైల్యాత్మకంగా విశ్లేషించారు.

'ఆధునిక సాహిత్య ఉద్యమాల'ను విశ్లేషించిన నిఖిలేశ్వర్ వాటి పూర్వరంగాలను ఏర్పరిచిన సామాజిక, రాజకీయ సిద్ధాంతాలనూ, పరిణామాలనూ వివరించారు. యూరప్‌లో ప్రారంభమైన సర్రియలిజం, క్యూబిజం, సింబాలిజం, డాడాయిజం మొదలైన సాహితోద్యమాల ప్రభావం తెలుగు సాహిత్యంపై పడిన తీరును తులనాత్మకంగా వివేచించారు.

కవిత, కథ, నవల, విమర్శ, పత్రికారచన, స్వీయ చరిత్ర, జీవిత చరిత్ర, నాటకం, నాటిక మొదలైన ఆధునిక సాహిత్య ప్రక్రియల ఆవిర్భావ, వికాసాలను ఆచార్య ఎస్వీరామారావు వివరించారు.

'సంప్రదాయ సాహిత్యంపై తొలి తిరుగుబాటు భావకవిత్వం. ఛందస్సులో, భాషలో, భావవ్యక్తీకరణంలో నవ్యతను సాధించింది కాబట్టి నవ్యకవిత్వంగా, కాల్పనికత ప్రధానమైనది కనుక కాల్పనిక కవిత్వమని దీనిని విమర్శకులు పరిగణించారు. ప్రకృతి ప్రీతి, ఆత్మాశ్రయ పద్ధతి, ఊహాప్రేయసి వర్ణన, ఉదాత్త ప్రణయం మొదలైన అంశాలను తెలుగు సాహిత్యానికందించిన భావకవిత్వం'పై డా॥ నిడమర్తి నిర్మల అధ్యయన ప్రసంగం చేశారు.

'ఆధునిక సాహిత్యం-చైతన్య స్రవంతి' అన్న అంశంపై మాట్లాడిన 'అంపశయ్య' నవీన్ - 'మానవుని అంతశ్చేతన ప్రవాహశీలనమైనదని సాహిత్య అభివ్యక్తియే చైతన్య స్రవంతి' అంటూ ఆంధ్రాంగ్ల భాషల్లో వెలువడిన చైతన్య స్రవంతి సాహిత్య ప్రక్రియలను సోదాహరణ పూర్వకంగా వివరించారు.

'సామాజిక చైతన్యం, సవిమర్శక వాస్తవికత, సమసమాజ నిర్మాణ ఆకాంక్షలను సాహిత్యానికి ప్రాణవాయువులుగా మలిచింది అభ్యుదయ సాహిత్యోద్యమం' అంటూ ఆచార్య ఎస్వీ సత్యనారాయణ అభ్యుదయ సాహిత్యోద్యమ పూర్వాపరాలను వివరించారు.

'భారత జాతీయోద్యమంలో విలక్షణమైనదీ, విశిష్టమైనదీ తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం. మట్టి మనుషుల నుండి మహాకవులను రూపొందించుకున్నదీ, సామాన్య ప్రజల నుండి మాన్యులైన మహానాయకులను సృష్టించుకున్నదీ తెలంగాణా సాయుధ పోరాటం. జాతీయ, అంతర్జాతీయ రచయితలను ప్రభావితం చేసిన ఈ మహోద్యమం సహజంగానే తెలుగు సాహిత్యాన్ని నేటికీ ప్రభావితం చేస్తున్నది' అంటూ కందిమళ్ళ ప్రతాపరెడ్డి 'తెలంగాణా సాయుధ పోరాట సాహిత్యాన్ని' విశ్లేషించారు.

'భూమికోసం, భుక్తి కోసం, మాతృభాష పరిరక్షణ కోసం సాగిన ప్రజోద్యమం తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం' అంటూ డా॥దాశరథి రంగాచార్య తమ జీవిత, సాహిత్య విశేషాలను వివరించారు.

'ఇంగ్లీష్ రొమాంటిసిజం - తెలుగు కాల్పనికతల మధ్య సారూప్యత'లను డా॥పూసల లక్ష్మీనారాయణ తులనాత్మకంగా వివరించారు.

'ఆధునిక సాహిత్యం - దీర్ఘకవితలు' అన్న అంశంపై డా॥శిఖామణి ఆసక్తికరమైన అధ్యయన ప్రసంగం చేశారు.

'దిగంబర కవిత్వం' పై ప్రసంగించిన జ్వాలాముఖి - 'తెలుగు సాహిత్యంలో స్తబ్దతను బద్దలు కొట్టింది దిగంబర కవిత్వం. సంకోచాలు లేకుండా విభిన్న ప్రజాశ్రేణులు తమ ఆగ్రహాన్ని, అసంతృప్తినీ, నిరసననూ ప్రకటించే మార్గాన్ని చూపిందది' అంటూ ఈ ధోరణి నేపథ్యాన్ని వివరించారు. ప్రసంగాంతంలో 'తిట్టు మేల్కొలుపు కాదనీ, బూతు పరిష్కారం కాజాలదనీ' ఆత్మవిమర్శనాత్మకంగా విశ్లేషించారు.

'అనువాద విధానాలు' అన్న అంశంపై ఆచార్య కె. కుసుమాబాయి అధ్యయన ప్రసంగం చేస్తూ సాహిత్యానువాదంలో ఎదురయ్యే సమస్యలను వివరించడంతోపాటు పరిష్కార మార్గాలను సూచించారు.

'సాహిత్యాన్ని, సమాజాన్ని, చరిత్రను దళితుల దృక్కోణం నుండి అధ్యయనం చేయాల్సిన లో చూపునిచ్చింది దళిత సాహిత్యం. దళితులు నేడు విద్యావంతులౌతున్నారు. చైతన్యవంతులౌతున్నారు. తమ జీవితానుభవాలనూ, సంవేదనలనూ, ఆగ్రహాన్ని ప్రతిభావంతంగా ఆవిష్కరిస్తున్నారు' అంటూ దళిత సాహిత్య నేపథ్యాన్ని డా॥ ఎండ్లూరి సుధాకర్ వివరించారు. 'దళిత సాహిత్యంతో పాటు నేడు వేగంగా దూసుకువస్తున్న సమకాలీన సాహిత్య ధోరణి బహుజన కవిత్వం' అంటూ వెంటాడే కలాలనూ -వెనుకబడిన కులాలనూ; వారి అభివ్యక్తినీ విశ్లేషించారు.

'భారతీయ సాహిత్య భావన' అన్న అంశంపై ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి ప్రసంగిస్తూ - 'భారతదేశంలో పుట్టి పెరిగిన రచయితలు ఇక్కడి ఏ భాషలో సాహిత్యాన్ని సృజించినా అది భారతీయ సాహిత్యమే. ఠాగూర్, శరత్, ప్రేంచంద్, గురజాడ, శ్రీశ్రీ, సుబ్రహ్మణ్యభారతి మొదలైన రచయితల సాహిత్యమంతా భారతీయ సాహిత్యమే' అన్నారు. 'భారతీయ సాహిత్య భావనను విస్తరిస్తే విశ్వసాహిత్యభావన' అవుతుందన్నారు డా॥ రాచపాళెం.

'విప్లవ సాహిత్యోద్యమం'పై డా॥పెండ్యాల వరవరరావు - 'దాదాపు మూడున్నర దశాబ్దాలుగా యావత్ భారతీయ సాహిత్యాన్నీ, ముఖ్యంగా తెలుగు సాహిత్యాన్నీ ప్రభావితం చేస్తూ, సామాన్య మానవుల నుండి కవులనూ, కళాకారులనూ సృష్టించుకున్న మహోద్యమం విప్లవసాహిత్యోద్యమం. మార్క్సిజం-లెనినిజం- మావో ఆలోచనా విధానం ఈ సాహిత్యోద్యమానికి సిద్ధాంత భూమిక. కాగా నక్సల్‌బరీ పోరాటం దీని దిక్సూచి' అంటూ వివరించారు.

'తెలుగు వాక్య నిర్మాణం - కొన్ని విశేషాలు' అన్న అంశంపై ఆచార్య చేకూరి రామారావు అధ్యాయన ప్రసంగం చేశారు.

'అసమానతలనూ, వివక్షతలనూ ప్రశ్నిస్తూ స్త్రీలు తమ జీవితానుభవాలనూ, అనుభూతులనూ ప్రతిభావంతంగా వ్యక్తీకరిస్తున్న సమకాలీన సాహిత్య ధోరణి స్త్రీవాదసాహిత్యం, సమాజాన్నీ, సాహిత్యాన్నీ స్త్రీల దృక్కోణం నుండి చూసే తాత్విక దృష్టినిచ్చింది స్త్రీవాద సాహిత్యం' అంటూ విశ్లేషించారు ఆచార్య పి. సుమతీనరేంద్ర.

'ఆధునిక సాహిత్యం - దళిత కథ'



హాజరైన అధ్యాపకులు

అన్న అంశంపై ప్రసంగించిన డా॥ ననుమానస్వామి సమకాలీన కథల్లో వ్యక్తమవుతున్న దళిత జీవిత వాస్తవికతను ఆవిష్కరించారు.

'ఆధునిక సాహిత్యంలో సినిమాగీతం ఒక విలక్షణమైన సాహిత్య ప్రక్రియ. ఒక్క పద్యమైనా రాని అక్షరాస్యులుండవచ్చు, కానీ ఒక్క సినిమాపాటైనా రాని నిరక్షరాస్యులు కూడా ఉండరు' అంటూ ఆచార్య టి. గౌరీశంకర్ 'తెలుగు సినిమాగీతాల్లో సాహిత్య విలువలు' అన్న అంశంపై సోదాహరణ ప్రసంగం చేశారు.

'జీవితమంటే ఆకలి, కన్నీరు, రక్తం మాత్రమే కాదు, సున్నితమైన మానవ అనుబంధాలు, మారిపోతున్న మానవ విలువలు కూడా జీవితంలో భాగమే. కవిత్వానికి కేంద్ర బిందువు మనిషి. వాటి బాల్యం, చదువు, యవ్వనం, వృద్ధాప్యం, ఉద్యోగాలు మరియు ఉద్యమాలు వంటి విభిన్న జీవన పార్శ్వాలను నేటి కవిత్వం వ్యక్తీకరిస్తున్న' సంవిధానాన్ని శ్రీ మంగరి రాజేందర్ (జింబో) వివరించారు.

'సమకాలీన సాహిత్యం - ప్రాంతీయ చైతన్యం' అన్న అంశంపై ప్రసంగించిన డా॥తుమ్మల రామకృష్ణ, ఇప్పుడు వెలువడుతున్న కవిత్వంలో, కథల్లో వ్యక్తమవుతున్న రాయలసీమ చైతన్యాన్ని విశ్లేషించారు. 'తెలుగు కథానిక వస్తువు - శిల్పం' అన్న అంశంపై మాట్లాడిన డా॥ తుమ్మల రామకృష్ణ కథానిక పరిణామాన్ని వివరించారు.

'ఆధునికానంతర సాహిత్య ధోరణులు' అన్న అంశంపై ప్రసంగించిన డా॥ కె.ఎస్. రమణ - దళిత సాహిత్యం, స్త్రీవాద సాహిత్యం, ముస్లిం మైనారిటీ వాద సాహిత్యం, ప్రాంతీయ సాహిత్యం మొదలైన శాఖోపశాఖలుగా విస్తరిస్తున్న ధోరణుల నేపథ్యాలను వివేచించారు.

'అనుభూతి కవిత్వం-ఒక పరిశీలన' అన్న అంశం పై ప్రసంగించిన ఇంద్రగంటి శ్రీకాంతశర్మ - 'కవి తన అనుభవాలనూ, అనుభూతులనూ కవిత్వంగా చెప్పడమే అనుభూతి కవిత్వం. అనుభూతి ఉంటే తప్ప సాధ్యం కానిది కవిత్వం' అన్నారు.

'ఆధునిక భారతీయ కవిత్వం' అన్న అంశంపై మాట్లాడిన డా॥దేవరాజు మహారాజు విభిన్న భాషల నుండి తెలుగులోకి అనువదింపబడిన ఉత్తమ కవితాఖండికలను తులనాత్మకంగా వివరించారు.

'పత్రికలు- ప్రసార సాధనాలు -సాహిత్యం' అన్న ప్రసంగంలో తెలకపల్లి రవి


............ ★ ............

**'ఆధునిక సాహిత్యం - పునర్మూల్యాంకనం' అన్న అంశంపై మాట్లాడిన ఆచార్య కె.కె. రంగనాథా చార్యులు - 'ప్రాచీన సాహిత్యం పూర్తయిన తరువాత పునర్మూల్యాంకనం జరిగితే, ఆధునిక సాహిత్యం కొనసాగు తున్న సందర్భంలోనే మూల్యాంకనం, పునర్మూల్యాంకనాలు జరగడం విశేషం' అన్నారు.**

............ ★ ............


వివిధ దశల్లో వచ్చిన మార్పులను, చారిత్రకాంశాలను వివరించారు. పత్రికలు సాహిత్యానికి, భాషకు చేసిన దోహదాన్ని అదే సమయంలో వ్యాపార లక్షణాల వల్ల కలిగిన హానిని చెప్పారు. పత్రికలు మాత్రం పైన సాహిత్య వికాసానికి దోహదపడుతున్నా యన్నారు. ఎలక్ట్రానిక్ మీడియాలో వినోద విభాగంలో మాత్రం సాహిత్య స్పర్శ ఉండదని, సినిమాల్లో అత్యధిక భాగం అంతేనని చెప్పారు.

'ఆధునిక నాటక రంగం'పై డా॥ప్రదీప్ కుమార్ ఆసక్తికరమైన అధ్యయన ప్రసంగం చేశారు.

'కార్టూన్ ప్రక్రియ కూడా సాహిత్యంలో భాగమే. దృశ్యం, హాస్యం, వ్యాఖ్యానాల సముచిత సమ్మేళనమే కార్టూన్. ఒక వ్యక్తినిగానీ, వ్యవస్థనుగానీ అధిక్షేపించ డానికైనా, అతిశయింపజేయడానికి ఉపయోగ పడుతున్న బలమైన సాహిత్య ప్రక్రియ ఇది' అంటూ శ్రీధర్ 'సమకాలీన కార్టూన్'లను గురించి వివరించారు.

'ఆధునిక జీవితం ఆధునిక సాహిత్యానికి ప్రాతిపదిక. సాహిత్యంలో వస్తువు మారినప్పుడల్లా, రూపంలోనూ మార్పు లొస్తాయి. వస్తువూ-రూపం రెండింటి సముచిత సమన్వయమే గొప్ప సాహిత్యం' అంటూ కె. శివారెడ్డి, కేతు విశ్వనాథరెడ్డి, ఓల్గా విశ్లేషించారు. 'భారత సామాజిక వ్యవస్థలో అనేక వైరుధ్యా లున్నాయి. ఇవన్నీ నేటి కవిత్వంలో ప్రతిఫలిస్తు న్నాయి' అంటూ కె. శివారెడ్డి వ్యాఖ్యానించారు.

'ఆధునిక కవిత్వం, ఆధునిక కథ దాదాపు ఒకే కాలంలో పుట్టాయి. ఆధునిక చైతన్యం రచయితలకు భవిష్యత్తుపై ఆశనూ, సమాజంపట్ల బాధ్యతనూ పెంచింది. సామాజిక చలనానికీ, సాహిత్య చలనానికీ స్పష్టమైన సంబంధం ఉంటుంది' అన్నారు ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి.

'ఆధునిక సాహిత్యంలో తొలి ప్రక్రియ నవల. సమాజంలో కొందరు ఆడవాళ్ళుగా పుడతారు. కొందరు అంటరానివాళ్ళుగా పుడతారు. చరిత్ర నుండి సాహిత్యానికీ, సాహిత్యం నుండి చరిత్రకూ రావడం గొప్ప అనుభవం. సామాజిక వ్యవస్థలో ఇతర అంశాలతోపాటు పితృస్వామిక స్వభావం కూడా ఉంది. నేటి స్త్రీవాద నవలలు ఈ పితృస్వామిక భావజాలంపై ప్రతిఘటన చైతన్యంతో వెలువడుతున్నాయి' అంటూ ఓల్గా విశ్లేషించారు.

'ఆధునిక సాహిత్యం - పునర్మూల్యాంకనం' అన్న అంశంపై మాట్లాడిన ఆచార్య కె.కె. రంగనాథాచార్యులు - 'ప్రాచీన సాహిత్యం పూర్తయిన తరువాత పునర్మూల్యాంకనం జరిగితే, ఆధునిక సాహిత్యం కొనసాగుతున్న సందర్భంలోనే మూల్యాంకనం, పునర్మూల్యాంకనాలు జరగడం విశేషం' అన్నారు. 'ఆధునికత ఇంకా ఉడుకుతున్న దశలోనే ఉన్నది. ఆధునిక జీవన విధానం మన తాత్వికతలో భాగం కానేలేదు, ఆధునికానంతర దశ ఎక్కడిదీ?' అంటూ కె.కె.ఆర్. ప్రశ్నించారు.

'ఆధునిక సాహిత్య విస్తృతిని పెంచింది స్త్రీల సాహిత్యం' అంటూ 'స్వాతంత్ర్యానికి పూర్వం స్త్రీల సాహిత్యం, 'స్వాతంత్ర్యానంతర స్త్రీల సాహిత్యం' అన్న అంశాలపై ఆచార్య కాత్యాయిని విద్మహే విశ్లేషణాత్మక ప్రసంగాలు చేశారు. 'సమకాలీన సాహిత్యం - తెలంగాణ చైతన్యం' అన్న అంశంపై గుడిపాటి వెంకటేశ్వర్లు, 'రేడియో రచనలు' అన్న అంశంపై సుధామ, 'ప్రచార సాధనాలు-సాహిత్యం' అన్న అంశంపై మాటీవీ సతీష్ సోదాహరణ పూర్వక ప్రసంగాలు చేశారు.

ఆట-పాట-మాటల మేలు కలయిక, ప్రజాగాయకుడు గద్దర్ - 'ప్రజా ఉద్యమాలు -పాట' అన్న అంశంపై ప్రసంగిస్తూ 'నిర్బంధాలనూ, అణచివేతలనూ ఎదుర్కొంటూ ప్రజల చైతన్యాన్ని పదును బెడుతున్న బలమైన సాధనం పాట. ఆధునిక సాహిత్యానికి అంతర్వాహిని పాట. అక్షరాస్యులనూ, నిరక్షరాస్యులనూ అందరినీ ప్రభావితం చేస్తున్న పాట'లను పాడుతూ, వాటి నేపథ్యాలను వివరించారు. డా॥సి. నారాయణరెడ్డి సమాపన ప్రసంగంలో ఆధునిక సాహిత్య విశేషాలను విశ్లేషించారు.



# 'పంచమం' నవలలో స్త్రీ

సమూహచైతన్యం పెరిగితే తప్ప ఉద్యోగాల్లోనో, చదువుల్లోనో నలుగురికి చోటు కల్పించినంతలోనే దళిత జీవితాలు గట్టెక్కబోవనే వాస్తవాన్ని చెప్పే నవల పంచమం. 'సమకాలీన తెలుగు జీవితంలో గతకొన్ని దశాబ్దాలుగా వస్తున్న మార్పుని, కులాలలోని 'సంచలనాన్ని పరిశీలించే నవల ఈ పంచమం. 'పంచమం' నవలలో ఐదు స్త్రీ పాత్రలు కనిపిస్తాయి. పద్మ, వెంకటమ్మ, శ్రీలత, రుక్మిణి, హైమ. వీరిలో పద్మ, వెంకటమ్మ, రుక్మిణి, హైమ గ్రామీణ స్త్రీలు. శ్రీలత పట్టణస్త్రీ. దళిత స్త్రీ. పద్మ చదువుకొంది. అయితే తను కూడా పల్లెలోనే వుంటుంది. ఇందులో పద్మ, వెంకటమ్మ, రుక్మిణి వీరు ముగ్గురు కూడా అగ్రవర్ణానికి చెందిన స్త్రీలు. శ్రీలత దళిత స్త్రీ. హైమ పంజాబు స్త్రీ.

యర్రదొడ్డి సుభాషిణి

అనంతపురం జిల్లా కలెక్టరు కార్యాలయంలో సీనియర్ అసిస్టెంట్‌గా ఉద్యోగం చేస్తున్న చిలుకూరి దేవపుత్ర 1977 నుండే రచనా వ్యాసంగం కొనసాగిస్తున్నారు. ఇంత వరకు వివిధ పత్రికలతో ఎనభైకి పైగా కథలు ప్రచురితమైనాయి. వీటిలో కొన్ని ఆంగ్ల, హిందీ, మరాఠీ, కన్నడ భాషల్లోకి అనువాదమైనాయి. 'ఆరుగ్లాసులు', 'ఏకాకి నౌక చప్పుడు', అనే శీర్షికలలో రెండు కథా సంకలనాలు ఇప్పటి దాకా వెలువరించారు. మొదటి సంకలనానికి 1990 'నూతలపాటి సాహితీ సత్కారం' రెండవదానికి 1996 "హిమబిందు" అవార్డు లభించాయి. "అద్దంలో చందమామ", "చీకటిపూలు" అన్న నవలలు ''స్వాతి'' మాసపత్రికలో అనుబంధాలుగా వచ్చాయి. 'పంచమం' ఆయన నాలుగో నవల.

ఉందేల విజ్ఞాన కళాపీఠం తరఫున హైదరాబాద్‌లో 1998 ఆగస్టు 23న జరిగిన సభలో ఆటా-వార్త నవలల పోటీలో మూడో బహుమతి పొందిన నవల "పంచమం".

సమూహచైతన్యం పెరిగితే తప్ప ఉద్యోగాల్లోనో, చదువుల్లోనో నలుగురికి చోటు కల్పించినంతలోనే దళిత జీవితాలు గట్టెక్కబోవనే వాస్తవాన్ని చెప్పే నవల పంచమం. 'సమకాలీన తెలుగు జీవితంలో గతకొన్ని దశాబ్దాలుగా వస్తున్న మార్పుని, కులాలలోని 'సంచలనాన్ని పరిశీలించే నవల ఈ పంచమం.

'పంచమం' నవలలో ఐదు స్త్రీ పాత్రలు కనిపిస్తాయి. పద్మ, వెంకటమ్మ, శ్రీలత, రుక్మిణి, హైమ. వీరిలో పద్మ, వెంకటమ్మ, రుక్మిణి, హైమ గ్రామీణ స్త్రీలు. శ్రీలత పట్టణస్త్రీ. దళిత స్త్రీ. పద్మ చదువుకొంది. అయితే తను కూడా పల్లెలోనే వుంటుంది. ఇందులో పద్మ, వెంకటమ్మ, రుక్మిణి వీరు ముగ్గురు కూడా అగ్రవర్ణానికి చెందిన స్త్రీలు. శ్రీలత దళిత స్త్రీ. హైమ పంజాబు స్త్రీ.

పద్మ, శివయ్య క్లాస్‌మేట్స్, శివయ్య దళితుడు. అయితే పద్మ ఎప్పుడూ శివయ్యకంటే బాగా చదివేది. మంచి మార్కులు వచ్చేవి. అలా చదివే అమ్మాయిని వాళ్ళ నాన్న మధ్యలోనే ఆపేస్తాడు. శివయ్య ఇంటర్ ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యాడన్న విషయం విని పద్మ తల్లి వెంకటమ్మ ఇలా అంటుంది. "మా పాపా సదువుకోని వుంటే నీ మాదిరి ఇప్పుడు ఇంటరు పాసయితుండె. దానికి పెండ్లి చెయ్యకపాయె. సదువూ సదివియ్యకపాయె వాళ్ళనాయన! ఏందోలే శివయ్యా! ఆడపుట్టక పుట్ట గూడదప్పా.. ఏంటివీ అబ్బువు! పెండ్లి చేసుకోని మొగునింటికి పోవల్లంతే"! (పుట : 25-పంచమం) అంటూ ఇక్కడ పద్మ చదువుకోవడానికి తండ్రి అవకాశం ఇవ్వలేదని తల్లి వాపోతుంది.

హైస్కూల్లో ఎస్.ఎస్.సి. వరకూ చదువుకున్న పద్మను తండ్రి పరీక్షలు రాయనివ్వకుండా చదువు మాన్పించి వాళ్ళ ఊరికి తీసుకొచ్చేస్తాడు. "ఎందుకు మాన్పిస్తివి? తెలివైన పిల్లయా డాకటరు కోరుసో సదివిస్తే బాగుంటాది" అని పద్మావతి తల్లి ఎంత మొత్తుకున్నా ప్రాధేయపడినా వినడు. స్త్రీకి కనీసం చదువుకోవడానికి కూడా స్వేచ్ఛ లేకుండా పోయింది.

''అసలు ఆడపిల్లకి సదువే అవసరంలేదు. అది ఇప్పటికే ఎక్కువ సదివింది. ఇంకా ఎక్కువ సదివితే దానికి తగిన మొగుణ్ణి తీసుకరావల్లంటే మనకుండే భూములన్నీ అమ్మేసినా తక్కువ బడతాది!" అదీ అతని వాదన. కాలాలు బాగాలేవు అన్నది కూడా లోలోపల అతనిలో లేకపోలేదు. (పుట : 26-పంచమం)

ఈ మాటలను పరిశీలిస్తే సమాజంలో స్త్రీకి అభద్రత వుంది. ఇక్కడ పద్మ తండ్రి ఆంతర్యాన్ని పరికిస్తే ఆడపిల్లలని ఎక్కువ చదివిస్తే తగిన వ్యక్తిని భర్తగా తీసుకురాలేనన్నది అతని ఆవేదన. ఆడపిల్ల చదువుకోవడంవల్ల కూడా సమస్యలు ఎదురవుతున్నాయి. ఎక్కువ చదివితే తనకంటే ఎక్కువ చదివిన వ్యక్తిని వెతికి తీసుకురావడం అనేది సమస్య. ఒక రకంగా చెప్పాలంటే వరకట్నం అనేది ప్రధాన సమస్యగా కనిపిస్తున్నది.

పద్మ ఎస్.ఎస్.సి. వరకూ పట్టణంలో చదువుకొంది. ఆ రోజుల్లో శ్రీలత పరిచయం అవుతుంది. శ్రీలత, రామారావు భార్యాభర్తలు. శ్రీలత దళిత స్త్రీ అన్న విషయం తెలియని పద్మ ఆమె వండిన భోజనం ఎంతో ఆనందంగా తింటుంది. చాలా బాగున్నాయని మెచ్చుకుంటుంది. శ్రీలతకు పచ్చళ్ళన్నా, వాళ్ళ కొరివి కారమన్నా మహా మహా ఇష్టం. అలా ఎంతో ఇష్టంగా శ్రీలత వండినవి తినేది పద్మ. ఎంతో ఇష్టంగా తిన్నటువంటి పద్మ శ్రీలతది మాలకులం అని తెలిసే సరికి అసహ్యించుకుంటుంది. తను ఇన్నాళ్ళు అమృతంలా తిన్నదంతా 'మాలకూడు' అని నీచంగా అనుకుంటుంది. అంతలోనే రామారావు వైశ్యుడు కనుక మాలకూడు కాదు వైశ్యకూడు అనుకుంటుంది. వైశ్యుడిని పెళ్ళి చేసుకొంది కనుక అది వైశ్యభోజనం అయింది. ఇక్కడ కులపరంగా సాటి స్త్రీని అసహ్యంగా చూస్తుంది. ఇందులో కులం అనేది ప్రధాన సమస్యగా వున్నది. ఆమె ఎంతో అందంగా వుందనీ, మంచి కళాతత్త్వం వుందనీ, అమృతంలా వండుతుందనీ పొగడిన స్త్రీయే కులం తెలిసే సరికి అది నీచకూడని అసహ్యించుకుంటుంది.

గ్రామీణ వాతావరణంలో తల్లితండ్రుల చాందసభావాల మధ్య పెరిగిన పద్మ ఎస్.ఎస్.సి. వరకూ పట్టణంలో చదువుకుంటుంది. పట్టణంలో పెరిగిన కొన్ని రోజులకు పద్మలో మార్పు వస్తుంది. అది వరకు కులాన్ని అసహ్యించుకున్న పద్మలో చాలా మార్పు

కన్పిస్తుంది. తన క్లాస్‌మేట్ అయిన శివయ్యకు పద్మతల్లి సత్తుగ్లాసులో టీ ఇచ్చి, తనకి స్టీల్ గ్లాసులో ఇవ్వడం భరించలేకపోతుంది. అలా ఎందుకిస్తున్నావని తల్లితో వాదించలేదు. ఆ విధంగా ధైర్యంగా తల్లికి చెప్పే స్వేచ్ఛ తనకి లేదు. అందుకే వాళ్ళమ్మకు తెలియకుండా శివయ్యకు స్టీల్ గ్లాసుతో కాఫీ ఇస్తుంది. పద్మకి కుల పట్టింపులు లేకపోయినా తన తల్లికి భయపడుతుంది.

పద్మ శివయ్యని ప్రేమిస్తుంది. తన ఇష్టాన్ని శివయ్యతో వ్యక్తం చేస్తుంది. అయితే శివయ్య తిరస్కరిస్తాడు. కారణం కుల సమస్య. తను దళితుడు. ఆమె అగ్రవర్ణానికి చెందిందని వద్దంటాడు. తనని పెళ్ళి చేసుకొంటే పల్లెలోని తన తల్లితండ్రుల్నీ, తన్నీ బతకనిస్తారా? పద్మ తల్లితండ్రులూ బంధువులూ... అనుకుంటూ...

"సారీ పద్మా నేను నిన్ను ఇష్టపడిన మాట నిజమే.. కానీ నా కులం నిన్ను ప్రేమించే దానికి ప్రోత్సహించలేదు. లోకమంతా హీనంగా చూసే కులంలో పుట్టినాను. అందుకే ఆకాశంలో చందమామని అందుకోవాలని ప్రయత్నించ లేదు. నిన్ను ప్రేమించేంత అర్హత – నాకూ, నా స్థాయికీ, నా కులానికీ లేవని నాకు తెలుసు. ప్లీజ్... ఇంక ఎప్పుడూ ఆ ప్రస్తావన తేవద్దు" అన్నాడు శివయ్య బాధతో నిండిన గొంతుతో.

పద్మని పెళ్ళి చేసుకోవాలన్న కోరిక వున్నప్పటికీ తన ఆశను చంపుకొంటాడు. దళితులను ఎంతగా భయపెట్టారో ఈ సంఘటనను బట్టి చెప్పవచ్చు. శివయ్య పద్మని పెళ్ళి చేసుకుంటే తన తల్లితండ్రులను బతుకనివ్వరు. కులభేదం ప్రధాన సమస్యగా వుంది.

"నువ్వు నన్ను పెండ్లి చేసుకోను అంటే నాకు జీవితమే అవసరంలేదు. ఎవడో ముక్కూ మొగం తెలియనోడిని పెండ్లి చేసుకోని శవం మాదిరి ఎందుకు బతకల్లనేను? చెప్పు శివయ్యా!" అంటూ ఏడ్చేసింది పద్మ.

అయినా శివయ్య పద్మని పెళ్ళి చేసుకోవడానికి అంగీకరించడు. చివరికి పద్మ తల్లితండ్రులు తెచ్చిన టి.బి. పేషంట్‌ని పెళ్ళి చేసుకొంటుంది. కన్నీరు కారుస్తూ మెకానికల్‌గా ప్రాణం వున్న మిషనులాగా మన స్త్రీలు మారిపోక తప్పడం లేదు. పద్మ ఇది నా కష్టం, ఇది నా బాధ అని చెప్పుకునే అవకాశం లేని మూగగొంతుకయింది. ఆడది ఏదో విధంగా నాటికీ, నేటికీ, మరోనాటికీ కట్టుబానిసగా మిగిలిపోతోంది. ఆమె ఇష్టాయిష్టాలకసలు విలువలేదు. ఇది తరతరాల స్త్రీల కన్నీటిగాథ. ఆమె జీవితానికి అనేక ఆంక్షలూ, అడ్డంకులూ నిర్దేశింపబడ్డాయి.

పంచమం నవలలో కనిపించే మరొక స్త్రీ పాత్ర రుక్మిణి. రుక్మిణి కమ్మోళ్ళ పిల్ల. ఓబన్న చాకలి. రుక్మిణీ, ఓబన్న పెద్దల అంగీకారం లేకుండా కులాంతర వివాహం చేసుకొంటారు. తన ఇష్టప్రకారం పెళ్ళి చేసుకొన్న ఆ యువతిని బలవంతంగా లాక్కెళ్ళి చాకలి ఓబన్నని చంపేస్తారు. ఇక్కడ స్త్రీ తనకు నచ్చిన వ్యక్తిని పెళ్ళి చేసుకొన్నా అది సక్సెస్ అవలేదు. ఇక్కడా కులం ప్రధాన సమస్యగా కన్పిస్తున్నది.

పంచమం నవలలో ఆనందబాబు అనే వ్యక్తి కథలు రాస్తుంటాడు. అతడు శివయ్యకు పరిచయం అవుతాడు. శివయ్య అతనిని కథలు ఎలా రాస్తారు? ప్రేరణ ఏంటి? ఇలా ప్రశ్నలేస్తాడు. అప్పుడు ఆనందబాబు శివయ్యకు 'అవిభాజ్యం' అనే కథ చెప్తాడు. ఆ కథలో పాకిస్తాన్ వాళ్ళు పంజాబు ప్రాంతం సరిహద్దులో వున్న రాంపూర్ గ్రామ స్త్రీలను ఎత్తుకెళ్ళి పోతుంటారు. ఆ విషయం అరుణ్‌సింగ్ భార్య హైమతో అన్నప్పుడు – 'వాళ్ళు దుర్మార్గులయి నీచమైన పనికి ఒడికడితే, అట్లాటి నీచమైన పనే మీరూ చెయ్యాలా – ఇంక వాళ్ళకీ మీకూ తేడా ఏముంటుంది?" అనంటుంది హైమ.

"ముల్లుని ముల్లుతోనే తియ్యాలన్నదే మా సిద్ధాంతం! వాళ్ళ అక్కల్నీ, చెల్లెళ్ళన్నీ, పెళ్ళాల్నీ మేము ఎత్తుకొని వస్తే అప్పుడు తెలుస్తుంది. ఆ దగుల్బాజీ వెదవలకి!" అంటూ పండ్లు పటపటా కొరుకుతాడు అరుణ్‌సింగ్. ఇక్కడ లైంగికత ఆయుధంగా వాడుతున్నారు. లింగ వివక్ష ప్రధానంగా కనిపిస్తోంది.

ఇక్కడ ఇరుదేశాల వాళ్ళు స్త్రీలను పావుగా వాడుకొంటున్నారు. ఒక రోజు రాత్రి హైమను తీసికెళ్తారు పాకిస్తాన్ వాళ్ళు. అలా దాదాపు ఇరవై మంది స్త్రీలని తీసుకెళ్తారు. ఒక్కొక్కరు ఒక్కో స్త్రీని పంచుకొంటారు. రహమాన్‌కు వస్తుంది హైమ. ఆమెపట్ల వారు చూపే గౌరవం, మర్యాదా... ఆమె ఒకసారి జబ్బు పడ్డప్పుడు అతను చూపే ఆదరణా ఆత్మీయతా కొంత మార్పు తెస్తుంది ఆమెలో. రహమాన్ సాహచర్యం ఆమెకు ఎంతో ఆనందాన్నిస్తుంది. ఎన్నో విషయాల్లో తన భర్త అరుణ్‌సింగ్ కంటే రహమాన్ అధికుడుగా అనిపిస్తూ వుంటాడు. కొన్ని నెలలకి హైమ గర్భవతి అవుతుంది. ఇంతలో ఇండియా, పాకిస్తాన్ దేశాల మధ్య చర్చలు ప్రారంభమవుతాయి.

ఎత్తుకుపోయిన మహిళలని ఎవరి దేశం ఆడవాళ్ళని ఆ దేశానికి పంపించేయాలన్న విషయం మీద చర్చలు ఫలించి ఒప్పందానికి వచ్చేస్తాయి. ఆ ఒప్పందం మేరకు ఆడవాళ్ళ జాబితాలను రెండు దేశాలూ తయారు చేస్తాయి. పాకిస్తాన్ తయారు చేసిన భారతీయ మహిళల జాబితాలో హైమ పేరుంటుంది. అయితే ఆమె ఇష్టపడదు. "మా దేశానికి వెళ్ళను నాకు ఇక్కడే బాగుంది" అంటుంది. నా జీవితం ఇప్పటికే కుక్కలు చింపిన విస్తరి అయిపోయింది. నేను ఇన్నాళ్ళూ పరాయి దేశంలో పరాయి మగాడితో వున్నానని తెలిసి నన్ను నా భర్త ఏలుకుంటాడా? అని కళ్ళనీళ్ళు పెట్టుకొంటుంది.

"వెళ్ళనంటే వెళ్ళను మా దేశానికి" అని రహమాన్‌తో ప్రాధేయ పడుతుంది." తప్పదు హైమా! ఇది నీకూ, నాకూ మధ్య జరుగుతున్న విషయం కాదు. ఇది రెండు దేశాల మధ్య జరిగిన ఒప్పందం!" అంటాడు రహమాన్.

"నా మొదటి బిడ్డను మీ వాళ్ళు పొట్టన పెట్టుకున్నారు. ఇప్పుడు పుట్టబోయే నా రెండో బిడ్డని పుట్టనియ్యరు. అక్కడికి పోతూనే నాకు గర్భం తీయించేసి పుణ్యం కట్టుకుంటారు" అంటూ ఏడుస్తుంది.

మరునటి రోజు ఆడవాళ్ళను భారతీయులకు అప్పగించేస్తారు. అయితే పాకిస్తాన్ నించి వచ్చిన ఆడవాళ్ళ కోసం వచ్చిన బంధువులలో ఏ మాత్రం ఆనందోత్సాహా లుండవు. తప్పదు కనుక తీసుకుపోతున్నట్టు వుంది వాళ్ళ తీరు.

హైమ భర్త వస్తాడుగానీ తీసుకెళ్ళడు. అతనికి రెండవ పెళ్ళి అయ్యింటుంది. హైమను తల్లితండ్రులు తీసుకెళ్ళి అబార్షన్ చేయిస్తారు.

ఇక్కడ ఆడవాళ్ళ పరిస్థితి చూస్తే వాళ్ళ ఇష్టాయిష్టాలతో పని లేదు. స్త్రీని ఒక వ్యక్తిగా కాకుండా తమ ఆస్తిగా చూస్తున్నారు. చివరికి ఇరుదేశాల మధ్యలో సమస్యలను ఎదుర్కొన్నది స్త్రీలే. దాంపత్య జీవితంలో స్త్రీకి ఏ స్వేచ్ఛాలేదు. వాళ్ళు ఎలా చెప్తే అలా నడుచుకోవాలి. అంట ఆమెపై ఆమెకు ఎలాంటి హక్కులేకుండా చేశారు. చివరికి తన సంతానంపై కూడా ఆధిపత్యం పురుషునిదే.

ఇక్కడ స్త్రీ పరిస్థితి ఆలోచిస్తే ఆమె ఆటవస్తువుగా అంగడిబొమ్మగా, భర్త ఆస్తిగా మార్చబడింది. తాను పురుషాధిపత్యానికి తలవంచాలనే భావంవల్లే స్త్రీలలో ప్రతిఘటనా శక్తి నశిస్తోంది. ఇరువర్గాల తగాదాలో వారి స్త్రీలను వీరు, వీరి స్త్రీలను వారు చెరచుటొక సామాన్య అంశమయింది. తాను దోషి కాకున్నా కుమిలి కృశిస్తోంది. తన్ను తాను నాశనం చేసుకొంటోంది. నేరస్తుడికి శిక్ష తప్పించుకొనుట కిదొక మహదవకాశమయింది.

పై అంశాలన్నిటినీ పరిశీలిస్తే అసలు ఈ దేశంలో దళితులే కాదు అణగారిపోయినది. స్త్రీలు కూడా. ఎంత అగ్రవర్ణాలలో పుట్టినా స్త్రీలు కూడా దళితులేనేమో! అనిపిస్తున్నది.



# వేపచెట్టు




ముదిగొండ శివకౌముదీ దేవి

మా ఇంటి వాకిట్లో పెద్ద వేపచెట్టు ఉండేది. అది మా తాత, ముత్తాతలనాటి నుండీ అక్కడే ఉన్నది. మా పల్లె జీవితానికి, మా కుటుంబ జీవితానికి శతాబ్ది కాలపు సాక్షి, అంతేకాదు ఆ వేపచెట్టు మా సాంస్కృతిక జీవనానికి కూడా సాక్షి.

మా తాతగారికి కళలంటే అభిమానం. కొంత అభినివేశం కూడా ఉండేది. ఆయన ఆ రోజుల్లో రంగస్థల కళాకారుడు. చారిత్రాత్మక నాటకాల్లో పాత్రలు ధరించేవారు. రంగారావుగారు యుగంధరుడు, అప్పాజీ, చాణక్య వేషాలు వేస్తేనే చూసినట్లు ఉంటుందనే వారు ప్రజలు, మా పల్లెలోనే కాక చుట్టుపక్కల చాలా ఊళ్ళల్లో ఆయన ప్రసిద్ధికెక్కిన నటుడు. ఎన్నో బహుమతులు కూడా సాధించారు. అనేక పరిషత్‌లలో పాల్గొని.

తాతయ్యకి సాటి అయిన కళాకారుడు సుబ్బయ్య తాత. అతడు తాతయ్య బాల్యం నుండే మా ఇంట్లో పని చేస్తున్నాడు. మా పొలాలు చూసేవాడు. పశువుల అజమాయిషీ చూసేవాడు. అతడు బుర్రకథ చెబితే వినితీరాలి. వంతలు (పక్కపాటపాడే వాళ్ళు) లేకపోయినా అతడు ఆట రక్తి కట్టించేవాడు. రుద్రమదేవి, బొబ్బిలియుద్ధం, అల్లూరి సీతారామరాజు, స్వాతంత్ర్యసంగ్రామం వంటి బుర్రకథలు అతడు చెపుతుంటే గ్రామం గ్రామమంతా మా ఆవరణలోనే ఉండేది. మా వాకిలి జనంతో కిటకిటలాడేది. ప్రహరీగోడపైనా, కారు షెడ్డుపైనా కూడా ఎక్కి జనం ఆ సాంస్కృతిక కథలు చూసేవారు. ఆదమరచి వినేవారు.

సుబ్బయ్యతాత అవడానికి మా ఇంట్లో పనివాడే కాని మా కుటుంబ సభ్యుడి వంటివాడు. మా తాతగారికి బాల్యమిత్రుడు. నన్ను భుజాలపై ఎత్తుకు మోసిన వాడు. నాకు తాతయ్య తర్వాత తాతయ్య వంటివాడు.

మా ఊళ్ళో తరుచూ సాంస్కృతిక కార్యక్రమాలు జరిగేవి. పరిషత్ నాటకాలే కాకుండా ఇతరత్రా నాటకాలు జరుగుతుండేవి. బుర్రకథలు, జముకుల కథలు, హరికథలు, ఏకపాత్రాభినయాలు, ధ్వన్యనుకరణ, జానపద గీతాలు, లలిత సంగీతం - ఇట్లా మా గ్రామం ఒక మినీ ఆకాశవాణి కేంద్రంగా వర్ధిల్లేది.

అయితే ఈ విధంగా ఇతర గ్రామాల కళాకారులు రానప్పుడు మా ఇంటి ఆవరణలో వేపచెట్టు కింద మా ఊళ్ళో కళాకారులే నాటకాలు ఆడుతుండేవారు. ప్రతి శనివారం సుబ్బయ్య తాత బుర్రకథ ఉండేది. కారు షెడ్డుని ఆనుకుని సుబ్బయ్య తాతకి ఒక గది ఉండేది. అందులో తన రంగస్థల సామగ్రి అంతా దాచుకునేవాడు. శనివారం వచ్చిందంటే సుబ్బయ్యతాత హుషారుగా ఉండేవారు. సాయంత్రం ఆరున్నర, ఏడు గంటలకు మేకప్ చేసుకునేవాడు. పనివాళ్ళు బల్లలు వేసి, పెట్రోమాక్స్ దీపాలు సిద్ధం చేసి రంగాలంకరణ చేసేవారు. సుబ్బయ్యతాత పావలా మందం కేకు వేసుకుని, చెవులకి ముత్యాల కుండలాలు పెట్టుకుని, మెళ్ళో పూసల దండలు వేసుకుని,

మీసాలకి రంగు వేసుకుని, రంగురంగుల మెరుపుల దుస్తులు ధరించి కార్యక్రమానికి సిద్ధపడేవాడు. మరీ కుంభవృష్టి పడితే తప్ప వాన కురిసినా జనం అక్కడే ఉండి ఆట చూసేవారు.

వేపచెట్టు కింద కళాకారుల కోసం ఒక గద్దె కట్టించారు తాతయ్య. దానిపైన రేకుల షెడ్డు కప్పు ఉండేది. ఊళ్ళో వాళ్ళంతా కొందరు బల్లలపై, కొందరు జంపకానాలపై కూర్చుని నాటకాలు, శనివారం బుర్రకథలు చూసేవారు.

తాతయ్య కొంచెం పెద్దవారయ్యాక నాటకాలు ఆడటం బాగా తగ్గించేసారు. ఎప్పుడైనా ఊరిజనం మరీ పట్టుపడితే యుగంధరుడు ఏకపాత్ర, చాణక్య ఏకపాత్ర నిర్వహించేవారు. సుబ్బయ్యతాత మాత్రం ప్రతి శనివారం బుర్రకథ చెబుతూనే ఉండేవాడు. ఒకసారి వానాకాలంలో కుంభవృష్టి కురిసింది. పట్టుమని పది మంది మా ఇంటి వరండాలో కూర్చొని చూస్తున్నారు. సుబ్బయ్యతాత రెండు గంటలు ఆ పది మంది కోసమే బుర్రకథ చెప్పి స్వాతంత్ర్య పోరాటాన్ని కళ్ళముందు రూపు కట్టించాడు. అతడి వాచకం, స్వరం, గానం ఒక ఝరీ ప్రవాహమై మేం అందులో కొట్టుకునిపోయాం. అతడి వంతల దరువులతో మా ప్రాంగణం మార్మోగిపోయింది. కుంభవృష్టిలోనూ ఆటకట్టినందుకు ఆ రోజు ప్రేక్షకులంతా సుబ్బయ్య తాతకి నోట్లదండలు వేసి నీరాజనాలు పట్టారు. సుబ్బయ్య తాత ఆ డబ్బంతా మా ఊళ్ళోని బడికి కొంత, గుడికి కొంత విరాళంగా ఇచ్చాడు. "ఎందుకు తాతా", అంటే "నాకెందుకు బాబూ. పైసలు, నాక్కావలసింది నేను సంపాదించుకుంటూనే ఉన్నాను కదా" - అన్నాడు. "జనం లేకపోయినా బుర్రకథ చెప్తావే" అంటే సుబ్బయ్యతాత నవ్వాడు" ఇద్దరున్నా, ముగ్గురున్నా చెప్పాల. వాళ్ళు మాత్రం చూసే వాళ్ళు కాదా" - అన్నాడు.



అవన్నీ స్వర్ణయుగం రోజులు.

మా గ్రామం నుండి ఎన్నో సాంస్కృతిక బృందాలు తయారై తెలంగాణా అంతా పర్యటించేవి. కొన్నిసార్లు కోస్తా, ఉత్తరాంధ్ర, రాయలసీమ కూడా పర్యటించేవి. కొన్నిసార్లు ఈ బృందాలు ఇటు మహారాష్ట్రలోని నాగపూర్ ప్రాంతాలకు, అటు కర్ణాటకలోని బీదర్, గుల్బర్గా ప్రాంతాలకు వెళ్ళి వచ్చేవారు. మా ప్రాంతం నుండి "ఆదాన ప్రధాన కార్యక్రమం" కింద మా ఊరి కళాకారులు కొందరు ఉత్తర కర్ణాటక ప్రాంతం వెళితే, అక్కడి కళాకారులు మా ప్రాంతానికి వచ్చి "యక్షగానం" (కర్ణాటక కళారూపం) ఆడేరు. మా ఊరి నుండి జాతీయ స్థాయి నాటక పోటీల్లో పాల్గొన్న కళాకారులు కూడా ఉండేవారు. వాళ్ళల్లో ఒకాయన తన కొడుకుని ఢిల్లీలోని "నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామా"లో చదివించారు. అతడు తర్వాత - అంటే ప్రస్తుతం అక్కడే లెక్చరర్‌గా ఉన్నారు.

ఈ విధంగా మా ఊరు మా జిల్లాలోనే సాంస్కృతిక కేంద్రంగా వర్ధిల్లింది. ఎందరో కళాకారులకి అక్కడ సన్మానాలు, సత్కారాలు జరిగాయి.

మనం ఒక రంగంలో పైకి రావాలంటే ఆ క్షేత్రంలోనే పని చేసే వారిని ఆదర్శంగా తీసుకోవాలని నిబంధన ఏవీ లేదు. నేను పెద్దయ్యాక డాక్టరునయినా నా వృత్తి నిబద్ధతకి, చదువుకునే రోజులనాటి నా క్రమశిక్షణకి, కష్టపడే తత్వానికి ఆదర్శం సుబ్బయ్యతాతే.

లక్ష్యశుద్ధి, అంకిత భావం - ఈ ద్వివిధములైన విలువలూ నేను సుబ్బయ్య తాత దగ్గరే నేర్చుకున్నాను. ఒకసారి సుబ్బయ్యతాత యధావిధిగా శనివారం నాటి బుర్రకథ చెబుతున్నాడు. బొబ్బిలి యుద్ధం కథ. బాగా వీర రసప్రభావం కలిగిన కథ. సుబ్బయ్య తాత, వంతలు కూడా కథలో మునిగిపోయారు. ప్రేక్షకులు సరేసరి.

"తరికిట తరికటతా" అని వంతలు కథ మధ్యలో ఆపే సరికి ఎవరో వచ్చారు. సుబ్బయ్య తాతని పిలుస్తున్నారు. ఏమిటంటే - "సుబ్బయ్యా, నీ ఇల్లు కాలిపోతోంది, నీ భార్య ఒక్కర్తీ తిప్పలు పడుతోంది పిల్లలతో, జల్దీరా" - అని అరిచారు. సుబ్బయ్య తాత ఒక్కక్షణం విని ఊరుకున్నాడు.

"అరెరెరెరెరెరె...." అంటూ మళ్ళీ కథ అందుకున్నాడు. అందరూ స్థాణువులై పోయారు.

అవాక్కయ్యారు.

నిర్ఘాంతపోయారు.

అయినా సుబ్బయ్య తాత పట్టించుకోలేదు. చెక్కు చెదరలేదు. తనకేమీ నష్టం జరగనట్లే, ఏ కష్టం రానట్లే, ఆ కబురు రాకముందు ఎట్లా ఉన్నాడో, అట్లాగే ఉన్నాడు కబురు అందిన తర్వాత కూడా.

అదొక్కటే కాదు.

ఆ తర్వాత మరోసారి సుబ్బయ్యతాత బుర్రకథ చెబుతుంటే అతడి భార్య చనిపోయిందని కబురు వచ్చింది. అప్పుడూ అంతే.

నిర్వికారంగా, భావరహితంగా కథ పూర్తి చేసి ఇంటికి వెళ్ళాడు సుబ్బయ్యతాత.

నాకనిపించింది సుబ్బయ్యతాత నిజమైన కర్మయోగి - అని అంతే కాదు రంగస్థలం పట్ల అతడి నిబద్ధత అటువంటిది. అతడు - రంగస్థలాన్ని కౌగిలించు కున్నాడు. తన జీవితంతో బుర్రకథని ఉన్మీలనం చేసుకున్నాడు.

ఆ పాటలతో, ఆ తందానా తానె తందనాలతో, ఆ తంబురా మీటుతో, ఆ అడుగులతో, ఆ దరువులతో ఏకాత్మగా భాసించాడు.

సుబ్బయ్య తాతకి డబ్బు వ్యామోహములేదు. కథ చెబితే వచ్చిన పారితోషికం వంతలకే ఇచ్చేవాడు. ఏమంటే - "నాకు పని ఉంది, పైసల కోసమా కత జెప్పేది" అనేవాడు.

కాలం చాలా ముందుకి వెళ్ళిపోయింది ఇప్పుడు.

మా గ్రామం ఆ గ్రామం కాదిప్పుడు. వ్యవసాయం దెబ్బతిని రైతులు రైతు కూలీలయ్యారు. రైతు కూలీలు బిల్డింగ్ లేబరై వలసపోయారు. కొందరు నేత పనివారు గుజరాత్ వెళ్ళారు - అక్కడ నేత మిల్లుల్లో పని కోసం. కొందరు మహారాష్ట్రకి వలస వెళ్ళారు.

తాతయ్య చనిపోయారు.

అయినా నేను వేపచెట్టు కింద రంగస్థలంపై సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తూనే ఉన్నాను. నా ప్రాక్టీసుతోపాటు కాని ప్రేక్షకులు తగ్గిపోయారు.

కళాకారులు కూడా ఆనాటి వాళ్ళు కాదిప్పుడు.

మద్యపానం బాగా ప్రబలిపోయింది. తాగకుండా వేదిక ఎక్కడం లేదు కొందరు కళాకారులు.

సుబ్బయ్యతాత ఏనాడూ 'చుక్క' వేసుకుని ఎరుగడు. పెద్దగా పూజా పునస్కారాలు చేయకపోయినా నిష్టగా ఉండేవాడు. క్రమశిక్షణగా ఉండేవాడు. ఆ రకంగా సుబ్బయ్య తాత నైష్టికుడు కూడా.

ఇప్పుడు గ్రామాల్లో సినిమాలు, టీవీలు, ఛానళ్ళు వచ్చాయి. కేబుల్ టీవీ వచ్చాక శని, ఆదివారాలు "సినిమామయం" అయినై. పండుగలు, వినాయక చవితి నవరాత్రులు, దసరా నవరాత్రులు రికార్డు డాన్సుల మయం అయినై. గత్యంతరం లేక "ఫ్లెష్ ట్రేడ్" (వ్యభిచరించడం)లోకి వచ్చిన వారు సామాజిక జీవనాన్ని కలుషితం చేశారు. యువతరం అందుకు తోడైంది.

వారికి అభిరుచి లేదు. అభినివేశం లేదు.

లక్ష్యంలేదు. మార్గములేదు.

సాంస్కృతిక కాలుష్యపు సుడిగాలిలో కొట్టుకుపోయిన దారం తెగిన పతంగాలై యువకులు కొట్టాడుతున్నారు. ఇప్పుడు వేపచెట్టు కింద వేదిక చాలాసార్లు బోసిపోతోంది. ఆధునిక జనజీవన వైకృత్యంలో వెలవెలబోతోంది. అయినా సుబ్బయ్య తాత తన బుర్రకథ ఆపలేదు. ఇద్దరు ప్రేక్షకులు ఉన్నా, ముగ్గురు ప్రేక్షకులు ఉన్నా ఆట కట్టిన రోజులు అతడికీ, నాకూ జ్ఞాపకం ఉన్నాయి.

ఆ మధ్య నేను ఊళ్ళోలేను.

తిరిగి వచ్చేసరికి శనివారం సాయంత్రం అయింది.

సాయంత్రం ఏడున్నర అవుతోంది. ఇల్లు చేరేసరికి. సుబ్బయ్యతాత ఒక్కడే ఒంటరిగా ఆ వేపచెట్టు కింద వేదికపై బుర్రకథ చెబుతున్నాడు. బల్లలు, జంపకానాలు ఖాళీగా ఉన్నాయి. నక్షత్రాల కింద, ఆకాశం కింద, తదియనాటి నెలవంక ఆకాశంలో బేలగా చూస్తుంటే, వేపచెట్టు మీద నుంచి, వేపచివుళ్ళలోని ఆ చేదు ముద్రని వేసుకున్న గాలులు వీస్తుంటే, చెట్టు కొమ్మల మీద కాకులు, పిచ్చుకలు నిద్రమేల్కొని పాటుంటే, ఆ నిశ్శబ్దంలో, ఆ ఏకాంతంలో సుబ్బయ్య తాత ఒక్కడూ బుర్రకథ చెబుతున్నాడు.

ఆ ఆకాశానికి, గాలికీ, నేలకీ, వెలుగుకీ, పంచభూతాలకీ తన బుర్రకథ వినిపిస్తూ ఆనందింప చేస్తున్నాడు. మా ఇంటి పక్క చెరువుపై నుంచి తేలి వచ్చిన గాలి ఆ శీతలత్వాన్ని సుబ్బయ్య తాత వంటి గ్రామీణ కళాకారుడికి అద్దటంతో తన జీవనం ధన్యమైనదనుకుంటూ ఆ కర్మయోగికి వీవన వీస్తోంది. ప్రేక్షకులు లేని, సంస్కృతిని కోల్పోయిన ఆ గ్రామంలో ఆ ఖాళీ ఆవరణ నిరామయంగా ఉన్నది.

సుబ్బయ్య తాత వంతలు కూడా లేకుండా సమయపాలన చేస్తూ ఏడింటికి కథ చెప్పడం మొదలుపెట్టాడు. ప్రేక్షకులు ఇవాళ లేకపోవచ్చు.

కాని ఈ ఖాళీ ఆవరణలో రేపు కుప్పలు తెప్పలుగా ప్రేక్షకులు నిండిపోవచ్చు.

ప్రేక్షకులు ఉన్నా, లేకపోయినా కొనసాగవలసినది కళ.

కళ అజరామరమైనది.

కళ అనంతం.

కళకి మృత్యువు లేదని రుజువు చేస్తూ సుబ్బయ్యతాత ఒక్కడూ బుర్రకథ చెబుతూనే ఉన్నాడు.

నేను చూస్తూ ఉండిపోయాను.

నాతోపాటూ మౌన సాక్షిగా మా వేపచెట్టు.

మా గ్రామ సాంస్కృతిక ఉత్థానపతనాలకు సాక్షి, మా జనజీవన సమ్మేళనాలకు సాక్షి, మా జీవిత రంగస్థలి ఆ వేపచెట్టు.

నాలాగే వేపచెట్టు.



---

# మినీ కవితలు

**అనిశెట్టి రజిత**

దునియా బేమానీ
వక్త్ భీ బేమానీ
జిందగీ కా సఫర్‌యే
అప్నా కోయీ నా దిఖాయీ!
...
మర్ మర్‌కే నా జీనా
హర్ ఫల్ డర్‌సే
చుట్కారా పానా
లడ్‌నే కేలియే ఉఠోనా!
...
హమ్‌దూండ్ రహీహై
హర్ కిసీసే పూచ్ రహీహై
జర పతా బతానా
జర రాస్తా దిఖానా
న దిఖ్‌రై ఇన్‌సానియత్
బహత్ దినోసే
కహీ ఓ ఖోగయా
మై పాగల్ హోగయా
ఉసే నా మిల్‌నేసే!
...

ఆద్మీ అవురత్
బాల్ బచ్చే
సబ్‌లోగ్ బహుత్
ఖూన్ సూరత్ దిఖ్‌రహీహై
మగర్ ఏక్ కమీహై
లోగో కే ముఖ్‌డోపర్
ఏక్ చోటీసీ ముస్కాన్
గాయబ్ యీ!
...
దునియా బదల్‌గయా
అప్‌సానో బడ్‌గయీ
ఖుషియా మర్‌గయా
గమ్ మే జీనా
గమ్ మే మర్నా
మసీబతోంసే టక్‌రానా
ఖూన్ సే నహానా
దౌలత్ సే మహబత్ కర్నా
ఆజ్‌కీ దునియా యహీ
రుక్‌గయి అటక్‌గయి
ఇన్సాఫీకా ఖూన్ కర్‌కే
ఇన్సానియత్ ఖుద్ ఖుషీ
కర్‌లియా...

# మాండలిక రచనల మహోపకారం



శాంతినారాయణ 'నాగలకట్ట సుద్దులు' వార్త ఫీచర్స్ 'నమ్ముకున్న రాజ్యం' కథల సంపుటిని ఆవిష్కరిస్తున్న సురవరం సుధాకరరెడ్డి, పక్కన తెలకపల్లి రవి ఇంకా రచయిత శాంతినారాయణ, కేతు విశ్వనాథరెడ్డి, పాపినేని ప్రభృతులు

ఎస్.వి. ప్రసాద్

"మాండలికం జీవద్భాష. పాఠకుడిని రంజింపచేసి, మనసును తాకేది 'మాండలికం'. మాండలికం ద్వారా ప్రజల జీవితపు అట్టడుగు పొరల్ని తాకండి. భాషను, కథను పరిపుష్టం చేయండి" అని ముక్త కంఠంతో పిలుపునిచ్చారు సాహితీ బంధువులు.

అనంతపురం జిల్లాకు చెందిన ప్రముఖ రచయిత, జిల్లా రచయితల సంఘం కార్యదర్శి డా॥ శాంతినారాయణ రచించిన పుస్తకాల ఆవిష్కరణ ఆగస్టు 14న అనంతపురంలో జరిగింది. నేతల చిత్తవిచిత్రాలను మొదలుకొని అధికారుల అలసత్వం వరకూ అనేక అంశాలపై వివిధ కోణాల్లో శాంతినారాయణ సంధిస్తున్న వ్యంగ్యాస్త్రాలు 'శాంతిసీమ' ఫీచర్‌గా 'వార్త' దినపత్రికలో వారంవారం అలరిస్తున్న విషయం పాఠకులకు విదితమే. వీటిని 'నాగలకట్ట సుద్దులు' పేరుతో సంకలనంగా తీసుకొచ్చారాయన. ఈ పుస్తకంతోపాటు 'నమ్ముకున్న రాజ్యం' కథల సంపుటిని కూడా ఆ రోజు ఆవిష్కరించారు. రాష్ట్రం నలుమూలల్నుంచి వచ్చిన ప్రముఖ రచయితలు, విమర్శకుల సమక్షంలో సాహితీ ఉత్సవంలాగా ఈ కార్యక్రమం జరిగింది.

'అనంత' జిల్లా రచయితల సంఘం గౌరవాధ్యక్షుడు సింగమనేని నారాయణ తన ప్రారంభోపన్యాసంలో మాట్లాడుతూ సాహిత్యం, జీవితంపట్ల గాఢమైన ప్రేమతో, సామాజిక బాధ్యతతో మంచి కోసం రచన, చేసే వారు తక్కువగా ఉన్నప్పటికీ వారే సమాజానికి మార్గదర్శకులవుతారని అభిప్రాయపడ్డారు. అలాంటి వారి ప్రభావం ఎక్కువగా ఉంటుందని, శాంతినారాయణ ఆ కోవకు చెందుతారని ప్రశంసించారు.

తర్వాత కలెక్టర్ అనూరాధ మాట్లాడుతూ ఇక్కడ రచయితలు జిల్లా కోసం తపన పడటం అభినందనీయమని అన్నారు. సామాజిక స్పృహ లేకపోతే కనీస అవసరాలు గుర్తించలేమని, దాన్ని కల్గించే వ్యక్తే రచయితని ఆమె అభిప్రాయపడ్డారు. 'అనంత' మాండలిక పదాలు తనకు చాలా నచ్చాయని చెప్పారు. తెలుగు భాషను మర్చిపోతున్న ఈ రోజుల్లో ఆంగ్లాన్ని తగ్గించుకుని మన భాషలో మాట్లాడుకుందామని, ఇలాంటి సదస్సుల ద్వారా ఈ విషయాన్ని చాటి చెప్పాలని అనూరాధ పిలుపునిచ్చారు.

అనంతరం పార్లమెంటు సభ్యుడు సురవరం సుధాకరరెడ్డి 'నాగలకట్ట సుద్దులు' పుస్తకాన్ని ఆవిష్కరించారు. తెలుగులో ప్రస్తుతం ఆరోగ్యకరమైన సాహితీ వాతావరణం ఉందని, మంచి రచనలు వస్తున్నాయని ఈ సందర్భంగా ఆయన చెప్పారు. విభిన్న అంశాలపై వస్తున్న రచనలు ప్రజల్ని చైతన్యవంతుల్ని చేస్తున్నాయన్నారు. శాంతినారాయణ మాండలికంలో చక్కగా సమకాలీన సమస్యల్ని చిత్రీకరించారని సురవరం ప్రశంసించారు. మాండలికాలు ఇతర ప్రాంతాల వారికి మొదట్లో ఇబ్బంది కల్గించినా చదువుతూ పోతే అర్థం చేసుకోవచ్చని, మాండలికం సొగసేవేరని అన్నారు. మాండలికంవల్ల మారుమూల గ్రామాల్లోని తెలుగు ప్రజల జీవనశైలి, వైవిధ్యం తెలుస్తుందన్నారు. "తెలుగు అర్థం కాకపోతే గ్రామాలకు వెళ్ళండి" అని మాజీ ప్రధాని పి.వి. నరసింహారావు చెప్పిన మాటల్ని సురవరం గుర్తు చేశారు. సామాజిక విలువల్ని, వ్యవస్థలోని లోపాల్ని మాండలికంలో చెప్పడం మంచి ప్రక్రియ అన్నారు. అనంత ప్రజల కరువు బాధల్ని, వాటిపై నాయకుల, అధికారుల స్పందనను సునిశితమైన వ్యంగ్యంతో 'శాంతిసీమ' ఫీచర్ ఎండగట్టిందన్నారు.

'నమ్ముకున్న రాజ్యం' కథల సంపుటిని ప్రస్థానం ఎడిటర్ తెలకపల్లి రవి ఆవిష్కరించారు. వేదనలోంచే నిజమైన కవిత్వం పుడ్తుంది. అలాగని మన ఏడుపును ప్రజలపై రుద్దకుండా, ప్రజల బాధల్ని తమవిగా స్వీకరించి రచయితలు కలం కదిలించాలని రవి అన్నారు. అనంతపురం నుంచి వస్తున్న సాహిత్యం సామాజిక విలువల్ని, గౌరవాన్ని సంతరించుకుందని వ్యాఖ్యానించారు. మాండలిక రచనల్లో అలాంటి సజీవమైన సాహిత్యం ఉందని రవి ప్రశంసించారు.

కేతు విశ్వనాథరెడ్డి 'నాగలకట్ట సుద్దులు' పుస్తకాన్ని సమీక్షించారు. 1970 తర్వాత కాలం నుంచి అన్ని పత్రికలు మాండలికాన్ని బాగా ప్రోత్సహిస్తున్నాయని, మాండలిక పదాలు చేరడంవల్ల ఏ భాషకైనా మరింత నిండుదనం వస్తుందన్నారు.

మాండలికంలో వచ్చిన 'శాంతిసీమ' ఫీచర్లో సమకాలీన సంఘటనలపై నిశితమైన విమర్శ ఉందని కేతు విశ్వనాథరెడ్డి అన్నారు.

'నమ్ముకున్న రాజ్యం' కథల సంపుటిని పాపినేని శివశంకర్ సమీక్షించారు. రాయలసీమ జీవితం భిన్నమైంది. ఎక్కడాలేని పరిస్థితులు ఈ ప్రాంతంలో ఉన్నాయి. ఇక్కడి ప్రజల జీవితాల్లో నిజాయితీ ఉంటుంది. నిర్మలమైన మనసు ఉంటుంది అని శివశంకర్ అన్నారు. రాయలసీమకు చెందిన కథా సంకలనాలను తాము అచ్చువేశామని... కన్నీళ్ళు, రక్తం, చెమట లేకుండా సీమ సాహిత్యంలేదని ఆయన చెప్పారు. సీమ ప్రజల బాధల్ని చూస్తే హృదయం ద్రవిస్తుందని, వాళ్ళ బాధల్ని పంచుకోవాలన్న ఆరాటం తప్పకుండా కల్గుతుందని వ్యాఖ్యానించారు. సీమ కథావస్తువుల్లో ఆ తీవ్రత, ఆవేదన కన్పిస్తుందన్నారు. రాయలసీమతో పోలిస్తే మిగిలిన చోట్ల సామాజిక సంక్లిష్టత అంతగా కన్పించదన్నారు. అన్ని ప్రాంతాల వాళ్ళు మానవ సంక్షోభాన్ని అక్షరీకరించాలని ఆయన పిలుపునిచ్చారు. నమ్ముకున్న రాజ్యం కథల సంపుటిలో ఈ వస్తు వైవిధ్యం స్పష్టంగా కన్పిస్తుందన్నారు.

జిల్లాకు చెందిన మాజీ ప్రజా ప్రతినిధులు దరూరు పుల్లయ్య, పాటిల్ వేణుగోపాల్‌రెడ్డి కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

పుస్తకాల ఆవిష్కరణ సభ ముగిశాక 'వర్తమాన తెలుగు కథ'కు సంబంధించి వివిధ అంశాలపై చర్చ జరిగింది. కొత్త రచయితలకు వర్క్ షాప్‌లాగా జరిగిన ఈ కార్యక్రమాన్ని రాచపాళెం చంద్రశేఖరరెడ్డి సమన్వయం చేశారు.

### కథ-పరిణామం

**రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి :** సమాజంలో వస్తున్న మార్పులను ఎప్పటికప్పుడు తనలో ఇముడ్చుకుంటూ కథ నానాటికీ ప్రగతి పథంలో సాగుతోంది. ఏటా గొప్ప కథలు వస్తూనే ఉన్నాయి.

**కేతు విశ్వనాథరెడ్డి :** దేశవ్యాప్తంగానే కాక ప్రపంచ వ్యాప్తంగా మారుతున్న రాజకీయ, ఆర్థిక పరిస్థితులకు అనుగుణంగా కథా వస్తువు కూడా మారుతోంది. జాతీయోద్యమం నుంచి నేటి ప్రపంచీకరణ వరకు 'కథ' ఏ పరిణామాన్నీ వదిలిపెట్టలేదు. వస్తువు-విస్తృతి, వైవిధ్యం పెరిగింది. రూపంలోనూ తేడా వచ్చింది.

.............. ★ ..............

**రాయలసీమ జీవితం భిన్నమైంది. ఎక్కడాలేని పరిస్థితులు ఈ ప్రాంతంలో ఉన్నాయి. ఇక్కడి ప్రజల జీవితాల్లో నిజాయితీ ఉంటుంది. నిర్మలమైన మనసు ఉంటుంది అని శివశంకర్ అన్నారు. రాయలసీమకు చెందిన కథా సంకలనాలను తాము అచ్చువేశామని... కన్నీళ్ళు, రక్తం, చెమట లేకుండా సీమ సాహిత్యంలేదని ఆయన చెప్పారు. సీమ ప్రజల బాధల్ని చూస్తే హృదయం ద్రవిస్తుందని, వాళ్ళ బాధల్ని పంచుకోవాలన్న ఆరాటం తప్పకుండా కల్గుతుందని వ్యాఖ్యానించారు.**

.............. ★ ..............

భాషకు సంబంధించి ఎక్కువ ప్రయోగాలు జరిగాయి.

**బి.ఎస్. రాములు :** గతంలో అగ్రవర్ణాల జీవితాలు కథా వస్తువుగా ఉండేవి. పంచాయితీరాజ్ వ్యవస్థవల్ల విద్యపెరిగి నిమ్న కులాలు, వర్గాల జీవితాలు కూడా కథా వస్తువులు అయ్యాయి. ఇది రైతాంగ పోరాటం, కమ్యూనిస్టు ఉద్యమాలవల్ల జరిగింది. రచయితలు సామాజిక శాస్త్రవేత్తలుగా ఆలోచించి రాయగలగాలి. ప్రాంతం, కులం, భాష వేటితో సంబంధంలేకుండా మనిషి హృదయాన్ని కదిలించేలా కథ రావాలి.

**కాలువ మల్లయ్య :** ప్రస్తుతం తెలుగు కథకు స్వర్ణయుగంలా ఉంది.

### భావాల బరువు పెరుగుతోందా?

**పాపినేని శివశంకర్ :** మనిషి భావోద్వేగాలను, అవస్థల గురించి చిత్రీకరించినపుడు కథ ఉండదని ఎలా చెప్పగలం? సంప్రదాయ పద్ధతిలో కథను అర్థం చేసుకోవడం కంటే పునః సమీక్షించుకోవడం మంచిది.

**బి.ఎస్ :** సిద్ధాంతాలు, భావజాలాలు ఉన్నప్పుడు దాన్ని వ్యతిరేకించే పాఠకులకు ఆ కథ బరువుగా కన్పిస్తుంది. రచయిత తన భావాలను రుద్దుతున్నట్లు వారు భావిస్తారు. కానీ ఆ భావాలతో ఏకీభవించే పాఠకుడైతే, బరువుగా భావించడు. అంటే ఇది పాఠకుల చైతన్య స్థాయికి సంబంధించినదే కాని రచయితది కాదు.

**కేతు :** పాత్రల చైతన్య స్థాయిని కూడా రచయిత గుర్తుంచుకోవాలి. పాత్రలు తమ చైతన్య స్థాయిని, పరిణతను మించి మాట్లాడినప్పుడ కృతకంగా కన్పిస్తుంది.

### వస్తువా-?
### రూపమా-?

**సూర్యసాగర్ :** వస్తు, రూప ఆధిపత్యాల వాదాలు సాగుతూనే ఉన్నాయి. ముఖ్యంగా ఒ విషయం గుర్తుంచుకోవాలి. శిల్ప, వస్తు ఐక్య సాధిస్తే ఆ రచన కలకాలం నిలుస్తుంది.

**మధురాంతకం నరేంద్ర :** కథ చెప్పడంల రచయిత కూడా సంయమనాన్ని పాటించాలి రచయిత తన అహంభావాన్ని ప్రదర్శించరాదు

### వాదాలు - వివాదాలు

**బోయ జంగయ్య :** వాదదృష్టి కాస్త తగ్గి మంచిది.

**వి. ప్రతిమ :** పురుషాధిక్య ప్రపంచంలో ధిక్కా స్వరంతో చెప్తే తప్ప స్త్రీవాదం గురించి విన్లేదు వాదాన్ని బేస్ చేసుకోవడానికి కారణం ఇదే స్త్రీవాదం బలహీన పడుతోందన్న ఆరోపణల్ల నిజంలేదు. స్త్రీవాదులిపుడు తమ భావజాలాన్ని ఆచరణ రూపంలో (Practicalise) పెట్టే ప్రయత్నంలో ఉన్నారు. అందుకే స్తబ్ధ కన్పిస్తోంది.

**వి.ఆర్. రాసాని :** ప్రతిమ చెప్పినట్లు ఒక వాద బయల్దేరే ముందు తీవ్రత ఉంటుంది. దీనివ అది నిలదొక్కుకుంటుంది. కానీ ఈ తీవ్ర పెరిగి శృతి మించితే వాదాలు వెనకబడతాయి సంయమనం పాటించినపుడే అ కొనసాగుతాయి.

**కేతు :** గ్రామీణ పరిస్థితులు వదిలి నగ జీవితం, చదువుకున్న వారి గురించ చెప్పడంవల్ల కూడా తీవ్రత కన్పిస్తుంది. జీవిత లోపలి పొరలను చిత్రీకరించగలిగితే వాదా నిలుస్తాయి.

**పాపినేని :** అంతర్లీనంగా హృదయాని హత్తుకునేలా వాదాన్ని గుప్పించాలి. మొరటుగ పురుషద్వేషాన్ని కాని, అగ్రవర్ణాల వ్యతిరేకతనుకాని రచనల్లో చూపడంవ లాభంలేదు.

**కవనశర్మ :** నాకు తెల్సిన వాదం సత్యవాద మనకు కన్పించిన సత్యాన్ని నిష్కర్షగా నిష్పక్షపాతంగా చెప్పాలి.

**కేతు :** ఈ వాదాల తీవ్రతను పక్కన బెడితే స్త్రీ దళిత.... తదితర వాదాలవల్ల వా నుడికారాలు భాషలోకి ప్రవేశించాయి. ఒ విధంగా భాషకు ఎంతో మేలు జరిగింది.

### ప్రపంచీకరణ:

**కవనశర్మ :** ప్రపంచీకరణవల్ల కొంత మే

జరిగితే, కొండంత నష్టం జరుగుతోంది.

ప్రపంచీకరణపై పైపైనే కథలు వస్తున్నాయి. ఇంకా రాయాల్సిన అవసరం ఉంది.

**కేతు :** ప్రపంచీకరణవల్ల నష్టపోతున్న లాటిన్ అమెరికా దేశాల సాహిత్యంలో పోలిస్తే తెలుగులో రచనలు తక్కువగా వచ్చాయి. ముఖ్యంగా రాయలసీమ నుంచి ఇంకా ఇంకా రావాల్సి ఉంది.

**బి.ఎస్ :** ఎల్.పి.జి. పరిణామాలను చెప్పగలుగుతున్నాం కాని అసలు కారణాలు చెప్పలేకపోతున్నాం. ప్రపంచీకరణ వ్యతిరేకగళాన్ని. అసలు కారణాలను కథలో కంటే కూడా కవితల్లోనే బాగా విన్పించవచ్చు. మనసులో సుఖముందని తెలుసుకోకుండా మనిషి వస్తు సుఖం కోరుకుంటూ వస్తు వ్యామోహంలో పడిపోయాడు.

**శశిశ్రీ :** వర్ధమాన రచయితలకు ప్రత్యేక సదస్సులు పెట్టయినా సరే ప్రపంచీకరణకు వ్యతిరేకంగా యుద్ధోన్ముఖులను చేయాలి. టి.వి. దెయ్యం నుంచి సాహిత్యాన్ని రక్షించండి :

**రాజేశ్వరరావు (విశాలాంధ్ర) :** కమర్షియల్ నవలలు రాజ్యమేలినపుడు అప్పటి ప్రధాన పాఠకులు మధ్యతరగతి గృహిణులే. కేబుల్ టి.వి. వచ్చాక వాళ్ళు చదవడం మానేశారు. ఈ పరిణామాల నేపథ్యంలో మనకు 'కథ' మిగిలింది. ప్రచురణల విషయంలో ప్రభుత్వ ప్రోత్సాహమూ అంతంమాత్రమే. మంచి మంచి కథలు రాసి వీలైనంత త్వరలో కథా సంపుటాలు తెస్తే కానీ రచయితకు ఆర్థికంగా లాభముండదు.

దీంతో చర్చ ముగించారు. వీరితోపాటు చర్చలో పాల్గొన్న వివిన మూర్తి, ఆర్వీయార్, కె.వి. రమణ, తుమ్మల రామకృష్ణ, వెంకటకృష్ణ, ఇనయతుల్లా, పాలగిరి విశ్వప్రసాద్, హరికిషన్, రాంచంద్, తవ్వా ఓబుళరెడ్డి, పలమనేరు బాలాజీ, జిల్లా రచయితలు స్వామి, దేవపుత్ర, తదితరులంతా 'కథ'ను చిరంజీవిని చెయ్యాలని ముక్తకంఠంతో సాహిత్యకారులకు పిలుపునిచ్చారు. ❖

---

# శకుని పాచిక

**నవీన్ కె.**

ప్రేమకీ, కామానికీ మధ్య
దూరం చెరిగిపోయి
నీలిగోడలతో నిర్మించిన
గాలిమేడలే యవ్వనం
పునాదుల్ని కొల్లగొట్టే గంజాయివనం
తరగతి గదుల్లో తలలు రాల్చేసే కొత్తతరం...
అప్పుడు
విధ్వంసోన్మాదాన్ని సాదరంగా
స్వాగతించిన 'స్వాహా'గాళ్ళంతా
స్వేచ్ఛామార్కెట్లో దిక్కుకొక్కరై
తప్పిపోయిన నా వాళ్ళంతా
ఇప్పుడు
మనోహర్ తల్వార్‌పై
వేలిముద్రలై దొరికారు.
**(శ్రీలక్ష్మి హత్యను నిరసిస్తూ...)**



హంతకుడు
చేతులు కడిగేసిపోయాడు
అందరిచేతులకి నెత్తురంటింది
ఏ యుద్ధమూ లేకుండానే
వాడు గెలుస్తున్నాడనేదీ
భయానక సూచిక
ఏ క్లోనింగ్‌లూ లేకుండానే
నన్ను వాడిలా మలుస్తున్నాడనేదే
భవిష్యత్ తరాలకు
వాడు విసుర్తోన్న శకుని పాచిక
నట్టింట్లో కాబరేలని, కాసినోలని
మొలకెత్తించిన మోన్‌శాంటో
విత్తనం వూరికే పోతుందా?
చానల్ మార్చినట్టు
మనసు మారిపోతోంది
షార్ట్ మిస్యూజ్ సర్వీస్‌ల సంతలో
మానవత్వపు మెసేజ్ గల్లంతయింది
నెట్ పోర్నోగ్రఫీ వెబ్‌సైట్ల వింతలో

---

# అద్దంలో 'అందం'

**మల్లంపల్లి విజయకుమార్**



అదర్శమంత అందంగా
అసలందం ఉండకపోవచ్చు
కల్తీ చూపుల అంతరంగంలో సైతం
అందం ఒక దయా పారావతం కావచ్చు
ప్రేమించే అందమెపుడూ నిజమైన కరుణ
ఒక ముగ్ధ సుందర వేళలో
మాట కొసన
వేలి కొసన చురుక్కుమన్న ఆ సౌందర్య స్పర్శలో
ఆకారమో, మనసు వికారమో

మోము యందు చిరు మొలకైన ఆశ
ఉబ్బుతున్న ఊహై చిట్టి
బోన్సాయ్ వృక్షమైంది
ఇపుడు అందమంటే మర్యాద
కవ్వింతలు, వీడ్కోలు, చూపుల కలయికలన్నీ
వయసు అంతరాన్ని బట్టో
మనసు ముచ్చటపడిన సందర్భమనో
అనే ఇంగితం తెలుసుకొన్నాక
ఎంత కాదన్నా
పద్ధతుల అపక్రమంలో బుద్ధి పాతాళమని
ఈ ఆకర్షణాకారం వెనక
మనకులానో సామాజిక చింతనలుంటాయని
మనకులానో మనుగడ చక్రాలుంటాయని
తెలుస్తున్న కొద్దీ... అందమిపుడు
అణకువతో ఉన్న రెండంచుల కత్తి

# సమీక్షా పర్వం

- కథలు (1999-2003)
- సులోచనాలు
- అక్కినేని కుటుంబరావు కథలు, నవల
- కథావార్షిక 2003
- శ్వేతపత్రం
- హర్ ఏక్ మాల్
- జీవనలిపి
- అదాలత్ కథలు

కర్ర ఎల్లారెడ్డి




## ఈ కతలు రాయలసీమ రతనాలు

కేతు విశ్వనాథరెడ్డి కొత్త కథల సంపుటిలో మొత్తం పన్నెండు కథలు - ఆయన 1998 నుంచి 2003 వరకు రాసినవి ఉన్నాయి. ఈ సంపుటిని లోతుగా సమీక్షించే ముందు సీనియర్ కథారచయిత అయిన విశ్వనాథరెడ్డి కథారచన గురించి : ఆయన 1962 ప్రాంతంలో మొదటి కథను ప్రచురించారు. పది కథలతో 'జప్తు' అనే కథా సంకలనాన్ని 1974లో వెలువరించారు. ఆ తరువాత 1975 నుంచి 1991 మధ్య కాలంలో రాసిన ముప్పై కథలతో రెండవ కథా సంకలనం వచ్చింది. ఆ తరువాత 'ఇచ్ఛాగ్ని' పేరుతో 1997లో మూడవ కథా సంకలనం వచ్చింది. అందులో20 కథలున్నాయి. ఈ క్రమంలో ప్రస్తుత కథాసంకలనం నాలుగవది.

కేతు విశ్వనాథరెడ్డి ఇప్పటిదాకా రాసిన కథలన్నీ అయిదారు రకాలుగా ఉంటాయి. (1) రాయలసీమ జీవితం మీద రాసిన కథలు :- రాయలసీమలోని అనావృష్టి, నిత్య కరువు, రాజకీయ ముఠా కక్షలూ, అవి రైతులు, రైతు కూలీల జీవితాన్ని ఎలా బలిగొంటున్నాయో చిత్రీకరించారు. నమ్ముకున్న నేల, వాన కురిస్తే, బురుజు, 'ఒక దృశ్యం - మరొక చిత్రం' మొదలైన కథలు ఈ కోవలోనివి. (2) మధ్యతరగతి ప్రజల జీవితం, వారి మనస్తత్వం, వారి జీవితాల్లోని వైవిధ్యం, అబద్ధపు విలువలు, ఆర్థిక సమస్యలు, ఉద్యోగవర్గం బాధల్ని చిత్రించే కథలు, తారతమ్యం, చీకటి తప్పు, వైరుధ్యం, వెనకాముందు, దూరం, చెదిరిన గుండెలు మొదలైన కథలు ఈ కోవలోకి వస్తాయి. (3) పెట్టుబడిదారీ వర్గం గురించిన కథలు. ఈ కథల్లో నగర జీవితం, సంపన్నుల విలాసాలు, పెట్టుబడిదారుల ధన దాహం, చిత్రితమయ్యాయి. అంత్యాక్షరి, ద్రోహం, సింహాసనం, తప్పుపుట్టిన వాళ్ళు, అగ్గిపుల్ల, రుచి, సమిధ కథలు ఈ రకమైనవి. (4) ప్రేమ కథలు : వీటిలో ప్రేమ స్వరూపం, స్వభావం, ప్రేమకు డబ్బుకు ఉన్న సంబంధం, కులాలు, కట్నాలు, హోదాలు మొదలైన అంశాలు ఉంటాయి. వీటిలో స్త్రీ, పురుష సంబంధాలను, దాంపత్యంలో పురుషాహంకారం, స్త్రీ పురుష సంబంధాలలో డబ్బు ప్రమేయం మొదలైన వాటిని వాస్తవిక దృష్టితో చిత్రీకరించారు. ఇచ్ఛాగ్ని, ఎవరు మీరు, ప్రేమరూపం, మన ప్రేమకథలు విశ్వనాథరెడ్డి రాసిన వాస్తవిక ప్రేమ - పెళ్ళి కథలు. (5) స్త్రీల అగచాట్లు, వారి బతుకు కథలు : మహిళలు ఈనాడు పురుష దురహంకారం కింద నలుగుతున్న వైనాన్ని, పితృస్వామ్య భావజాలాన్ని వర్ణించారు. వాటిలో అంతరం, సతి, బంజారు, రెక్కలు ముఖ్యమైనవి. వీటితోపాటు ఆయన కొన్ని దయ్యాల కథలు, వస్తు వైవిధ్యం వున్న మరికొన్ని కథలు రాశారు.

ఇక ప్రస్తుత సంకలనంలోని కథల సంగతి, ఈయన కథల్లో ఉండే ప్రధాన లక్షణం - రాయలసీమ వాస్తవిక జీవితాన్ని డాక్యుమెంటరీ సినిమాలాగా స్థానిక మాండలికంలో చిత్రించటం. సజీవమైన రాయలసీమ మాండలికాన్ని, అక్కడి పలుకుబడులను, సామెతలను, కుటుంబ సంబంధాలను, మానవ సంబంధాలను చాలా ఆర్ద్రంగా చిత్రించారు. కథలన్నీ సాదాసీదాగా మొదలై ఎలాంటి మలుపులు, ఉత్కంఠ, అనవసర వర్ణనలు లేకుండా సాదాసీదాగానే ముగుస్తాయి. అయితే కథల్లో ఎక్కడా అనవసర వాక్యం కానీ, అవసరంలేని పదంకానీ కనిపించదు. ఒక్కొక్క కథలో ఎవరో ఒక వ్యక్తిచేత కథ చెప్పిస్తాడు. ఆ వ్యక్తి పదేళ్ళ బాలుడు కావచ్చు, 50 ఏళ్ళు దాటిన మహిళ కావచ్చు,

70, 80 ఏళ్ళు దాటిన అబ్బ కావచ్చు, జేజి కావచ్చు. కానీ ఎవరు కథ చెప్పినా చాలా సహజంగా, వాస్తవికంగా అది కల్పిత కథ అని పాఠకులకు అనిపించకుండా కథనం సాఫీగా సాగుతుంది.

ఓ పదేళ్ళ కుర్రాడు చెప్పే కథ 'పోలికలు'. బొంబాయిలో నివసించే ఈ బాలుడు తాతయ్య ఇంటికని హైదరాబాద్‌కు వస్తే అక్కడ పెత్తాతయ్య శంకరయ్యతో భలే కాలక్షేపం దొరుకుతుంది. ఈ శంకరయ్య తాత రాయలసీమలోని ఓ ఊరు నుంచి అనారోగ్య కారణంగా తన కొడుకు వద్దకు వస్తాడు. ఈ పెత్తాతకు డాక్టర్లు రకరకాల పరీక్షలు చేసి ఏ రోగం లేదని చెప్పడానికి పదివేలు గుంజుతారు. దానికి పెత్తాత స్పందిస్తూ – "రోగం లేదని చెప్పడానికి 10 వేల ఖర్చా? మనూర్లో పండితే, గిండితే అయిదెకరాల్లోని సెనక్కాయ పంటకు సమానం" అంటాడు. పట్టణాలలో డబ్బు పెంచిక బిళ్ళలతో సమానమని వాపోతాడు.

తొమ్మిదేళ్ళ పాప భార్గవి దృక్కోణంలోంచి చెప్పిన కథ – 'ముఖదర్శనం'. ఆ పాప అబ్బ దివసంనాడు ఆమె జేజి సావిత్రమ్మకు బొట్టు, గాజులు తీసివేయించే తంతు ఆ పాపను ఆ రాత్రి పలవరింతలకు గురిచేస్తుంది. తాను తన మొగుని కంటే ముందే చచ్చిపోతానని, తనకు జేజి మాదిరిగా గాజులు, కుంకుమ, పుస్తె, సిగపూలు తీసివేయవద్దని రాత్రంతా నిద్రలో పలవరిస్తుంది.

హింసకు 'స్వస్తి' చెప్పటం ఎలా? అనే కథలో రాజకీయ నాయకుల వద్ద పని చేసే గన్‌మెన్‌ల జీవితం చిత్రితమైంది. నాగిరెడ్డి అనే కానిస్టేబుల్ చెప్పే కథ ఇది. ఎమ్మెల్యే దగ్గర గన్‌మెన్‌గా అతడు పని చేస్తుండగా ప్రత్యర్థుల దాడిలో ఇద్దరు తోటి గన్‌మెన్‌లు చనిపోతారు. అది చూసిన నాగిరెడ్డి – "నాకు ఈ ఉద్యోగం వద్దు. ఈ కొలువు వద్దు. ఈ దుంప నాశనం వద్దు" అని గొణుక్కుంటాడు. కాని పిల్లనిచ్చిన మామ లోకరీతిగా ఓదార్పు మాటలు చెబుతూ "ఒకమారు నీ పెండ్లాం, పిల్లల దిక్కుచూడు, వాళ్ళ కర్మకాలి వారు చచ్చినారు. నీ అదృష్టం బాగుండి నువ్వు బతికినావు. నువ్వెందుకు ఉద్యోగం మానాల?" అంటాడు. నాగిరెడ్డికి తన పెండ్లాం బిడ్డల కోసమైనా గన్‌మెన్‌గా పనిచేయక తప్పదు.

రాయలసీమ ఫ్యాక్షనిజం గురించి 'మాయపొరలు' కథను గ్రామ విద్యావాలంటీర్ బ్రహ్మం దృక్కోణంలోంచి రచయిత చెప్పాడు. మహా భారతంలో కూడా "హింస చేయనివాడు లేడిజ్జగంబున..." అని ఉందట! బ్రహ్మం అబ్బ సిద్ధారెడ్డి మంచివ్యక్తి. పేదలకు ఇండ్ల ప్లాట్లను ఇప్పించే పనిలో ప్రత్యర్థులు చేసిన దాడిలో చనిపోతాడు. అలాగే క్వారీకి కంకర మిషన్లు పెట్టడానికి అడ్డం తగిలాడు. క్వారీ వాళ్ళకు అది 20 లక్షలకు పైగా నష్టం కలిగిస్తుంది. అలాగే పేదల భూములను చవకగా కొని సిమెంటు ఫ్యాక్టరీకి అమ్మాలనుకున్న వాళ్ళకు అడ్డం పడినందువల్ల సిద్ధారెడ్డి హత్యకు గురయ్యాడు. ఈ కథలో "మనిషి మనిషిగా ఎదిగే కొద్దీ హింసల తగ్గాల కదా" అని బ్రహ్మం తన మిత్రులతో అంటాడు. దానికి ఒక మిత్రుడు ఇలా జవాబు ఇస్తాడు. "మనిషి ఎదగడమా? ఆఫ్ఘనిస్తాన్, కోసావో, చైనాలోని తియాన్మిన్ స్క్వేయిర్‌లో ఎదిగాడు! పాకిస్తాన్‌లో ఇంతెత్తున ఎదిగాడు. ఇండియాలో ఎక్కడబడితే అక్కడ – ఆంధ్రాలో సైతం అన్నిచోట్ల ఎదిగి ఎదిగి కూలబడ్డాడు." కథ చివరిలో బ్రహ్మం పెద్దన్న వాళ్ళ అబ్బను చంపిన హంతకుల నుంచి రెండు లక్షలు తీసుకోవడానికి ఒప్పుకొని కేసులో రాజీపడతాడు. అప్పుడు బ్రహ్మం "పేదలకు ఇండ్ల పట్టాలు?" అని అడుగుతాడు. దానికి ఎవరి వద్దా సమాధానం లేదు.

తొమ్మిదవ క్లాసు చదివే నారపరెడ్డి చిన్నప్పుడు ఒక నవాబు నిధి గురించి బయన్న తాత చెప్పగా వింటాడు. ఆ నిధికోసం నారపరెడ్డి చుట్టం ఒక వ్యక్తిని బలిచ్చినా నిధి మాత్రం దొరకదు. మూఢ నమ్మకాలను వ్యతిరేకించే ఈ కథలో నారపరెడ్డి క్రమంగా డబ్బులు తెచ్చిపెట్టే రియల్ ఎస్టేట్ వ్యాపారం వైపు ఎలా మొగ్గుతాడో రచయిత చూపించాడు. డబ్బుపై ఆశతో తాను వ్యాపారంలోకి దిగితే, తన జ్ఞాతి బాలవేమారెడ్డి తనకు చిన్నపాటి సావాసగాడైన మేకల గంగన్నను నిధికోసం బలిచేస్తాడు. డబ్బుకోసం మనుషులు ఎంతకు తెగిస్తారో ఈ కథ తెలియజేస్తుంది.

అమెరికా జీవితాన్ని రాయలసీమ గ్రామీణ జీవితంతో పోల్చి చెప్పే కథ "రెండు ప్రపంచాల మధ్య." 50 ఏళ్ళు దాటిన కాంతమ్మ దృక్కోణంతో ఈ కథ నడుస్తుంది. తన చిన్నకొడుకు వద్ద రెండు, మూడు నెల్లు ఉండేందుకు కాంతమ్మ అమెరికా వెళ్తుంది. అక్కడ కొడుకు శ్రీధర్, కోడలు శైలజ ఇద్దరూ ఉద్యోగాలు చేస్తూ ఎంతో అన్యోన్యంగా కలిసి ఉంటారు. అయితే వాళ్ళది మాత్రం ప్రేమ పెళ్ళి. అబ్బాయిది రాయలసీమ అయితే, అమ్మాయిది తమిళనాడు. వారి భాషలు, అలవాట్లు వేరు వేరైనా చక్కగా కలిసి ఉంటారు. "మొగుడు, పెళ్ళాలంటే ఇట్లా ఉండాల" అని అనుకుంటుంది కాంతమ్మ. కానీ కాంతమ్మ పెద్ద కొడుకు మాత్రం ఊరిలో ఉంటూ తమ్ముడు అమెరికా నుంచి పంపిన లక్షల డబ్బును దుబారా చేస్తూ ఉంటాడు. వ్యాపారంలో నష్టపోయి, తాగుడుకు బానిసై, ఊళ్ళో వాళ్ళతో గలాటాలు పెట్టుకొని, రాళ్ళు వేసుకుని, వాములు కాల్చుకొని, బాంబులు వేసుకున్న కేసులో జైలుకు వెళతాడు. ఈ కథలో అమెరికా మనుషులు ఎంతో సౌఖ్యంగా బతుకుతున్నట్టు కనిపించినా వారి బతుకులు శ్రీధర్ మాటల్లో – "వరి పండే కాలువ కింద పల్లెలకు పోయే కూలీలకు మాకు తేడా లేదు. కోతలు ఎన్నాళ్ళుంటాయో వాళ్ళకు తెలియదు. అమెరికాలో, ఉద్యోగాల్లో ఎన్నాళ్ళుంటామో ఇక్కడ మాకు తెలియదు." అయినా అమెరికా వెళ్ళిన వారిపై ఇక్కడి వాళ్ళకు ఎన్ని ఆశలో!

ఈ సంకలనంలో చాలా మందికి నచ్చే కథ 'అమ్మవారి నవ్వు'. రచయిత ఈ కథ చివరలో స్వాములవారిపై పేల్చిన విసుర్లను అర్థం చేసుకోకుండా ఈ కథపై కొన్ని విమర్శలు వచ్చాయి. అంటే హిందూమత దృక్పథంతో ఈ కథను రాసినాడని మహమ్మద్ ఖదీర్‌బాబు మరో కథ కూడా రాశాడు. కానీ ఈ కథ హిందూ, ముస్లిం కుటుంబాల మధ్య ప్రేమాభిమానాలను, ఐక్యతను చాటేలా ఉంది. మహమ్మద్ ఖదీర్ బాబు వంటి రచయితలు ముస్లిం దృక్పథంతో రాసే కథలు ఎంత అవసరమో, 'అమ్మవారి నవ్వు' వంటి కథలను అంత కంటే ఎక్కువగా రచయితలు రాయవలసిన అవసరం ఉంది.

మరొక అమెరికా కథ 'దగ్గరైన దూరం – దూరమైన దగ్గర'లో పదేళ్ళు అమెరికాలో నివసించిన వీరభద్రుడు తన ఇద్దరు కూతుళ్ళతో సహా రామాపురంలో అడుగుపెడతాడు. రాయలసీమ గ్రామీణ పరిస్థితులు వివరిస్తూ మునెయ్య తాత – "రైతును పట్టించుకునే రాజ్జెం కాదు ఇది" అని వీరభద్రుడితో అంటాడు. వీర భద్రుడి పిల్లలు – అమెరికాలో వారికి

## చందాలపై వివరణ

సాంకేతిక సమస్యల వల్ల ఇప్పటికి ప్రస్థానం చందాలు తీసుకోవడం లేదు. బహుశా నూతన సంవత్సరం నుంచి ఆ ఏర్పాటు జరగవచ్చు. సాహితీ మిత్రులు తరచూ చందాదారులు కావాలనే ఉత్సాహం ప్రదర్శిస్తున్నందున ఈ వివరణ. అవకాశం రాగానే వారందరూ తప్పక చందా కట్టడం, కట్టించడం చేస్తారని ఆశిస్తున్నాం.

అయితే ఒకరిద్దరు మిత్రులు తాము చందా కట్టామని, పత్రికరావడం లేదని సమావేశాల సందర్భంలో దృష్టికి తెచ్చారు. అలాటి వారు వివరాలు తెల్పితే తప్పక పత్రిక చేర్చగలం. అలాటి సమస్యలు మీ దృష్టికి వచ్చినా వెంటనే మాకు తెలియజేయవలసిందిగా కోరుతున్నాం. ప్రస్థానం మీ అందరిదీ. ఒక్కరు కూడా ఈ విషయంలో ఇబ్బంది పడకుండా పత్రిక అందించడానికి మీ సహకారం ముఖ్యం.

లభించిన సౌకర్యాలతో తమ తండ్రి జన్మించిన ఊరి సౌకర్యాలను పోల్చుకొని "ఇక్కడ చాలా బాగుంది, అమెరికాలో మాదిరి అన్నీ ఎందుకు లేవు?" అని అంటారు. మరో చక్కని కథ 'సంకట విమోచని'. చిన్ననాటి నుంచి చదువులో ముందుండే చౌడేశ్వరికి తనకంటే నాలుగేళ్ళ ముందు రీడర్‌గా ప్రమోషన్ రావటం చెన్నారెడ్డికి కంటగింపుగా ఉంటుంది. చౌడేశ్వరి బిసి అయినందువల్లే తొందరగా రీడర్ అయిందని అతడనుకుంటాడు. చిన్న నాటి నుంచి అన్నగా భావించే చెన్నారెడ్డితో చౌడేశ్వరి ఇలా అంటుంది: "అన్నా! నేను నీకంటే ముందు రీడర్ అయినాని, నా మీద కోపానికి అదే కారణం అనుకోమంటావా? కులం వల్ల, ఆ కులానికి ఉండే రిజర్వేషన్ వల్ల మాత్రమే నేను రీడర్‌ని అయ్యానని కోపమా?" కానీ నిజానికి చౌడేశ్వరి చెన్నారెడ్డి కంటే చాలా తెలివైనది. అతని కంటే ఎక్కువ పరిశోధనా పత్రాలు ప్రచురించింది. కానీ నిరాశతో చెన్నారెడ్డి రీసెర్చి పేపర్లు రాయటం మానేసినందుకు నొచ్చుకుంటుంది. చివరికి అతని థీసిస్ అచ్చయ్యే ఏర్పాటు చేస్తుంది. "జీవితాన్ని సాధించే వాళ్ళు, జీవితంలో సాధించుకునే వాళ్ళు" ఉంటారని, చెన్నారెడ్డి మొదటి రకం మనిషని అంటుంది. కథ చివరిలో చెన్నారెడ్డి ఇలా అనుకుంటాడు: "నా పిల్లలయినా జీవితాన్ని సాధిస్తూ కూర్చోకుండా, జీవితంలో చౌడేశ్వరిలాగా ఏదైనా చక్కగా సాధిస్తే బాగుండు".

ఆ తరువాతి కథను నాలుగవ తరగతి చదివే గంగాధర్ చెబుతాడు. రాయలసీమ నీటి కరువు గురించి గంగాధర్ రాసిన కథ చదివి రంగయ్యసార్‌కు కండ్ల నీళ్ళు వచ్చినాయి. అది చూసి గంగాధర్ కత చదివితే కండ్ల నీళ్ళు వస్తాయా? అనుకుంటాడు. "పెద్దయ్యాక గంగను మా ఊరికి తేవాల. ఆరునూరు కానీ గంగను తేవాల. అన్ని ఊర్లకు తేవాల. తెచ్చి తీరాల." అని గంగాధర్ అనుకుంటాడు.

వార్తా పత్రికల్లో గ్రామీణ స్ట్రింగర్లు రాసే మంచి సామాజిక స్పృహ ఉండే వార్తా కథనాలను పత్రికా సంపాదకులు ఎలా 'కిల్' చేస్తారో తెలియజెప్పే కథ 'విరూపం.' అలాంటి స్ట్రింగర్లు లైన్ అక్కౌంట్ వార్తలేవో రాసుకోవాలని సలహా ఇస్తారు. హిందూ పెట్టుబడిదారుల లాభాలను ప్రశ్నిస్తూ కూలీ వాళ్ళ బాధలను చెప్పిన స్ట్రింగర్ ఇస్మాయిల్ వార్తా కథనం ఎడిటర్‌కు నచ్చక 'కిల్' చేయమంటాడు.

ఉత్తమ తెలంగాణ కథలను వెదికే క్రమంలో ఈ సమీక్షకుడు తెలుసుకున్నదేమిటంటే తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలు ఒకేలా వెనుకబడ్డాయి. రాయలసీమ సమస్యలకు తెలంగాణా సమస్యలకు చాలా పోలికలు ఉన్నాయి. కరువులు, నీటి సమస్య, పట్టణాలకు వలసలు అన్నీ ఒకే రకమైన సమస్యలు. ఈ రెండు ప్రాంతాల భాష కూడా చాలా వరకు ఒకే విధంగా ఉంది. రాయలసీమకు చెందిన అగ్రశ్రేణి రచయితల్లో విశ్వనాథరెడ్డి ఒకరు. అంతేకాదు, తెలుగు కథకుల్లో కూడా ఆయన స్థానం గొప్పదే. ఈ సంకలనంలోని రెండు కథలు-ఒక వాల్మీకి, 'కాంక్ష' కొంచెం బలహీనంగా ఉండి నిరాశ కలుగజేస్తాయి. కొన్ని కథల్లో పాత్రల సంఖ్య మరీ ఎక్కువయినట్లుగా ఉంది. అయినా విశ్వనాథరెడ్డి కథలు తప్పక చదవాల్సినవి-ముఖ్యంగా కొత్తగా కథలు రాయటం మొదలుపెట్టినవాళ్ళు. **(కేతు విశ్వనాథరెడ్డి కథలు 1998-2003, పేజీలు: 116, వెల రు. 45/-. ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అన్ని బ్రాంచీలు.)**

**ఎ.ఆర్.**

## 'సులోచనాలు' ఒక సృజన




తెలుగులో ప్రథమ హైకూ కావ్యం ప్రచురించిన పెన్నా శివరామకృష్ణ 120 హైకూల సంపుటి 'సులోచనాలు'

సమాజంలో మనిషికిప్పుడు దృష్టిలోపం ఏర్పడింది. అందువల్ల వక్రదృష్టితో చూస్తున్నాడు, సమాజాన్ని వక్రీకరిస్తున్నాడు. జీవితాన్ని అల్లకల్లోలం చేసుకుంటున్నాడు. ఇప్పుడు మనిషి తనంత తానుగా కన్నీళ్ళు కార్చే స్థితి పోతున్నది. తనకు బదులుగా కన్నీళ్ళు కార్చేందుకు 'రుదాలి' యంత్రాలను సృష్టించుకునే విచిత్ర పరిస్థితి ఏర్పడుతున్నది. మసకబారి మారిపోయిన దృష్టిలోపాన్ని సవరించేందుకు 'సులోచనాల' అవసరం ఉంది.

పెన్నా శివరామకృష్ణ చెట్టుమీద, ప్రాకృతిక ప్రాణుల మీదా, వనరుల మీద చాలా హైకూలు రాసారు. అంశాలను వస్తువులను చూసి తానింకా సంప్రదాయవాదే అనలేము. ప్రకృతినీ నేలనూ అంటిపెట్టుకోనుండటమంటే తల్లిని బిడ్డ అంటిపెట్టుకోనుండటమే. నిజానికి మనిషి తాను ఎంతో ఎదిగాననీ, అన్నీ తెలుసుననీ గర్వాలు పోతుంటాడు. కానీ నిత్యం మన కళ్ళపడే చెట్టునుండీ, ఆకాశం, నీరు సమస్త ప్రాణుల నుండీ నేర్చుకోవాల్సినవి చాలా ఉంటాయి.

"ఎదగాలంటే
హృదయమెన్ని చీలికలు కావాలో
చెబుతుంది చెట్టు"... అనే పదాలు అదే విషయాన్ని నిర్ధారిస్తున్నాయి...

"కాస్త చోటిచ్చిన నేలకు
గొడుగు అయింది
ఒకనాటి బీజం"

ప్రకృతిలోని ప్రతిదీ పరోపకారే.... ఈ పరోపకార, పరసహన బుద్ధి లేకుండా పోతున్నది మనిషిలోనే అన్నింటినీ తక్కువగా, చులకనగా, హీనంగా చూసే మనిషి అనేక లోపాలతో సాధించిందేమిటి? ఎదుగుదల దేనిలో? అనే ప్రశ్న వస్తుంది. మొక్కకున్న గుణం మొలకెత్తడం.. మొలకెత్తీ ఎదగడం... ఎదిగి ఎదిగి మహావృక్షం కావడం.

"మట్టిగోడ ఉండేది
ఇప్పుడు మహావృక్షం
గోడలో మొలిచిన మొక్క"

ఇలాంటి ఎన్నో వైవిధ్యభరితమైన, సందేశ చమత్కృతి కలిగిన హైకూలతో రూపుదిద్దుకున్నది 'సులోచనాలు'. చక్కని ముఖచిత్రంతో

"గొడుగో? శిలువో?
ఇంటిని మోస్తూ
నత్త"

"నగరంలో తోట
రెక్కలు కత్తిరించబడి చెట్లు
ప్రేమ పక్షులు'

సంక్షిప్తతలో అనంతార్థాలను ధ్వనించే ప్రక్రియ హైకూ.. హైకూలపట్ల పఠనాసక్తీ, రచనాసక్తీ ఉన్న వాళ్ళందరూ మళ్ళీమళ్ళీ చదవాల్సిన పుస్తకం ఇది.

**(కాపీలు దొరుకుచోటు : విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ, దిశ పుస్తక కేంద్రాలు, వెల :రు. 20/-, పేజీలు :46)**

అంపశయ్య నవీన్

# అక్కినేని కుటుంబరావు కథలు, నవల

పనివాడితనం



అక్కినేని కుటుంబరావు

అక్కినేని కుటుంబరావు రచించిన 17 కథల సంపుటి ఈ 'పనివాడితనం" అనే పుస్తకం.

కుటుంబరావు రచించిన కథల్లోగానీ, నవలల్లోగానీ (సొరాజ్జెం, మోహనరాగం) ప్రత్యేకంగా కనిపించే లక్షణం. వాస్తవికత. దీన్ని డాక్యుమెంటరీయలిజం' అనొచ్చు. ఆయన కథల్లో కథాత్మకత కంటే వాస్తవ పరిస్థితుల చిత్రణ, ముఖ్యంగా అట్టడుగు వర్గాల ప్రజల జీవన చిత్రణ ఆయన రచనలకు ప్రధాన భూమికగా ఉంటుంది. స్త్రీల సమస్యలపట్ల కూడా ఆయనకు సునిశితమైన స్పందన ఉంది. స్త్రీ జన పక్షపాతం, శ్రామిక జనపక్షపాతం ఇవి రెండూ ఆయన కథల్లో ప్రస్ఫుటంగా కనిపించే అంశాలు.

ఈ సంపుటిలోని మొదటి కథ "రాధారాణి చచ్చిపోయింది" పెళ్ళి అనేది నిండు జీవితంతో తొణికిసలాడుతున్న ఒక యువతిని ఎలా నిర్జీవంగా మార్చేస్తుందో చిత్రిస్తుంది.

రాధారాణి గొప్ప సౌందర్యవతి - ఆమె చక్కగా పాడగలదు కూడా - చలం కథలు, ఠాగూర్ కవిత్వం అంటే ఆమెకు చాలా ఇష్టం. ఆడుతూ, పాడుతూ, చదువుతూ గడుపుతున్న రాధారాణికి అకస్మాత్తుగా పెళ్ళవుతుంది. (కుటుంబరావు కథల్లో చలం చాలాసార్లు కనిపిస్తుంటాడు)

ఆమెకు పెళ్ళి నిశ్చయమైందని తెలుసుకున్న ఆమె స్నేహితుడు పెళ్ళంటే ఏమిటో ఇలా చెబుతాడు :

"ఈ పెళ్ళిళ్ళన్నీ ఊరికే కూలిపోయే చవుడుగోడలు రాధా! వీటికేం పునాది బలం ఉంది? ఆచారాల కుళ్ళేగానీ? ప్రేమానుభవమూ, ఆత్మోన్నత్యమూ ఎదగని మానసిక వికలాంగులంతా చేరి రెండు చిన్న జీవితాల్ని చేర్చి బంధించి, బిగించి రాక్షసపు ముళ్ళు వేస్తారు. అవి బిగిసి, బిగిసి స్వేచ్ఛ అంతా హరించి రెక్కలన్నీ విరగదీసి ప్రాణాపాయం కరిగించినా అశక్తులై, అసమర్థులై, ఆ నిర్బంధాన్నే జన్మజన్మల అనుబంధం అనుకుంటూ, ఆ తాళ్ళనే పూల మాలలనుకుంటూ, ఆత్మవంచనతో కూలుగుతూ, కుళ్ళుతూ, ఏడుస్తూ మళ్ళీ జన్మమీద విరక్తి పుట్టి జీవితం చాలిస్తారు....

పెళ్ళిని గురించిన తన ఈ భావాలను రచయిత ఈ కథలో ఇంత బలంగా చెబుతాడు.

రాధారాణి పెళ్ళి చేసుకొని, భర్తకూ, అత్తమామలకూ సేవచేస్తూ, పిల్లల్ని కని వాళ్ళకు సేవ చేస్తూ తన వ్యక్తిత్వాన్ని, తన అందాన్ని, తన ప్రతిభనూ కోల్పోయి జీవచ్ఛవంలా మారిందన్న సూచనతో రచయిత ఈ కథను ముగిస్తాడు.

పెళ్ళి అనేది స్త్రీలను వ్యక్తులుగా చంపేస్తుందని చెప్పాలన్న ఆరాటంతో రచయిత ఈ కథ రచించాడు. ఈ కథల రచయిత ముందస్తుగా ఏర్పరచుకున్న ఒక భావమే ప్రధానంగా కనిపిస్తుంది. పెళ్ళి అనేది ఇంత పెద్ద చెడు అనుకొని ఎవ్వరూ పెళ్ళి చేసుకోకుండా ఉంటే సమాజం ఎలా కొనసాగుతుందనే సమస్యను రచయిత పట్టించుకోడు. పెళ్ళి అనేది ఒక అవసరమైన చెడు ఈ రచయితకెంతో ఇష్టుడైన చలం కూడా అంగీకరించాడు కదా!

"నక్సలైట్లొస్తున్నారు. జాగ్రత్త" అన్న కథలో నక్సలైట్ల పేరు చెప్పి పోలీసులు పల్లెటూర్లలో భయకరమైన పేదరికాన్ని అనుభవిస్తూ బతుకుతున్న పేద వాళ్ళను ఎలా హింసిస్తారో చిత్రించబడింది.

"విలువలు-1" కథలో తమ మూలాల్ని మరచిపోయి ఎయిర్ కండిషన్డ్ బార్లలో పార్టీలు జరుపుకునే మధ్య తరగతికి చెందిన ఓ ఐదుగురు యువకుల మనస్తత్వాలు చిత్రించబడ్డాయి. విలువలు పతనమైపోతున్నాయన్న ఆవేదన ఈ కథలో కనిపిస్తుంది.

'వాయిదా' కథలో ఫ్యాక్టరీలలోనూ, ఆసుపత్రుల్లోనూ శ్రామికులపట్ల చూపించబడుతున్న వివక్షత చిత్రించబడింది.

'కీర్తిశేషుడు' కథలో మైసయ్యలాంటి శ్రామికుడు చనిపోతే ఒకలా, రాజా సుబ్రమణ్యేశ్వరరావు అనే ఫ్యాక్టరీ యజమాని చనిపోతే మరోలా స్పందించే సామాజిక నీతిని రచయిత ప్రశ్నిస్తాడు.

ఆడపిల్లను కనడం, ఆ పిల్లకు ఘనంగా పెళ్ళి చేయడం లాంటి తప్పు చేయడంవల్ల సీతాపతి అనే ఓ మధ్యతరగతి కుటుంబీకుడు ఎలా సర్వనాశనం అయిపోయాడో 'తప్పు' అనే కథలో రచయిత చెబుతాడు.

బస్సులో కాస్సేపయినా రాంబాబు లాంటి ఓ మంచి వ్యక్తి దగ్గర కూర్చొని తన పేద తల్లిదండ్రుల్ని మరచిపోయిన బుజ్జిగాడి కథను "బస్సెళ్ళిపోయింది" చెబుతుంది.

"విలువలు-2" అన్న కథలో తెలుగు సినిమాలు చూసే ఒకప్పటి తరానికి, ఈనాటి తరానికి మధ్య ఏర్పడుతున్న తరాల అంతరాలు చిత్రించబడ్డాయి.

"పిచ్చీ పిచ్చీ పిల్లంగోరే" కథల్లో ప్రేమించుకున్న ఇద్దరు స్త్రీ పురుషుల్ని ఆ ఊరి పెద్ద మనుషులు ఎలా శిక్షిస్తారో చూపించబడింది. ఊరి మంగలిని పిలిపించి వాళ్ళిద్దరి తలల మీదున్న వెంట్రుకల్ని కొరిగిస్తారు. "సత్యవతి లాంటి ఎంతో మంచి మనిషికి ఇంత కఠినమైన శిక్షా?" అని అందరూ బాధపడ్తారే తప్ప ఎవ్వరూ వాళ్ళకు సహాయం చేయడానికి ముందుకు రారు.

స్నేహితుడి దగ్గర్నుంచి అప్పు తీసుకొని తిరిగి ఇవ్వకపోవడాన్ని రచయిత "మనుషులు" కథలో చిత్రించాడు.

అనేకథలో ఈ ఉదంతం చెప్పబడింది. యేదన్నా విలువైన వస్తువుపోతే అది దొరకదని ముందే నిర్ణయించుకునే కొందరి మనస్తత్వాన్ని "దొరకదండీ బాబు" కథ చిత్రిస్తుంది.

'బండి' అన్న కథలో రామూ అనే వ్యక్తికి ఒకప్పటి తన పల్లెటూర్లో ఉన్న 'బండి' మీదున్న ప్రత్యేక అభిమానాన్ని రచయిత చిత్రించాడు. పల్లెటూర్లో ఉన్న తన ఆస్తులనన్నీ అమ్ముకొని పట్నానికెళ్తున్న రామూ ఆ బండిని మాత్రం అమ్మడానికి అంగీకరించడు. వీరయ్య అనే బండ్లు కిరాయకు నడిపే వ్యక్తికి తన బండిని రామూ ఉచితంగా ఇచ్చేస్తాడు. ఆ బండిని అమ్మేస్తే దాన్ని విడదీసి ఏ భాగానికా భాగాన్ని అమ్ముకుంటారనీ, అలా బండి అనేది ఉండదని అతని భయం. అందుకే ఈ కథా సంపుటికి ముఖ చిత్రంగా 'బండి'నే ముద్రించడం, ఈ కథను గూర్చి కీ.శే. చలసాని ప్రసాదరావు 'జ్యోతి' పత్రికలో రాసిన ప్రశంసా

వాక్యాల్ని చేర్చడం దీనిని రుజువు చేస్తుంది. పట్నంలో ఉంటున్న రాంబాబు బస్సు దిగి తను పుట్టి పెరిగిన పల్లెటూరు కొస్తూ తన బాల్యాన్ని గుర్తు చేసుకున్న వైనాన్ని "లాడుకోడుగట్టుకాడ" అన్న కథ చిత్రిస్తుంది. 'లేళ్ళకోడు' అన్న మాట 'లాడికోడు'గా మారడం, దాని గట్టు మీద రాంబాబు నడవలేకపోవడం, దాని మీద వంతెనను కట్టిస్తాననీ, అందుకయ్యే పాతికవేల ఖర్చును తనే భరిస్తానని రాంబాబు చెప్పడం, ఆ మాటవిన్న ఆ ఊరి వాళ్ళు రాంబాబు వచ్చే ఎన్నికల్లో నిలబడబోతున్నాడని అనుకోవడం, ఎవ్వరూ నిస్వార్థంగా ఇలాంటి మంచిపని చేయరన్న పల్లెటూరి ప్రజల దృక్పథాన్ని చూసి రాంబాబు ఆశ్చర్యపడటం -ఇదీ "లాడికోడు గట్టుకాడ" కథలోని ఇతివృత్తం.

"పనివాడితనం" అన్న ఈ సంపుటిలోని చివరి కథలో గొప్ప కళాకారులైన శిల్పుల శ్రమను మధ్య దళారులెలా దోచుకుంటారో రచయిత సున్నితంగా చిత్రించాడు.

వెంటాచారి అనే శిల్పి చెక్కిన ఓ శిల్పానికి రెండు వేలు మాత్రమే ముద్తాయి. కానీ ఆ శిల్పాన్ని విదేశాలకు ఎగుమతి చేసిన ఓ మధ్య దళారి దాన్ని అమ్మడం ద్వారా పాతిక వేలు సంపాదిస్తాడు.

"నువ్వు బంగారం సృష్టించు. అమ్ముకోటం తెలియకపోతే అది మట్టితో సమానం. సృష్టించేవాడికి అమ్ముకోవటం రాదు. అందుకే సృజన ఎంత గొప్పదో అంతపేదది. నేను చెప్పే పనివాడితనం ఇలా అమ్మగల్గిన వాళ్ళది. ఈ కాలంలో పనివాడి తనమంటే అదే. అదే అసలైన పనివాడితనం" అంటాడు.

"ఈ చేతులు సృష్టించడానికే పుట్టాయి. అమ్ముకోటానికి కాదు" అనుకుంటాడు వెంకటాచారి.

ఇలా సృష్టించడం, అమ్ముకోవడం ఈ రెండింటి మధ్య ఉండే వ్యత్యాసాన్ని ఈ కథ చక్కగా విడమర్చి చెప్పింది.

మార్క్స్ అదనపు విలువ సిద్ధాంతానికి ఈ కథనొక మంచి ఉదాహరణగా చెప్పొచ్చు. ఇలా ఈ కథల్లో జీవిత వాస్తవాలకు రచయిత నమ్మిన కొన్ని సూత్రాలతో సమన్వయం చేయడం బావుంది.

**(పనివాడితనం, ఇతర కథలు, రచయిత : అక్కినేని కుటుంబరావు, ప్రచురణ : స్వేచ్ఛ ప్రచురణలు, హైదరాబాద్. ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ, హైదరాబాద్, ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు. పేజీలు : 140, వెల : రు.50/-)**

## "మోహనరాగం"




"సోరాజ్యం' నవలతో తెలుగు నవలా సాహిత్యంలో లబ్ధప్రతిష్టులైన అక్కినేని కుటుంబరావు రచించిన మరో నవల ఈ 'మోహనరాగం' ఈ నవలలోని ప్రధాన పాత్ర మోహనరావు ఈ నవల అతని చుట్టే తిరుగుతుంది.

ప్రభుత్వం వారు "మాతాశిశు సంక్షేమ విద్యా పథకం" కింద కొంత మంది అధికారులను పల్లెటూర్లకు పంపించి అక్కడ నివసించే ప్రజల విద్య, ఆరోగ్య సదుపాయాలను మెరుగుపరచే ప్రయత్నం మొదలెట్టారు. అలా పల్లెటూర్లకు వెళ్ళే ఒక బృందంలో మోహనరావు చేర్తాడు. ఆ టీం కు పంకజవల్లి అనే ఆమె నాయకురాలుగా ఉంటుంది. సుందర్రావు, ఛాయ, పరమేశం, సుజాత మొదలైన వాళ్ళు అ టీమ్‌లోని ఇతర సభ్యులు సుందర్రావు, పరమేశం - వీళ్ళిద్దరూ ఎప్పుడూ ఆడవాళ్ళను గూర్చి అవాకులు, చవాకులు చెబుతూ కాలం గడుపుతుంటారు. వీళ్ళందరిలోనూ మోహనరావు సంస్కారవంతుడిగా కనిపిస్తాడు.

ఈ నవల మోహనరావు తన మిత్రుడు చంద్రంకు రాసే ఒక ఉత్తరంతో ప్రారంభమై మళ్ళీ ఈ మోహనరావే చంద్రానికి రాసిన ఉత్తరంతో ముగుస్తుంది. పల్లెటూర్లను తిరుగుతూ, అక్కడి ప్రజల సమస్యలను అర్థం చేసుకుంటూ, తన టీం లోని ఇతర సభ్యుల ప్రవర్తనను అధ్యయనం చేస్తూ మోహనరావు తన ఈ అనుభవాలను చంద్రానికి ఉత్తరాల ద్వారా తెలియజేస్తుంటాడు.

"వాళ్ళ అన్ని రోగాలకు మూలం ఆకలే. గ్రామాల్లో ఉండే వాళ్ళ రోగాలన్నిటినీ సర్వే చేస్తే అన్ని రోగాలకు కారణం "మాల్‌న్యూట్రిషన్" అని తేలింది. మాల్‌న్యూట్రిషన్‌కు మందు ఆహారం తిండి - అన్నం.

చంద్రం! మనం ఏమీ చేయలేమా? చెయ్యవద్దా? ఎందుకు ఆలస్యం. ఏమిటీ అడ్డం?" అంటూ చంద్రానికి మోహనరావు రాసిన ఉత్తరంతో రచయిత ఈ నవలను ముగించాడు.

గ్రామీణ ప్రాంతాల్లో ఉన్న ప్రజల ఆకలిని ఎవ్వరూ తీర్చలేరన్న ఆవేదన ఈ నవల నిండా కనిపిస్తుంది.

పల్లెటూర్లలో నివసిస్తున్న ప్రజల్లోని అజ్ఞానం, మూఢవిశ్వాసాలు, అమాయకత్వం, నిస్సహాయత మోహనరావు దృక్కోణంలోంచి చిత్రించబడ్డాయి.

వీళ్ళ యూనిట్‌లో సబిత అనే ఓ అమ్మాయి పని చేస్తుంటుంది. ఈ అమ్మాయికి ఆ కాంటీన్‌లో ఉద్యోగమిస్తారు. సబిత అందంగా ఉంటుంది. అందంగా ఉండటమే కాకుండా ఎవర్ని చూసినా నవ్వుతుంటుంది. దాంతో ఆ ఊర్లో ఉన్న యువకులందరూ ఈ అమ్మాయి నడుపుతున్న కాంటీన్ చుట్టే తిరుగుతుంటారు. ఈ అమ్మాయిని కాంటీన్‌లోంచి తీసేయాలని ఆ ఊరి పెద్దలంతా పంకజవల్లికి ఫిర్యాదు చేస్తారు. ఆమెకు సబిత పట్ల సానుభూతి ఉంటుంది. ఇంత మాత్రానికి ఆ అమ్మాయిని ఉద్యోగంలోంచి తీసేయడం అన్యాయమని చెప్పి స చేస్తుంది.

రామచంద్రారెడ్డి అనే ఆ ఊరి ఓ మోతుబరిరైతు సబితను రెండో పెళ్ళాంగా స్వీకరిస్తానని వెంటపడ్తాడు. సబిత కూడా అతనికి లొంగిపోతుంది. ఈ కారణంగా చాలా పరిణామాలు కలుగుతాయి. అందర్నీ చూసి నవ్వడమే సబిత చేసిన తప్పు.

నవలలో ఈ సబితదే ప్రధాన సమస్య అనుకుంటున్న తరుణంలో దృశ్యం మారుతుంది. రచయిత మోహనరావు, సుజాతల ప్రేమ వ్యవహారాన్ని ముందుకుతెస్తాడు. ఆ టీం లోని సుజాతనూ ఛాయను - ఇద్దర్నీ ఇష్టపడ్డ మోహనరావు ఛాయకంటే సుజాతే తన హృదయానికి దగ్గర అని గుర్తిస్తాడు. ఆమె ప్రేమలో పడిపోతాడు. సుజాత కూడా అతన్ని ప్రేమిస్తుంది.

పెళ్ళి చేసుకోకుండానే వాళ్ళు శారీరకంగా కలిసిపోతారు. వాళ్ళ ఈ కలయికను రచయిత హృదయపూర్వకంగా సమర్థిస్తాడు. మనస్సులు కలిస్తే శరీరాలు కూడా చాలా సహజంగా కలిసిపోతాయి. అందుకు పెండ్లి అనే ఓ కృతకమైన లైసెన్స్ అక్కర్లేదు అన్న భావాన్ని రచయిత వ్యక్తపరుస్తాడు.

శారీరకంగా కలిసిన తర్వాత మోహనరావు, సుజాతలు పెళ్ళి చేసుకోవాలని ప్రయత్నిస్తారు. సుజాత మా తల్లిదండ్రులను, ఈ పెళ్ళికి ఒప్పిస్తాననీ, ఆ తర్వాతే మనం పెళ్ళి చేసుకుందామని మోహనరావుకు చెప్పి వాళ్ళ ఊరు వెళ్తుంది. వాళ్ళకు కాబోయే అల్లుడిది తమ కుల

కాదని తెలుసుకున్న సుజాత తల్లితండ్రులు వాళ్ళ పెళ్ళికి అంగీకరించరు. సుజాతను గృహ నిర్బంధానికి గురి చేసి ఆమెకు వేరే సంబంధం నిర్ణయించి పెళ్ళి చేయాలని ప్రయత్నిస్తారు. వాళ్ళ చెర నుండి ఎలాగో సుజాత తప్పించుకొని తిరిగి మోహనరావును చేరుకుంటుంది. వాళ్ళు రిజిష్టర్డు మ్యారేజి చేసుకుంటారు. ఇలా ఈ నవలలో సబితకు సంబంధించిన కథొకటి, సుజాత, మోహనరావుల ప్రేమ వ్యవహారమొకటి ప్రధానమైన సంఘటనలుగా కనిపిస్తాయి. మిగతా భాగమంతా ఆంధ్రదేశపు పల్లెటూర్లలో కనిపించే పేదరికం మీద, పల్లె ప్రజల జీవన విధానం మీద, ప్రభుత్వ పథకాల వైఫల్యం మీద, ప్రభుత్వోద్యోగుల అలసత్వం మీద కేంద్రీకరించబడింది. ఎక్కువగా సంభాషణల ద్వారా అనేక పాత్రల మనస్తత్వాలను చిత్రించే ప్రయత్నం జరిగింది. పల్లెటూరి ప్రజలు మాట్లాడే భాషలోని యాసను రచయిత సరిగ్గానే పట్టుకున్నాడు. మొత్తమ్మీద, ఈ నవల చదువుతోంటే ఓ డాక్యుమెంటరీ చిత్రాన్ని చూస్తున్నట్టుగా ఉంటుంది. **(మోహనరాగం నవల, రచయిత : అక్కినేని కుటుంబరావు, ప్రచురణ : స్వేచ్ఛ ప్రచురణలు, ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు, పేజీలు : 116, వెల :రు.50/-)**

**మణిదేవుపల్లి**




## కథావార్షిక 2003

కథాసాహితీవాళ్ళు 90లో ఆ యేడాదిలో వచ్చిన కథల్లో నుంచి కథలను కొన్నింటిని ఏరి ఒక సంకలనంగా ప్రచురించడం మొదలుపెట్టిన తరువాత రచయితల్లో సీరియస్‌నెస్, పాఠకుల్లో ఆసక్తి పెరిగింది. మధురాంతకం రాజారాం సాహితీ సంస్థ వారు 99 నుంచి ఒక రచయిత ఉత్తమ కథల సంపుటికి 'కథాకోకిల' పురస్కారం అందిస్తూ కథా వార్షిక పేరుతో కొన్ని మంచి కథలను ప్రచురిస్తున్నారు. కథల సంకలనంతోపాటు ఆ యేడాది వచ్చిన కథలపై సింహావలోకనం పేరుతో ఒక సమీక్షా వ్యాసాన్ని కూడా ప్రచురిస్తున్నారు. ఈ మధ్యే 'తెలంగాణా కథ 2003' విడుదలయ్యింది.

కథావార్షిక 2003 సంకలనంలో పి.రామకృష్ణ 'కరువుపీల్చిన మనుషులు' గౌరవ సంపాదకీయ కథతోపాటు కథాకోకిల పురస్కార సంపుటి పెద్దింటి అశోక్ కుమార్ ఊటబాయి నుంచి 'తెగిన బంధాలు' కథ ఉన్నాయి. మొత్తం ఎనిమిది కథలున్నాయి.

కరువులో ఉన్న వికృతాన్ని విప్పి చెప్పిన కథ ఆదిమ దశ నుంచీ ప్రకృతితో పోరాడి యింత అభివృద్ధిని సాధించిన మనిషి మళ్ళీ ఆదిమ ప్రాకృతిక దశలోకి ఆకలి దప్పికల అనాగరిక దశలోకి పడిపోవడం ఎంత విషాదమో కదా ఈ విషాదాన్ని మూసధోరణిలో కాకుండా లేఖా పద్ధతిలో చెప్పడానికి ప్రయత్నం చేసారు రచయిత. పది సంవత్సరాల క్రితం అనంతపురం వచ్చిన మిత్రుడికి నేటి పరిస్థితులతో కర్షకుల కడగండ్లతో లేఖ రాయడం కథాంశం. అనంతపురం జిల్లా నుంచి రచయితలూ, కళాకారులు ఊరూరూ తిరుగుతూ 'ఆత్మహత్యలు మీ ఏ ఒక్క సమస్యనూ పరిష్కరించవు' అని రైతులకు ధైర్యం చెబుతారు. వారికి 'తన తండ్రి ఆత్మహత్య చేసుకుంటే బాగున్ను' అనుకున్న పాప ఎదురవుతుంది. ఒకప్పుడు కూతురు నచ్చిన వాణ్ని పెళ్ళి చేసుకుంటాననంటే ఆమెని నరకడానికి ఉరికే తండ్రి, పరిస్థితులు దిగజారడంవల్ల వేశ్యగా మారేసరికి ఆమె పంచన చేరతాడు. పరాన్నభుక్కుగా మారిపోతాడు. అప్పటి తండ్రికంటే కొడవలితో తనని నరకడానికొచ్చే అప్పటి తండ్రే బాగున్నాడంటుంది పాప. కరువు మనిషిలో ఉన్న మనిషి తనాన్ని పీల్చేసి ఆకలి దప్పికలదొల్లలుగా ఎలా ఎలామిగుల్చుతుందో ఈ కథ చెబుతుంది.

ఇబ్రహీం-కాలానికి ఎదురీదుతున్నవాడు. ఈ కథ ప్రభుత్వ పాఠశాలలో ఏకోపాధ్యాయుని వ్యథ. తన పని తనని చేసుకోనివ్వకుండా ప్రభుత్వం ఎన్ని ఆటంకాలు పెడుతుందీ ఈ కథ చదివితే అర్థం అవుతుంది. ఉపాధ్యాయులు కాని వారు ఈ కథ చదివి నిజమా? అని ఆశ్చర్యపోవచ్చుగాని టీచర్లకు మాత్రం ఇవన్నీ నిత్యకృత్యాలే. డిప్యూటీ డి.ఇ.ఓ, ఎం.ఇ.ఒ, ఎం.డి.ఒ. విద్యా కమిటీ ఛైర్మన్, హెల్త్ అసిస్టెంట్, ఎన్.ఎం.ఎ., విలేజ్ సెక్రటరీ, వీళ్ళంతా ఒకేసారి దాడి చేయడం అతిశయోక్తిగా అనిపించినా, వేరువేరు సందర్భాల్లో అయినా అలా జరగడం నూటికి నూరుపాళ్ళు నిజం. చివరకు డీగ్రేడ్ పిల్లాడు, అడిగిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పడంతో డి.ఇ.ఒ. కంగుతింటాడు. "గవర్నమెంటు స్కూళ్ళల్లో టీచర్ల చదువు చెప్పకూడదు. పిల్లలకు చదువు రాకూడదు. ప్రజలకు గవర్నమెంటు స్కూలన్నా, టీచర్లన్నా అసహ్యం పుట్టాలి. అందరూ తమ పిల్లల్ని ప్రయివేటు స్కూళ్ళలో చేర్పించుకోవాలి. పిల్లలు లేరన్నసాకు చూపి స్కూళ్ళను మూసివేసి ప్రాథమిక విద్యను కూడా ప్రయివేటుపరం చేయాలి. ఇదీ ప్రభుత్వ పాలసి. ఈ పాలసీ అమలు కావాలంటే ముందు టీచర్లు చదువు చెప్పకుండా అడ్డుపడాలి. అందుకే అన్ని డిపార్టుమెంటులు వారినీ టీచర్ల మీదకి ఉసిగొల్పి వారికి పనికిమాలిన పనులు అప్పగించింది. ఈ అడ్డంకులన్నీ తట్టుకుని నువ్వు పిల్లలకు బాగానే పాఠాలు చెబుతున్నావంటే ప్రభుత్వ పాలసీకి ఉద్దేశపూర్వకంగా తూట్లు పొడవడమే. ఇంత పెద్ద తప్పిదానికి పాల్పడుతున్నందుకు ఈ క్షణమే నిన్ను డిస్మిస్ చేస్తున్నాను" అని డి.ఇ.ఒ. అనే సరికి ఆ ఉపాధ్యాయుడు మొదలు నరికిన చెట్టులా కూలిపోతాడు. ప్రపంచ బ్యాంకు కనుసన్నలలో పరిపాలన సాగించే ప్రభుత్వం గుట్టును రట్టు చేసిన కథయిది.

ఎస్.వి. ప్రసాద్ రాసిన 'వ్యసనం' ఓ రైతుకథ. వర్షాల్లేక, పంటల్లేక రైతు అప్పులు పాలవుతాడు. బేంక్ లోనుతో ఊళ్ళో అప్పులు తీర్చేసి ఆత్మహత్య చేసుకోవాలనుకుంటాడు. చనిపోయే ముందు కోడిపలావు తినాలపించి హోటలుకు వెళతాడు. తృప్తిగా తింటాడు. భార్యాపిల్లలతో సహా ఆత్మహత్య చేసుకోవాలని అంతకుముందే పురుగుల మందు కొంటాడు. తిరుగు ముఖం పడుతుండగా కళ్ళు బైర్లు కమ్మి స్పృహ తప్పిపడిపోతాడు. ఇంతలో వర్షం కురుస్తుంది. లేస్తాడు. ఇక సంతోషం పట్టలేక ఆత్మహత్య ప్రయత్నాన్ని విరమించుకుని ఇంటికి వెళతాడు. ఆత్మహత్య చేసుకోవడానికి పురికొల్పిన పరిస్థితికి కారణం వర్షాభావమే. మళ్ళీ బతుకుదామని ఆశ చిగురించడానికి కారణం వర్షం కురవడం. పంట చేతికి వచ్చే వరకు నమ్మకంలేని పరిస్థితుల్లో వర్షం పడ్డంత మాత్రాన రైతు సమస్యలు సమసిపోతాయనుకోడానికి లేదు. కాని ఆ తరువాత సంగతి అనవసరం ప్రస్తుతం వర్షం పడింది. అంతే సేద్యం చేయడం రైతుకి ఓ పెద్ద వ్యసనం. లాభనష్టాలతో సంబంధంలేదు.

మరో రైతు కథ స్వామి రచించిన తెల్లదెయ్యం. తాను పండించిన పంటకు ధర నిర్ణయించడంలో తనకే మాత్రం పాత్ర లేకపోవడమనే విషయమ్మీద యింతకు మునుపు చాలా కథలు వచ్చాయి. కాని స్వామి తన అద్భుతమయిన శిల్పనైపుణ్యంతో కథను చెప్పడంవల్ల ఆద్యంతం ఆసక్తికరంగా సాగింది. విత్తులు నాటితే మొలకలెత్తే మట్టిదేహంగల మట్టి మనిషి పాతన్న కథ తెల్లదయ్యం. అతని బండి, ఎడ్లు ఇంట్లో వడ్లబస్తాలు, భార్యాపిల్లలు ఇలా ఒక దాని తరువాత ఒకటి మాయమైపోతారు. ఈ మాయకు కారణం శిలా యుగం నాటి ఒక పురాతన రైతు ప్రత్యక్షమై వచ్చి చెబుతాడు. "నీ గ్రామంలోని సంపద నీ గ్రామంలో కాకుండా మరెక్కడో చదువులై, మరెక్కడో ఉద్యోగాలై, మరెక్కడో, మరెవరికో, పరిశ్రమలూ కళలూ రాజకీయాలుగా మారుతున్నంత కాలం నీకు, నీపల్లెకు ఈ మాయరోగం తప్పదు. మేలుకో తిరగబడు" అని చెప్పి మాయమైపోతాడు. తమ భూముల్లో ఇష్టారాజ్యంగా సంచరిస్తోన్న తెల్లదెయ్యాన్ని సంహరించడం, ఆ తెల్లదెయ్యానికి తార్పుడుగాళ్ళుగా మారిన పెద్దిరెడ్డిలాంటి అనేక మందిని రైతుల్ని ఎదిరించడం కథ. రచయిత మ్యాజిక్ రియలిజం శైలిలో చెప్పడం ఇతివృత్తానికి సరిగ్గా అమరింది.

పలమనేరు బాలాజీ – సంకోచం ఆఫీసులో పని చేసే ఒక స్త్రీ కథ. స్త్రీకి సంబంధించిన సాదక బాధకాలు సాటి స్త్రీలు మాత్రమే తెలుసుకోగలుగుతారని, తండ్రి, అన్నదమ్ములు, ఆఫీసులో బాసు ఈ మగవాళ్ళంతా ఒకటేనని తన అనుభవం నుంచి తెలుసుకుంటుంది. తరచూ పొత్తికడుపులో నొప్పితో బాధపడుతూ స్నేహితుల సలహా మేరకు డాక్టరు దగ్గరకెళుతుంది. భర్తకు ఫోను చేస్తే ఎందుకు ఏమిటి? డబ్బులున్నాయా? అని కనీసం అడగనయినా అడగడు. అవసరానికి డబ్బులు కూడా స్నేహితుల నుంచే తీసుకుంటుంది. ఆఫీసులో ఎక్కువగా మేల్‌కొలీగ్స్ ముందునుంచి యూరినల్స్‌కి వెళ్ళవలసి ఉండడం, వాళ్ళు చూసే అదోరకమయిన చూపులకు సంకోచించి నీళ్ళు బాగా తగ్గించి తాగినందువల్ల ఎదురయ్యే ఆరోగ్య సంబంధమయిన సమస్య డాక్టరు సలహాతో అధిగమిస్తుంది.

వాడ్రేవు వీరలక్ష్మీదేవి – 'ఇలా ఉన్నాం' కథ కూడా స్త్రీల సమస్యలను చర్చకు పెట్టిందే. పై కథలో చెప్పుకున్నట్టు భర్తల నుంచి ఏ రకమయిన ఇబ్బందులూ పడుతున్నట్లు కనబడదు (ఒక పని మనిషి నూకాలమ్మ తప్ప) లలిత, శారద ఒక ప్రైవేటు స్కూల్లో టీచర్లు. విజయ గవర్నమెంటు స్కూల్లో టీచరు. మేనేజ్‌మెంటు వేరయినా వీళ్ళ కష్టాల్లో మాత్రం తేడాలేదు. పనిమనిషి నూకాలమ్మ. ఆమె కూతురు రామలక్ష్మి హాస్పటల్‌లో నర్సులు, పనిలేక సుఖంవల్ల కష్టాలు పడే కలవాళ్ళు. ఇలా అంత మంది గురించీ చెప్పడానికి ప్రయత్నించినందువల్ల రచయిత్రి కథ మీద పట్టుకోల్పోయారు. ఇది కథలా కాకుండా సంఘటనల సమాహారంగా మిగిలిపోయింది.

'ఆకలేమయిందమ్మా వెన్నెలా' ఒకే సామాజిక స్థాయి నుంచి వచ్చిన భార్యాభర్తల కథ. గతం మరచిపోయి పరాయీకరణ దిశగా పయనించే భార్య, గతాన్ని మరిచిపోకుండా జీవితానికి అవసరమైనదేది అనవసర మయినదేది అనివివేచించి పొదుపుగా బతకాలనుకునే భర్త. వీళ్ళిద్దరి మధ్య కాలేజీకెళ్ళే కూతురు. ఆమె తన పుట్టిన రోజునాటికి తనకెంతో యిష్టమయిన డ్రస్ కొనుక్కోవాలనుకుంటుంది. ఖరీదు రెండు వేలు. తల్లి ఓకే. కాని తండ్రి అవసరానికి, ఆడంబరానికీ మధ్య తేడాతో మసలుకోడంతోనే ఇబ్బంది. ఈ నేపథ్యంలో సుందర రాజు జ్ఞాపకాల పరంపరలో గతుకుల గతమంతా కరుణరసాత్మకంగా సాగిపోతుంది. కథలో ఎంత అవసరమో అంతే ఉంది అనవసరమయినదేదీ లేదు. రచయిత శ్యాంబాబు చక్కని శిల్పంతో కథ నడిపారు.

తెగిన బంధాలు కథలో తమ ఊరినించి పట్నం వెళ్ళిపోయిన కొండలరావు పటేల్ కూతురి పెళ్ళికి దేవయ్య (రజకుడు) లింగం (క్షురకుడు) బాలయ్య (కుమ్మరి) వెళతారు. పెళ్ళిలో వృత్తిపరంగా వీళ్ళు చేయవలసిన పనులు (వెట్టిచాకిరి) లేక రావలసిన రాబడి రానందుకు తెగ బాధపడిపోతారు. చూడండి.

"పెళ్ళిసంబరాల నుంచి ఒక్కొక్క కులం దూరమయ్యింది. పల్లకి మోసే బెస్తవాళ్ళ నుంచి తోరణాలకు నులక తాడిచ్చి డప్పులు కొట్టే మాదిగల దాకా సంబరంగా అదొక వృత్తిలాగా చేసే పనుల్లోకి వ్యాపారం, పెట్టుబడి సొచ్చుకొచ్చింది. మనిషి పుట్టుక పెండ్లి, సావుదాకా ఒక వృత్తితో మరొక వృత్తికి అల్లుకుపోయిన అవసరాలు అవకాశంగా పెట్టుబడులు పెరిగిపోతున్నాయి".

"తన చిన్నప్పటి నుండి చూసిన పెళ్ళిల్లు కొట్లాడి తెచ్చుకున్న కట్నాలు. 'సాకలోడివంటే పెద్దకొడుకువి బిడ్డా పెళ్ళికి సాకలోడు, సావుకు తలారోడు పెద్దకొడుకులు'. తాతతండ్రుల నాటి చరిత్ర, ఏళ్ళ తరబడి పెండ్లిండ్లతో మమేకమయిన జీవితాలు పెళ్ళితో అల్లుకుపోయిన కథలు అనుభవాలు గుర్తుకొచ్చాయి తీపి జ్ఞాపకాల్లాగా. కులవృత్తులు ఈనాడు కాదు ఏనాడో పోయాయి. కనీసం పెళ్ళితో ముడిపడ్డ ఒకటి రెండు పనులయినా పట్టణాల్లో ఎప్పుడో పోయినాయి. అది యిప్పుడు పల్లెల్లో కూడా" చివరకు నిరాశనిస్పృహల్తో వెనుదిరుగుతూ వారి సామగ్రినంతా దారిలో కట్టబోయే కల్యాణమండపం పునాదుల్లో పడేస్తారు. రచయిత తిరోగమన దృక్పథానికి, అవగాహనా రాహిత్యానికి నిలువెత్తు నిదర్శనం ఈ కథ. వెట్టి చేయవలసి వస్తున్నందుకు వీళ్ళు ఎక్కడా బాధపడిన సందర్భాలుగాని, ఎదురు తిరిగిన సంఘటనలుగాని కథలో కనబడవు. చిత్రమేమిటంటే పటేలు దంపతులు వీళ్ళని బంధువుల్లాగే ఆప్యాయంగా ఆదరిస్తారు. పటేలు భార్య యింత పెళ్ళి పనుల హడావుడిలోనూ ఆవిడే స్వయంగా వడ్డిస్తుంది. 'ఊరు మారినా మనసు మారని సల్లనితల్లి'. 'పెళ్లి ఎలా జరిగిందిరా బాబూ!... అంత తొందరేందిరా రేపు పోంద్రి' అని అభిమానం కురిపించే పటేలు.

పురోగమించే సమాజాన్ని వెనక్కి పట్టిలాగే లక్షణం కులానిది. ఉన్నత కులాలకు చెందిన వారు కిందికులాల వారిని అన్ని రంగాల్లోనూ అణచడానికి, చీల్చడానికి పెత్తనం చెలాయించడానికి, కులవ్యవస్థను సాధనంగా వాడుకుంటారు. వీళ్ళని ఈ గాటకు కట్టి ఉంచేది కులవృత్తి. సాంఘిక పీడన వికృత రూపమిది. ఇది ఒక ఉక్కు శృంఖల. దీన్ని తప్పనిసరై మోస్తున్నారు తప్ప ఇష్టంతో ఎవరూ చేయడంలేదు తనని వృత్తి నుంచి దూరం చేసినందుకు ఒక పురోహితుడు బాధపడడంలో అర్థముందిగాని, రజకుడు, క్షురకుడు బాధపడడంలో ఔచిత్యమేముంది? కొన్ని వృత్తులకు గౌరవాన్ని కొన్ని వృత్తులకు నీచత్వాన్ని అంటగట్టిన నిచ్చెనమెట్ల కుల వ్యవస్థ పైశాచిక స్వరూపాన్ని దాని పునాదులనూ సరిగా అర్థం చేసుకోకపోతే ఇలాంటి రచనలే పుట్టుకొస్తాయి.

ఉన్నత కులాల ఉక్కుపాదాల కింద పడి విలవిలలాడుతూ వెట్టిచాకిరి చేస్తూ సరైన ప్రతిఫలం లేక గౌరవం లేక ఎంత నికృష్టంగా బతుకుతున్నారో ఆంధ్రప్రదేశ్‌లో ఏ పల్లెలో చూసినా కంటబడుతుంది. పెళ్ళిలో చేసే చాకిరి సరే నిత్యం చేసే పనుల్లో ఏదో ఒక వంకతో రోజూ తిట్లు, చీవాట్లు కాయని రజకులు, క్షురకులు ఉన్నారంటే అంతకు మించిన వింతేమీ ఉండదు. అంచేత తెగిపోతున్నందుకు బాధపడవలసిన గౌరవ మయిన బంధాలు కావివి. ఇప్పటికయినా తెగితీరవలసిన బంధనాలు.

డా॥ సి. చెన్నకేశవ




# అక్షరనక్షత్రం శ్వేతపత్రం

కళ కళ కోసమా? ప్రజలకోసమా? దీనికి సమాధానం చక్కని కవిత్వం చెప్పగలదు. ఈ ప్రపంచపు మేలు తలవని సాహిత్యం, సార్వకాలికము గాని కవిత్వం బూడిదలో పోసిన పన్నీరు లాంటిది. సహజమైన అనుభూతి, జీవితంలోని ప్రతి అంశానికి సార్థకంగా స్పందించిన కవి హృదయం తప్పకుండా సమాజానికి మేలు చేస్తుంది. ఆధునిక కవి అడిగోపుల వెంకట రత్నంగారి 'శ్వేతపత్రం' నిస్సందేహంగా ఈ కోవకు చెందిందే.

కవి సమాజంలోని అనేక అంశాల్ని విషయ వస్తువుగా ఎన్నుకున్నాడు. 'యుద్ధోన్మాదం, ప్రస్తుత కుటుంబ వ్యవస్థలో నిరాశ్రయులైన తల్లితండ్రులు, బడి-బాల్యం, ఛాందస మతోన్మాదం, బాలకార్మిక వ్యవస్థ, పురుషాధిక్య సమాజం, విశ్వశాంతి, అనావృష్టి, అతివృష్టి, రైతుల కష్టాలు, శ్రమజీవులు, కులవివక్షత, దిక్కులేని పిచ్చితల్లి - యివి కొన్ని ఉదాహరణలు.

వెలుగు కోసం తపించే గుండెలు, సూర్యుడి కోసం, చంద్రుడి కోసం ఎదురు చూడవు. అందుకే కవి 'రగిలిన గుండె'లో

'నన్ను నేను పుటం పెట్టుకున్నాను
నన్ను నేను పోత పోసుకున్నాను
చీకటి సామ్రాజ్యమైనపుడు
సూర్యుడి కోసం ఎదురు చూడను'

అంటూ రగిలే సూర్యుడిలా మారుతాడు.

ప్రైవేటీకరణపై ఇలా ధ్వజం ఎత్తుతాడు. 'నిన్ను నువ్వు వెతుక్కుంటూ' అన్న కవితలో-

'హక్కులు మాడిపోతున్నాయి,
ఆశలు వాడిపోతున్నాయి
ఇంట్లో దీపం ఉంది, ఇంధనం ఉంది.
వెలిగించేవాడి కోసం ఎదురు చూస్తూ వుంది'

బాధతో నినదిస్తాడు. 'స్మితరాగం' అన్న కవితలో.

అల్పులు భూమికి దొర్లినా, నియంతలు నేలరాలినా 'మెట్టు'కు ఆనందం. 'తరతరాలుగా శ్రమించిన మెట్టు చితికిన శరీరానికి రంగు' రూపం కోరుతుంది' అంటూ 'మెట్టుకూ మనసుంది' అన్న కవితలో వివరించాడు. మెట్టు అనేది 'గుర్తింపు శక్తి'కి ప్రతీక.

'విశ్వదర్శనం'లో పాతపుస్తకాల గొప్పతనం, 'బదుగుభూమి'లో భూకబ్జాదారుల వలయంలో చిక్కిన బలహీనరైతులపాట్లు వివరిస్తారు.

'వందెకరాల కాన్వాసు చిత్రంలో
మూరెడు మడి, తుడిచివేత
నా చూపు యిప్పుడు
చింత నిప్పుల కొలిమిలో
సలసలకాగుతోంది.'

మార్పిజానికి చూపుడద్దం యీ కవిత.

'ఆశాజీవులు' కవితలో అతివృష్టి వలన రైతుకు కలిగే బాధలు కన్పిస్తాయి.

'ఎదురు చూడని వర్షం
ఆహ్వానం లేని అతిథై' అంటూ బాధతో స్పందిస్తాడు

'అనురాగబంధం'లో జ్వరగ్రస్తుడైన భర్తకు భార్య హస్తస్పర్శ ఊపిరిగా, టానిక్కుగా ఉంటే, 'పండుటాకు నీడలో' 'వార్ధక్యపు అగచాట్లు ఎంతకాలమీ నిర్వాసం' అంటూ అలమటిస్తాడు కవి తనుగా. మరో చోట కవి 'ఐదు నక్షత్రాల ఆస్పత్రి'లో జరిగే అన్యాయాలు, దోపిడీలపై ధ్వజమెత్తి నేటి సామాజిక రుగ్మతలను దెబ్బతీస్తాడు. అక్కడ 'జీవించినా, మరణించినా బిల్లులు సమదృష్టిలో చూస్తాయి.

రైతు కల్తీ ఎరువుల సమస్యలతో, ఆకలి చావులకు గురౌతూ, 'డొక్కలు నింపని నేలపై, రెక్కలు ఆడనిప్రాంతమది' అంటూ 'ఏరువాక మరిచిన నేల' కవితలో ధ్వనిస్తాడు. ధర్మాసుపత్రిలో పసిబిడ్డల మార్పిడి, అనైతిక గర్భస్రావాలకి సహజమైన రూపకల్పన చేస్తూ -

'కాలం కాలుజారి, నెలతప్పుతూ
నెలలు నిండని గర్భం, ప్రసవంపై ప్రసవం' అంటూ ఒక చురక వేస్తాడు.

ఒక చోట కలం శక్తిని, మరోచోట రూపాయి బిళ్ళ విచిత్ర ఉనికిని కవి వివరించడం బాగుంది. మరోచోట 'అక్షరం' అనేక రూపాల్లో సాక్షాత్కరిస్తుందని వర్ణించాడు. 'రెండు గ్లాసుల నీటిలో' కులవివక్షతను పెకలించే ప్రయత్నించేశాడు. కులాన్ని రాజకీయం చేస్తూ, మనిషికి మనిషికీ మధ్య దూరం పెంచుతూ చక్కగా నడిచే సమాజాల్ని నడ్డి విరగొట్టుతుంది రాజకీయం.

గాలికీ నీటికీ పరివ్యాప్తి
గాలిసోకకుండా
వాడ ఊరి పాదాల కింద నిర్మితం
దప్పిక అంటరానిదై
దడికట్టిన ఊరబావి" పైన చెప్పిన భావం ప్రేమ్‌చంద్ కథ 'ఠాకుర్ కా కువా'కి అద్దం పడుతుంది.

అందుకే కవి 'తస్మాత్ జాగ్రత్త!' అంటున్నారు.

'జిగిపింఛం' కవిత తెలుగు అక్షర శక్తిని నినదిస్తుంది. 'నాలుక అక్షరం దిద్దితే' ఓ మంచికవిత.

ఇది నాకు ఓ ఛాయావాద కవితలాగా, పొయిట్రీకి దగ్గరగా కనిపిస్తుంది.

వర్షాలు రాని చోట ప్రజలు మరో పట్టణానికి వలసపోవడం పరిపాటి. ఇది చాలా దయనీయమైన పరిస్థితి. చినుకురాలని క్షేత్రంలో

'కాపురం నైతిమూటై
ఊరువలసపోయి
చద్దిరాయి ఒంటరిదై
పొలిమేరలో పోలేరమ్మ కాపలా' అంటూ వలసపై కవి ఆవేదన వ్యక్తపరుస్తాడు.

ఈనాడు అందరిని భయకంపితుల్ని చేసేది యుద్ధం. యుద్ధానికి చక్కని నిర్వచనం చెబుతూ కవి 'రెండు దేశాలు మాసిపోవడం, ప్రపంచపటం మారిపోవడం' అంటూ భావచిత్రీకరణ చేశాడు. అందుకే 'శ్వేత కపోతం'లో శాంతిని రుచి చూసినవాడు యుద్ధాన్ని తలచడు' అన్నాడు.

వివాహిత స్త్రీకి స్వచ్ఛందత అవసరం. అందుకే ప్రతి స్త్రీకి "వాకిలి దాటిన ఆలోచన' వస్తుంది. ఆమె 'సర్దుకుపోవడం మరణంలో భాగం,

మరణం బతుకులో భాగం కాదు' అని మనసులో భావిస్తుంది.

సమాజంలోని పురుషాధిక్యత, స్త్రీ నిస్సహాయతను యిలా చిత్రాత్మకంగా చిత్రించాడు.

'స్త్రీ జీవనది
జీవించి, జీవించి
రూపరహితమై సముద్రాన నిమజ్జనం
సముద్రుడూ పుల్లింగమే...'

పూట గడవని బాల్యం', 'పిచ్చితల్లి శవం' గురించి కవి హృదయం స్పందిస్తుంది. కరుణారసాన్ని ద్రవిస్తుంది. కవి హృదయం మతం చిచ్చును, రాక్షసద్వేషాన్ని నిరసిస్తూ పాడుతుంది. అందుకు 'గూ కట్టని హరివిల్లు' ఉదాహరణ–

'అన్ని అంత్యక్రియలు దాటాక
మరణించిన గాయాలు
తరాల అంతరాలు దాటుకుంటూ
మానకుండానే నడుస్తుంటాయి
లౌకిక ప్రజాస్వామ్యాన
సర్వమత ఆలింగనం
ఇంకా గూడుకట్టని హరివిల్లు'.

**(శ్వేతపత్రం కవితా సంపుటి, అడిగోపుల వెంకటరత్నమ్, పేజీలు : 10, వెల : రు.40/- ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌ విశాలాంధ్ర బుక్‌హౌస్, జయంతి పబ్లికేషన్స్)**

**యాకూబ్**




# ముస్లిం కథల పెట్టె 'హర్ ఏక్ మాల్'

ఇటీవల కాలంలో ముస్లిం సాహిత్యం అనేక ముఖాలుగా విస్తరిస్తున్నది. కవిత్వం, కథ, విమర్శ రూపాల్లో తనదైన మార్గాన్ని స్థిరపరిచే క్రమంలో ఉంది. అటువంటి దశలో అలీ కవిగా మొదలైనవాడు, 'హర్ ఏక్‌మాల్' కథల సంధూఖ్‌తో కథకుడిగా ప్రత్యక్షమయ్యాడు. హర్ ఏక్ మాల్ సంకలనంలో మొదటి కథ. డిగ్రీ చదివినా కుటుంబ బాధ్యతలు మీదపడటంవల్ల అణగారిపోయిన ముస్లిం సగటు మనిషి కథ. ఈ కథలో అంతర్లీనంగా మొత్తం చిల్లర వ్యాపారస్తులు, వాళ్ళ అగచాట్లు ఏకరువు పెడుతూ, మరో వైపు 'ఇంటికి పెద్దగా' ముస్లిం కుటుంబంలో పుట్టి బాధ్యతల్ని తీర్చడం కోసం పడే రకరకాల కష్టాలు, వాటి తీరుతెన్నుల్ని కళ్ళకు కట్టినట్టుగా వివరిస్తాడు. బజారు అంగళ్ళలో మనకు కనిపించే అనేక మంది చిల్లర వ్యాపారస్తుల కష్టాలేమిటో, వాళ్ళు ఆ రోజు గడవడం కోసం తమ తమ వ్యాపారాల్లో ఎన్ని రకాల విన్యాసాలు చేయాలో వివరిస్తుంది ఈ కథ. మధ్యమధ్యలో ఉద్యోగాల కోసం చేసిన పైరవీలు, సౌదీ వెళ్ళి సంపాయించుకోవాలని ఆరాటపడే వాళ్ళు ఏజెంట్ల చేతిలో మోసపోయే వైనాలు ఈ కథలో హృద్యంగా చిత్రికరించాడు. "దరిద్రపు దుడ్డు పోయిల ఏసినా కాలదు" అన్నట్లుండే కథ. ఈ కథ రమారమి సగటు అట్టడుగు మనిషి కథ.

కోడి పిల్లలు చనిపోతే పెంట మీద పారేయటాన్ని కూడా ఇష్టపడని చిన్నారి ఇర్ఫాన్ గుంతతవ్వి భూమిలో ఇంటి వాకిట్లో పాతిపెట్టిన హృద్యమైన 'కోడిపిల్లలు మూడు' కథగా మలిచాడు అలీ. "కోడిపిల్లలపై ఉన్న ప్రేమానురాగాలు, మానవత్వపునాదులు నిండుగా పరిమళించాలని, మతవిద్వేషాలు తమ పిల్లల హృదంతరాలలో చొరబడకూడదని దువా చేస్తూనే వుంది. నాదు మనసుతో, చలించిపోయిన అమ్మాజాన్, "తమ పిల్లల గుండెల్లో హిమాలయ పర్వతాలంత ఆశయాలను చూసుకుని మురిసిపోతుండు అబ్బాజాన్" –ఈ కథ ముస్లిం సమాజంలో తొంభై శాతం పైగా ఎలా ఆలోచిస్తారో, ఏ విలువలు, ఏ సహజీవన సౌందర్యాన్ని ఆశిస్తున్నారో చెప్పే కథ.

ప్రభుత్వాలు పాన్ మసాలాల మీద, గుట్కాల మీద, సారా మీదా నిషేధాలు విధించడం, యధేచ్ఛగా అవి మాత్రం మార్కెట్లో అమ్మడం, మధ్యమధ్యలో పాన్ షాపుల మీద రైడింగ్ జరగడం వం విషయాలు చర్చకు పెట్టాడు 'పాన్ డబ్బావాలా' కథలో. రోడ్లు వెడ చేసే కార్యక్రమాల్లో ఎంత మంది నిరాధారులవుతారో ఏకరువు పెట్టా కథాకథనం విషయకంగా ఈ కథలో సంభాషణల ద్వారా, ఆయా పాత్ర తీరుతెన్నుల ద్వారా విషయాన్ని వివరించడంలో నేర్పు కనబరిచాడు.

ముస్లింలలో పెళ్ళితంతును ఆడంబరంగా మార్చి, పెళ్ళి చేయలేనంత భారంగా మార్చివేసిన ముస్లింలు పెడమార్గాన్ని ఎండగట్టా 'హిరిస్' కథలో. మహమ్మద్ ప్రవక్త పెళ్ళికి ఇచ్చిన నిర్వచనం. పె ఖర్చు విషయంలో ఆయన ప్రయోగాత్మకంగా చూపిన మార్గా అనుసరించకుండా సాగుతున్న నేటి ముస్లిం సమాజాన్ని తప్పుపట్టా అలీ. నిఖాఖర్చు, దావత్ ఖర్చు సామాన్య ముస్లింకు అందుబా లేనంతగా మార్చడాన్ని గర్హించాడు. పెళ్ళి పేరుతో ఇచ్చే కట్నకానుక మౌల్వీల ఉపన్యాసాల్లో ఉండే డొల్లతనం ముస్లిం సమాజాన్ని ఎ పక్కదారి పట్టిస్తున్నాయో చెబుతాడు ఈ కథలో.

'దఫన్', 'హిరిస్' కథల్లో భాష గురించి ప్రత్యేకం చెప్పుకోవాలి. తెలుగులో కథను నడిపిస్తూనే వాడుక ఉర్దూను ఎక్కువ ఉపయోగించి ముస్లిం జీవన వాతావరణాన్ని చూపే ప్రయత్నం కథల్లో చేసినట్లు కనిపిస్తుంది. అలాగని మిగతా కథల్లో ఈ పద్ధతి లే కాదు. కాని, ఈ కథల్లో ఉద్దేశ్యపూర్వకంగా ఆ పని చేశాడనిపిస్తుం ఒక సలహా ఏమిటంటే, ఉర్దూ పదాల వాడుక ఆయా సందర్భా జరిగినప్పుడు పాఠకుల సౌలభ్యం కోసం అర్థాలు కథల చివర్లో బాగుంటుందేమో! ముస్లిం జీవనాన్ని కళ్ళకు కట్టినట్టు చూపించ అనే ప్రయోజనం దీని వెనుక ఉన్న, ఆప్రయోజనం నెరవేరడం జాగ్రత్తలు పాటించడం కూడా అవసరమే కదా!

'ముసీబత్', 'రిశైదా+లత్‌కే' కథలు తనకు ఎదురైన అనుభవా అక్షర రూపం ఇవ్వడానికి చేసిన ప్రయత్నం. అందువల్ల ఈ కథలు విషయం దగ్గర ఆగక, ఒకదాని వెంట ఒకటిగా సంఘటన చెప్పుకుంటూ సాగుతుంటాయి. కథారూపంగా పరివర్తన చెందకుండ ఆత్మకథనాత్మకంగా సాగినట్లు అనిపిస్తాయి. మానవ సంబంధా ప్రధానంగా ఇందులో చర్చకు వస్తాయి. ఆ రకంగా జీవితాల్లోని దైన్య అసహాయత ముప్పిరిగొని, జాలి, దయ కలుగుతాయి ఈ కథ చదువుతున్నప్పుడు.

'నయా ఖదమ్–నయా సోంచ్'లో కథకుడుగా తన ప్రాపం దృక్పథం గురించి పాత్రల ద్వారా పరిచయం చేశాడు అలీ, ముస్లి అవిద్య, వెనుకబాటుతనం కారణాలు చెబుతూ, దాన్ని పరిష్కరించేంద ఏం చేయాలో కూడా మార్గం చూపాడు.

అలీ కథకుడుగా ఇది తొలి ప్రయత్నం. కాబట్టి కథాక శిల్పం గురించి ఇంకా తెలుసుకోదగినవి ఉన్నాయి. ఆ లోపం అక్కడక్క కొన్ని కథల్లో స్పష్టంగా బయటపడింది. భవిష్యత్‌లో ఆ లో సరిచూసుకుంటే సరిపోతుంది. అట్టడుగు ముస్లిం జీవితాల్ని ఇందుల

ది కథలు విభిన్న రూపాల్లో దర్శనం కలిగిస్తాయి. ఆ దర్శనం లుగుతున్నప్పుడు ప్రధాన పాత్రల వెనుక అలీ కదలాడుతున్నట్టు నిపిస్తుంది. అతని స్వరమే వినిపిస్తున్నట్లనిపిస్తుంది. అతను కథను చెప్పే ద్ధతి టెక్నిక్‌లో భాగం ఇది.

అలీ 'హర్ ఏక్ మాల్' సంకలనం ముస్లిం సాహిత్యధోరణిలో తనదైన స్థానాన్ని తప్పక పదిలపరుచుకుంటుంది.

**(హర్ ఏక్‌మాల్, కతల సంధుఖ్, రచయిత : అలీ, వెల : రు.60/-, ప్రచురణ : డిసెంబర్ 2003, ప్రతుల కొరకు : ప్రజాశక్తి, విశాలాంధ్ర, జఖమ్ పబ్లికేషన్ - 5-9-68, మన్యం చెలక, నల్గొండ-508 001)**

---

**అనిశెట్టి రజిత**



# 'జీవనలిపి'ని ప్రకటించే నానీలు

మన జీవితాలకున్న లిపులన్నీ చిందరవందరై కలగలిసి, ంగులు వెలిసి ఒక అయోమయ లిపిలోకి చేరిపోయిన విషాద సందర్భం ది. ఇప్పుడు కావాల్సింది స్పష్టమైన బలమైన బతుకు లిపి. మనసుకు క్కలు తొడిగి స్వేచ్ఛనిచ్చే అందమైన భావాల లిపి. అట్లాంటి "లిపి"ని శ్వాసంగా అందిస్తుంది ఎస్. రఘు "జీవనలిపి" నానీలుగా... నన్నీమున్నీ దాలు కూర్పుగా...

అల్పాక్షరాల్లో అనల్పార్థాలను పొదిగేవే హైకూ, నానీ, మినీల క్రియలు. వచన కవిత్వం కారుమబ్బుల్లా కమ్మేసినా వెండి తీగల్లా ండి అంచుల్లా ఆ కారు మబ్బుల్ని వెల్లుల అంచులతో అలంకరిస్తూ రిమబ్బులు రాల్చే వెండి పువ్వుల్లా రాలే భావస్ఫోరమైన నన్నీ కవితలు నీలు. 365 నానీల 'జీవనలిపి'ని అందంగా హృద్యంగా అరచేతిలో తీపి చేదుల పచ్చడిలా వడ్డిస్తుంది ఈ పుస్తకం.

"సముద్రం
ఎన్‌సైక్లోపీడియా!
అలలు
గాలికి కదిలే అనంతపుటలు"

ఈ నానీల్లో సముద్రపు లోతుల్ని తాకే భావాలూ... అలలుగా ఎగిరొచ్చే భావాలూ కోకొల్లలుగా ఉన్నాయి. సముద్ర గంభీర ఘోషలతో ఆకాశాన్ని తాకాలని ఎగిసే అలల్లాంటి 'జీవనలిపి' ఈ గ్రంథం.

"జీవితానికి
పీఠిక ఉండదు
దుఃఖానికీ అంతే
ముగింపేలేదు"

ఇది జీవిత సత్యం... అందరికీ అనునిత్యం ఎదురయ్యే జీవిత యదార్థం... ముందు మాటలూ, వెనకమాటలూ, పీఠికలూ, వరుసక్రమ శీర్షికలూ లేనిదే జీవితం.

రఘు 'జీవనలిపి' క్లుప్తతతో సంక్షిప్తతతో విస్ఫోటించే భావాల సంగమం. ఈ 'జీవనలిపి' మనిషి జీవిత సుడిగుండం. సమాజం, మనిషి కథలను మోస్తున్నదీ 122 పేజీల గ్రంథం. 365 నానీలు జీవన కదలికలు. సాహితీ అభిమానులు దీన్ని చదివి చర్చించాల్సిన అవసరం ఉంది.

(కాపీల కొరకు : విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ, దిశ పుస్తక కేంద్రాలు, వెల :రు. 50/-, పేజీలు : 122)

---

# రిగిపోయిన కాంతిఖడ్గం కదిలి

**ూరేపల్లి మనోహర్**

మ్ మొరేస్! డామ్ మొరేస్!!
ంత అన్యాయం చేశావయ్యా

కాశమే సరిహద్దుగా ఆశయాల దిశాంతాల దాకా
కలం ప్రయాణం యింతలోనే ముగిస్తావని
లలో కూడా ఊహించలేదు
గుండె ఎంత జాలిలేని దయ్యా!
కోసం కాకపోతే మాకోసం కనీసం అవసరం చికిత్స
దీ మరచిపోయావా?
ంత అన్యాయం చేశావయ్యా!
మ్ మొరేస్!! డామ్ మొరేస్!!
పంచ రుగ్మతల్ని
తోన్మాద క్షుద్రమౌఢ్య దురాగతాల్ని
గ్రరాజ్యాల కుట్ర కుహనా సిద్ధాంతాల్ని
ండించే కాంతి ఖడ్గధారివి నువ్వు



నువ్వే అదృశ్యమై పోతే
ఇక్కడ మాకు ధైర్యం ఏది?
ఇక్కడ మాకు అండ ఏది?
ఇక్కడ మాకు గుండెబలం ఏది?
ఎంత అన్యాయం చేశావయ్యా!
డామ్ మొరేస్! డామ్ మొరేస్!!

గుజరాత్ దుర్మార్గమతోన్మాద పాశవికరాక్షస
నరమేధాన్ని
రాక్షస కౄరకర్కశ హింసాహవాన్ని
మానవత్వపు రక్తపు మడుగుల్లో
అభాగ్యుల నిస్సహాయ వేతనా తరంగాల్ని
ఖండిస్తూ, ప్రకటిస్తూ, నువ్వు కాలం మీద చేసిన సంతకం
సిరాయింకా ఆరకముందే
కొవ్వొత్తి సుడిగాలిలోలా
కనిపించని తీరాలకు
వెళ్ళిపోయావా?
డామ్ మొరేస్! డామ్ మొరేస్
ఎంత అన్యాయం చేశావయ్యా!

డా॥ వెన్నవరం ఈదారెడ్డి



## కర్ర ఎల్లారెడ్డి అదాలత్ కథలు

కర్ర ఎల్లారెడ్డి పాత్రికేయవృత్తిని చేబట్టి స్థిరపడ్డ కథకుడు. అదాలత్ కథలు అన్న పేరుతో ఎల్లారెడ్డి రెండో కథా సంపుటిని రచించి ప్రచురించారు.

సమాజంలోని అనేక విషయాలను తెలుపుతూ వ్యక్తుల యొక్క సామాజిక చైతన్యాన్ని పెంచటానికి కథాసాహిత్యం నిర్వహిస్తున్న పాత్ర మిగతా సాహిత్య ప్రక్రియలకన్నా ముఖ్యమైనది, ప్రధానమైనది కూడా. కర్రా ఎల్లారెడ్డి న్యాయవాదిగా ఉంటూ న్యాయస్థానాల్లో యిచ్చే తీర్పుల విశ్లేషణను సామాన్యులకు అర్థమయ్యే రీతిలో చెప్పారు. రావిశాస్త్రి లాగా కథన శిల్పంతో ఆయన కథలను చెప్పలేదు. అర్థం సులభంగా స్ఫురించే పత్రికాభాషను ఈ కథల్లో ఉపయోగించారు. సాధారణంగా పత్రికల్లో అసలు వార్తేమిటో మొదలు చెప్పి కథనాన్ని తర్వాత చెప్తారు. పేపరు కొన్న పాఠకుడు మొత్తం వార్తా కథనాన్ని చదువుకున్నా మొదలు శీర్షిక ద్వారా, తర్వాత విషయాన్ని తెలిపే నాలుగైదు మొదటి వాక్యాలు చదువుతాడు. ఇంకా ఓపికా, తీరికా వుంటే మిగతా కథనాన్ని చదువుతాడు. ఇందులో ఏ ఒక్కటి చదివినా విషయం పాఠకునికి తెలిసేలా చేయడమే జర్నలిస్టిక్ శిల్పం. ఇలాంటి శిల్పాన్ని రచయిత ఈ కథలలో చూపెట్టాడు. కథలా వుంటుంది వాస్తవం.

సాధారణంగా కథలో కల్పితం వుంటుంది. కాని ఎల్లారెడ్డి కథలు అసలు సిసలైన కోర్టు గాథలు. వ్యక్తులు న్యాయం కొరకు కోర్టు చుట్టూ తిరిగిన వ్యథలు. బోనులో తాము పడ్డ బాధలు, వకీళ్ళ ప్రశ్నలు ఇలాంటి పద్మవ్యూహంలో న్యాయాన్ని అన్వేషించి పట్టుకోవడం జరుగుతుంది. మరి ఇదంతా కూడా కథే అని చెప్పుకోవాలి. మనం పడ్డ బాధలు చెప్పుకోవడానికి అదంతా ఓ కథ, చెబితే పూర్తి అయ్యేదిగాదు, అని చెప్తుంటాం. అలాంటి కథలు ఎల్లారెడ్డి కథలు. కథలు స్పష్టంగా అర్థమై న్యాయ విజ్ఞానాన్ని సులభశైలిలో పాఠకునికి అందిస్తాయి. లోకంలో ఎన్నో ఘోరాలు జరుగుతున్నాయి. న్యాయం కొరకు పోరాడలేక జీవన పోరాటం నుండి తప్పుకొంటున్నారు. మనకు కోర్టుకు పోవాలన్నా పోలీస్‌స్టేషన్‌కు పోవాలన్నా, వాని చుట్టూ తిరగాలన్నా వెనుక ముందాడతాం.

ఈ కథలు చదివేటప్పుడు అక్కడక్కడ అవినీతి, అక్రమమార్గాల ద్వారా న్యాయం పెడదారినట్లు అనిపించినా, కథా సూత్రం మాత్రం న్యాయాన్ని వెతుక్కుంటే పోతుంది. న్యాయం అందించటం కోర్టుల బాధ్యత, న్యాయం పొందడం పౌరుల విధి అని మనకు తెలిసివస్తుంది.

"కోర్టుకు హాజరయ్యేవాది, ప్రతివాదులు, నిందితులు తమ న్యాయవాదులు తరచుగా అడిగే ప్రశ్నలకు ఈ కథలో జవాబులున్నాయి. మన రాష్ట్ర హైకోర్టు, సుప్రీంకోర్టు, ఇటీవల ప్రజా ప్రాముఖ్యంగల అనేక తీర్పులను వెలువరించాయి. వాటిలో కొన్నింటిని కథల రూపంలో అందించాను. సుమారు 10 నుంచి 20 పేజీల వరకు ఉండే ఇంగ్లీషు తీర్పులను, రెండు, మూడు పేజీల్లో క్లుప్తంగా అర్థం చెడకుండా న్యాయసూత్రాలను తేలికగా అర్థమయ్యే రీతిలో అందించాను. న్యాయ వ్యవస్థ మీద ఉన్న మమకారంతో, న్యాయస్థానాల మీద ప్రజలకు మరింత నమ్మకాన్ని కల్గించే సదుద్దేశంతో ఈ అదాలత్ కథలను తెలుగు పాఠకులకు అందిస్తున్నాను. న్యాయ వ్యవస్థలోని కొన్ని లోపాలను ఈ కథలో ఎత్తి చూపటం జరిగింది. అంత మాత్రాన జడ్జీలు, న్యాయవాదులు, కోర్టు సిబ్బంది పోలీసులు అందరూ ఇంతేనా? అని నిరాశపడనవసరంలేదు" అన్న ముందు మాటలు న్యాయ వ్యవస్థ మీద గౌరవాన్ని పెంచేవిగా ఉన్నవి. ఇందులో 51 కథలున్నాయి. చివర్లో కెప్టెన్ డ్రైఫస్" విదేశీ నవలికను సంక్షిప్తంగా అనువదించారు. అనువాదం సరళంగా అర్థమయ్యే రీతిలో సాగింది. కథల చివర్లో ప్రసిద్ధ న్యాయమూర్తుల కొటేషన్లు స్ఫూర్తినిచ్చే విధంగా ఉన్నవి. అవి ఆయా విషయాలను నిర్వచనాల వలే అర్థమౌతున్నవి. తర్వాత శీర్షికల పేర్లు కూడా ఆకర్షణీయంగా కథావస్తును సూచించే విధంగా అర్థవంతంగా ఉన్నాయి. "కెప్టెన్ డ్రైఫస్" నవల అనువాదం సహజంగా సాగింది. ఈ పుస్తకం ప్రతి పౌరుడు చదవాల్సిన పుస్తకం. **(అదాలత్ కథలు, కర్ర ఎల్లారెడ్డి, పేజీలు : 201, వెల : రు.90)**

---

# మదపిచ్చి

దిలావర్



నువ్వొక యుద్ధం మానియాక్‌వి
యుద్ధం నీ పురుష చిహ్నం!
అంతర్యుద్ధాల స్వయంతృప్తితో
మొదలైన నీ కామదాహం,
కండపుష్టితో నదురుగా కనబడ్డ దేశాన్నల్లా
యుద్ధంతో చెరిస్తేగాని తీరదు
మెక్సికోనో, జపానో, ఇరానో...
నువ్వుకలగనే విధ్వంసమంతా ఒకటే.
గన్నుపట్టిన తల్లుల వీపుల మీద
స్తన్యం కోసం తల్లడిల్లే పిల్లలను
మృత్యుగహ్వారాల్లోకి విసిరేసి,
నువ్వుస్తనాల కోసం ఎగబడటం
నీ తీవ్ర కామపైశాచికత్వానికి ఉదాహరణ కాదా?
అమాయక ఆఫ్ఘనిస్తాన్ను
పబ్లిగ్గా వివస్త్రను చేసి
ఒళ్ళంతా బాంబులతో వాతలు పెట్టటం
నీ శాడిస్టు మెంటాలిటీకి నిదర్శనం కాదా?
రోగాలతో, రొష్టులతో,
ఎడారులు పరచుకున్న ముఖాలతో
మృత్యుశయ్యమీదున్న ఐదు లక్షల లేత ప్రాణాలను
మందులు అందకుండా, గొంతు పిసికి చంపటం
నీ కసాయితనానికి పరాకాష్ఠ కాదా?
నేల మాళిగలో బంధింపబడ్డ నాథుని ముందే
ఇరాక్‌ను ఎంత అమానుషంగా
మానభంగం చేశావ్!
నీ విధ్వంస రచనలో
సర్వం కోల్పోయిన ఈ ప్రపంచం నుండి
ఇంకా ఏం ఆశిస్తున్నావ్...?

# జాతులు... కథలు గీతాలు... గతాలు

గౌరి రామ్‌నారాయణ్

అసోసియేషన్ ఆఫ్ కామన్‌వెల్త్ లిటరేచర్ అండ్ లాంగ్వేజ్ స్టడీస్( అక్లాక్స్) ప్రపంచ ప్రసిద్ధులైన మేధావులను వక్తలుగా ఆహ్వానించి "జాతి-భావన: మారుతున్న కామన్వెల్త్' అన్న అంశంపై ఒక మహాసభ నిర్వహించితే, బహుశా మీరు అది ఒక అస్పష్టమైన అర్థం గాని అందుబాటులో వుండని వ్యవహారమని అనుకోవచ్చు. కాని హైదరాబాద్ తాజ్‌రెసిడెన్సీలో ఆగష్టు 4 నుంచి 9 వరకూ జరిగిన ఆక్లాక్స్ సాహిత్య సమ్మేళనం అలాటి వూహాలు తప్పని నిరూపించడం సంతోషకరమైన విషయం.

మొదటి సారిగా ఈ మహాసభ వలసానంతర వ్యవస్థపై ప్రపంచంలోనే ప్రఖ్యాతిగాంచిన ముగ్గురు నిష్ణాతులను ఒక వేదికపై చేర్చింది. గాయత్రి చక్రవర్తి స్పైక్, హోమీబాబా, ఐజాజ్ అహ్మద్‌లతో పాటు హెలెన్ టిఫిన్, బిల్ ఆస్రాఫ్టలను. (వీరిద్దరూ ఎంపైర్ రైట్స్ బ్యాక్ అనే సాధికారిక కథనాన్ని రచించిన సహ రచయితలు) కూడా రప్పించింది. రాల్ఫ్ క్రేనే, రాజేశ్వరీ సుందర్‌రాజన్, హరీష్ త్రివేదీ, విక్టర్ చాంగ్‌లు పాల్గొనడంకూడా చర్చల బరువు పెంచింది. ఇండియా నుంచి అట్లాంటిక్ మహాసముద్రం ఇరు తీరాల నుంచి వచ్చిన పరిశోధనాపరులకు అదొక అరుదైన అనుభవం. తాము చదివిన, బోధించిన విమర్శకులను ముఖాముఖి ప్రశ్నించడం, సంభాషణ, సంవాదం జరపడం ఒక అనుభవం.

ప్లీనరీ సమావేశంలో హెలెన్ టిఫిన్ (క్వీన్స్‌ల్యాండ్ యూనివర్సిటీ) పత్రం "సమాజం పునరూహ" జీవజాలం మధ్య సంబంధాన్ని చర్చించింది. ఇతర జీవజాలం మనుగడపై మానవ అస్తిత్వం ఆధారపడివుందనే నిరంతర వాదనను వివరించారు. మిగిలిన జీవులన్నిటి పైనా మానవాధిక్యత, జంతువుల హక్కులు, జంతువులు మనుషులుగా పరివర్తన చెందే అవకాశం తదితర అంశాలనం ప్రస్తావించారు.



సంపన్న సాహితి? : (ఎడమ నుంచి) మార్కెండ్ పరంజపే, హోషియాంగ్ మర్చంట్, కేకీ దనుర్వాలా, జాన్‌కెంప్, డయానా బ్రిడ్జి, సతేంద్ర నందన్, లక్ష్మీశ్రీ బెనర్జీ

యాన్ మార్టెల్ 'లైఫ్ ఆఫ్ పీ' నవలనుంచి విస్తారంగా ఉదహరించాడు. సముద్రంలో దారి తప్పిపోయిన కుర్రవాడు తన క్రూర స్నేహితుడైన పులితో కలిసే బతకాల్సి రావడం ఇందులో ఇతివృత్తం. చివరి రోజున కెనడాకు చెందిన నల్లజాతి రచయిత ఆస్టిన్ క్లార్క్ తన నవల 'పోలిష్డ్ హో' ను ఉదహరిస్తూ బానిస కథనం తీరు తెన్నులు వినిపించారు. విశ్వసనీయత కోసం దాన్ని ఉత్తమపురుషలో రచించారు. అందులో నాయిక మేరీ మెటిల్డా తన స్వంత భూభాగాన్ని, భాషను సృష్టించుకుంటుంది. ఆ విధంగా వలస పూర్వ వ్యవస్థ స్వరూపం పట్టుకోవడానికి ప్రయత్నిస్తుంది. చివరలో ఆమెలో ఆగ్రహం పెల్లుబుకుతుంది. అణగారిన ప్రజలు ఉత్తమ పురుషలోనే రాయాలని క్లార్క్ అభిప్రాయపడ్డారు. కెనడాకే చెందిన నల్లజాతి రచయిత డ్ర్యూ హేడన్ టేలర్ హాస్య స్ఫోరకమైన తన నాటకం వినిపిస్తూ ఆలోచనాభరితమైన ఆహ్లాద పూర్వక యువత్వాన్ని ప్రతిష్టించారు.

### మూడు ప్రసంగాలు

ముగ్గురు ప్రధానోపన్యాసకులు వేర్వేరు పద్ధతుల్లో ఆశించిన ఫలితాలందించారు. 'నేషన్ అండ్ నారేషన్', 'ద లొకేషన్ ఆఫ్ కల్చర్' పుస్తకాల రచయిత హోమీ బాబా వలసానంతర వ్యవస్థను పునర్నిర్వచించే ప్రక్రియలో ఘటికులుగా పేరు పొందినవారు. అయితే ఆయన తన సిద్ధాంతీకరణలలో యూరోపియన్ నిర్మాణ వాదానంతర సూత్రాలనే చెబుతుంటారనే విమర్శ కూడా వుంది. ఆయన ప్రసంగంలో మనుగడ అనే అంశాన్ని నొక్కి చెప్పారు. అయితే ఈ మనుగడ ఒక యాంత్రిక భౌతిక వాద దృక్పథం. ఆశాదృష్టి అనేది మూలం. ఆశ (శ్వాసించడం) మనకు శ్వాసతో పాటు ఆ పదం తాలూకూ భారాన్ని కూడా గుర్తు చేస్తుంది. అది ఒక విధమైన సానుకూల శక్తిగా పని చేస్తుంది. అది వూహాజనిత భావన కాదు అని ఆయన ప్రకటించారు. మానవులు అణచివేతను, అవమానాలను, వెలిని, కక్ష సాధింపును, చారిత్రికంగా గాయపరచడాన్ని తట్టుకునే శక్తినిచ్చింది అదే అని చెప్పారు. దార్శనికమైన కళ, సాహిత్యం అనేవి న్యాయం, స్వేచ్ఛ సాధించే సాధనాలని వివరించారు.



సంపూర్ణ ఆధునిక సమాజమైన భారతదేశం ఇన్ని భాషలలో మాట్లాడగలగడంలోని సాహసం చూసి నేను సంభ్రమాశ్చర్య చకితుడనైపోతాను అన్నారు ఐజాజ్ ఆహ్మద్. వర్గాలు, జాతులు, సాహిత్యం- సిద్ధాంతాలు అనే ఆయన పత్రం బాగా విమర్శలను

# భాగ్యవిహీనులకు బలమిచ్చిన కంఠం : ఐజాజ్ అహ్మద్



సంపన్న అదృష్టవంతుల మహాసభల్లో భాగ్యవిహీనుల తరఫున బలంగా ఒక కంఠం వినిపించడం ఎంతో ఊరటనిచ్చింది. ఆ కంఠం ఐజాజ్ అహ్మద్‌ది. ఆయన ప్రసంగం కామన్‌వెల్త్ సాహిత్య సదస్సును అతలాకుతలం చేసింది. ప్రసంగం ముగిశాక కూడా చాలాసేపటి దాకా కరతాళధ్వనులు మార్మోగుతూనే వున్నాయి. చర్చలు, ఉపచర్చలు కొనసాగాయి. అక్కడి ప్రదర్శనలో ముత్యాలహారాలు కొనేవాళ్లు కొంతసేపు ఆగిపోయారు. పుస్తకాల షాపుల్లో ఎయిజాజ్ అహ్మద్ రచనల కోసం వాకబు చేశారు. వైవిధ్యాల మధ్య ప్రజలు సయోధ్యను సాధిస్తారనడం, 'జాతి' కొత్తగా "ప్రపంచీకరణ వ్యతిరేక శక్తి"గా మారుతుందనడం ఎంతో స్ఫూర్తి నిచ్చింది. 'దేశ విభజన' సమయంలో మత మారణకాండ కొనసాగినప్పటికీ లౌకికవాదాన్ని కాపాడుకోవడం, దేశాన్ని 'జాతుల యూనియన్'గా గుర్తించడం, ఫెడరల్ రాజ్యం(సమాఖ్య)గా రూపొందడం, భారతదేశం ప్రజాస్వామ్యదేశంగా నిలదొక్కుకోవడం.. ఇదంతా అపూర్వమని, ప్రజా విజయమని చెప్పిన ఎయిజాజ్ అహ్మద్ మాటలు అందర్నీ వెంటాడాయి.

అనేక భాషలు, అనేక జాతులు, విభిన్న విశ్వాసాలు గల సంస్కృతి గల ఏకైక దేశం బహుశా ప్రపంచంలో భారతదేశం మాత్రమే అన్నారు ఎయిజాజ్ అహ్మద్. "ఇక్కడి సంస్కృతభాష ఎవరి మాతృభాషా కాదు. అందువల్లే అది ప్రజల భాష కాలేదు. స్త్రీలు, దళితులు ఈ భాషకు దూరంగా వుంచబడ్డారు. పై తరగతుల పితృభాషగా సంస్కృతం వుండిపోయింది. ఆధునిక పారిశ్రామిక జాతీయతను చూస్తే కంపరమెత్తుతుంది. పౌరుల ఆధారంగా మనగలుగుతున్న 'సెక్యులర్ జాతీయత' ఒకటి అన్ని అవరోధాల్నీ అధిగమిస్తూ నిలబడగలుగుతోంది. మతపరమైన జాతీయత ఎప్పుడూ ప్రమాదకారిగా ఎదురవుతూ వుంది. భారతదేశం జాతుల సమ్మేళనం. అది ఒక జాతిగా వుండజాలదు. అలాగే అనివార్యమైన వైవిధ్యం ఎవరికీ ప్రమాదకారి కాదు. నెహ్రూ నాయకత్వంలో వలసవాదం తర్వాత 'సెక్యులర్ ప్రజాస్వామిక సమాజం' మనుగడలోకి వచ్చింది. 'మార్కెట్ ఎకానమీ' తన అవసరాల కోసం జాతి వైవిధ్యాన్ని నాశనం చేస్తూ వుంది. రెండు వేల స్థానికభాషల్ని, జాతుల్ని నాశనం చేసి అమెరికన్ ఇంగ్లీషు ఏర్పడింది. ఆంగ్లభాష ఆధిపత్యాన్ని కాదంటూ భారతదేశంలో అన్ని దేశీయభాషలు విలసిల్లుతున్నందుకు గర్వంగా వుంది. వేగంగా అభివృద్ధి చెందుతున్న ఆంగ్లభాష ఉన్నత తరగతుల భాషగా, అనుసంధాన భాషగా, మార్కెట్ ఎకానమీ అవసరంగా, ఒక వ్యూహం ప్రకారంగా అభివృద్ధి చెందుతూ వున్నది. 'విభిన్నజాతుల యూనియన్'గా భారతదేశం ఏర్పడి 'ఫెడరల్' స్వభావాన్ని పొందడం, 'లౌకికవాదాన్ని' కాపాడుకోవడం స్వాతంత్ర్యానంతర ప్రగతికి మూలాలు" అని ఎయిజాజ్ అహ్మద్ స్ఫూర్తిదాయక ప్రసంగం చేశారు. ప్రపంచీకరణయుగంలో జాతీయవాదానికి మనుగడ లేదనే ఐరోపావాదాలను ఆయన బలంగా తిరస్కరించారు. జాతి మత కులభేదాలు భారతదేశంలో ఒక సవాలు వంటివని, ఉదారవాదం- తిరోగమనవాదం- కమ్యూనిస్టుల మధ్య ముక్కోణపు పోటీ కొనసాగుతుందని చెబుతూ చేదు నిజాల్ని కూడా ఆయన వెల్లడించారు.

-జ్వాలాముఖి

తెచ్చింది(ఐజాజ్ ప్రసంగానికి బాక్సు చూడండి) ఆ పత్రం ఎడ్వర్డ్ సయిద్,సల్మాన్ రష్దీలతో సహా అనేకమంది ప్రసిద్ధులపై విమర్శలు చేసింది. అదే పత్రంలో ఆయన జాతీయ వాదానికి గల ప్రగతిశీల తిరోగామి కోణాలు రెంటినీ చూపించింది. సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కోవడానికి, జాతీయ నిర్మాణాన్ని బహుళత్వాన్ని పెంపొందించడానికి అది దోహదపడినప్పటికీ, ఆ క్రమం దోపిడీ దారుకు దోచుకోబడేవారికి మధ్య ఘర్షణాత్మక ఐక్యతకు కూడా కారణమైంది. గిరిజన అధికార కూటములను సృష్టించింది. మైనారిటీలకు పౌర హక్కులను కుదించింది (పశ్చిమాసియా లేదా బాల్కన్స్ ఇందుకు దారుణమైన ఉదాహరణలు) అయినా ఇండియా అనేక భాషలతోనే హాయిగా సర్దుకుంది. దానికి జాతీయ భాష లేదా హిందూత్వ వంటి వాటికోసం పాకులాడవలసిన అవసరం లేకపోయింది అని ఐజాజ్ చెప్పారు. ఇందులో కూడా మనుగడకు సంబంధించిన సందేశం లేదా?

వూహాత్మక శృంగారం తప్పు/ భార్య తల్లి పవిత్రమైనవారు/ ముస్లిం శత్రువు/ ఆయుధాలే కావాలి అంటూ గాయత్రి చక్రవర్తి స్పైక్ మార్మోగే కంఠం వినిపించారు. బెంగాలీలో తన వచనం వినిపించారు. తన బాల్యంలో కలకత్తా వీధులలో వినిపించిన జాతీయ గీతం ఆ విధంగా గుర్తుచేశారు. ఆమె రాడికల్ సిద్ధాంతవేత్త. సామ్రాజ్యవాద సిద్ధాంతాలపై సాహసోపేతమైన రీతిలో మిశ్రమ భావ జాలాన్ని, పునర్వ్యాఖ్యానాలను చేస్తుంటారు. జాకస్ డెరీడా, మహాశ్వేతాదేవి వంటి వారి రచనలను ఉటంకిస్తూ వ్యక్తిగత స్మృతులు, సామాజిక సాంస్కృతిక ధోరణులు, సైద్ధాంతిక బోధనలు, భాషాంతర నిర్మాణానంతర అనుభవాలు వాటిలో ఎలా పెనవేసుకున్నది చెప్పారు. మారుమూల ప్రాంతాలలో గిరిజన స్త్రీలతో తన సంభాషణల ఆధారంగా ఈ వివరణ చేశారు.



గిరిష్ కర్నాడ్ పత్రాల సమర్పణలో శక్తివంతమైన పాత్ర పోషించారు. కవులు హోషియాంగ్ మర్చంట్, సునీతి నామ్ జోషి(ఇండియా ఇంగ్లాండ్) సతేంద్ర నందన్ (ఆస్ట్రేలియా) దయానా బ్రిడ్జి(న్యూజిలాండ్)లను ఇందులో చెప్పుకోవాలి. జీన్ అర్సనాయగం(శ్రీలంక) ఉపన్యాసాలు లేనప్పుడు యువ రచయితలను శ్రద్ధగా ఆలకిస్తూ వచ్చారు. వారిని అభినందిస్తూ సూచనలు చేస్తూ అభిమానం చూరగొన్నారు. హైదరాబాద్ యూనివర్సిటీలో విద్యార్థులతో ముఖాముఖీలో శశి దేశ్‌పాండే బాగా ఆకట్టుకున్నారు.

ఆషామాషీ సాహసం, చిలిపితనం మేళవించిన విక్రం సేత్ అటు పండితులకు ఇటు అభిమానులకు కూడా అత్యంత ఇష్టుడైన వ్యక్తిగా మారాడు. (బాక్సు చూడండి) అన్ని మూల లక్షణాలు పోయాక ఏం చేస్తారన్న ప్రశ్నకు ఆయన తనదైన చిరునవ్వుతో జవాబిచ్చారు. తనను ఎల్లప్పుడూ వూహాశక్తి నడిపించుగాక అన్నాడు. పదాల క్రీడకు పెట్టిందిపేరైన సేత్ రచన అంటే 'ఎల్యూజివ్, ఇల్యూజివ్, అల్యూజివ్" (తప్పించుకోవడం,

# అక్షరం విలువ గొప్పది : విక్రమ్‌సేర్



అక్షరం విలువ గొప్పది. అది రాజ్యాలను తారుమారు చేయగల శక్తి గలది...అని చెప్పే విక్రమ్‌సేర్ రచనలు చదివిస్తాయి. ఆసక్తిని పెంచుతాయి. వైవిధ్యం, యాత్రానుభవాలు ఆయన రచనల్లో ప్రధాన ఆకర్షణలు. మీనాక్షిముఖర్జీ ప్రశ్నలకు సమాధానమిస్తూ ఆయన తన స్వానుభవాల్ని, స్వీయరచనల్ని విపులంగా పేర్కొన్నారు. "సూటబుల్ బాయ్" (తగినవరుడు) ఆయన సుప్రసిద్ధ (1349 పేజీల) ఆంగ్ల నవల. న్యూయార్క్ జీవితం, భారతదేశపు అలవాట్లు, జ్ఞాపకాలు, సంప్రదాయాలు కలగలిసిన అంతర్జాతీయ జీవన చిత్రపటం చర్చల్లో ప్రస్తావనకు వచ్చింది. భౌగోళిక పరిధుల్ని దాటిన సృజనాత్మక వ్యాసంగంలో తాను నిమగ్నుడనయ్యానని, తనపై పుష్కిన్, ఆర్కే నారాయణ్‌ల ప్రభావాలున్నాయని ఆయన చెప్పారు. రచయిత బాధ్యత ముఖ్యమైనదని, జాతీయతను అనుభవ పరిధిలో చూడాలని వివరించారు.

"రచనలు చేయాల్సిన సందర్భంలో మీరే ప్రక్రియకు ప్రాధాన్యతనిస్తారు? కవిత్వానికా? కాల్పనిక వచన రచనకా? (ఫిక్షన్‌కా)?".. ప్రేక్షకులకు ప్రశ్నలడిగే అవకాశమిచ్చినప్పుడు నేనీ ప్రశ్న వేశాను. కొంత ఆలోచించి "ఫిక్షన్ రాస్తున్నాను. కవిత్వం ఇష్టం" అన్నారు. "మీలోని సృజనశీలి అయిన కవికి ఫిక్షన్ రచన వల్ల గ్రహణం పట్టడం లేదా?" అన్న మరో ప్రశ్నకు "ఫిక్షన్ లాభసాటి. మీరు చెప్పినట్టు కవిత నా అంతరంగం. మీరు చెప్పిన రాఖీ కవిత నాకు చాలా ఇష్టం" అన్నారు. ఆయన ఏది చెప్పినా ప్రేక్షకులు కరతాళధ్వనులతో స్వాగతించారు. అతడికంత ఆకర్షణ సమకూరడానికి గల కారణం కవిత్వాత్మక నవల...."గోల్డెన్ గేట్", ప్రఖ్యాత నవల "సూటబుల్‌బాయ్". దేశాదేశాల్లో యాత్రలు చేయడం, అనుభవాల్ని సంపుటీకరించి నవలల్లో సందర్భానుకూలంగా జొప్పించడం వల్ల ఆయా రచనలు 'యాత్రా సాహితి'గా దర్శనమిస్తాయి. అమెరికా, చైనా, భారతదేశాల విస్తృత పర్యటనలు ఆయన నవలలకు ప్రాణం పోశాయి. అంతర్జాతీయత నిచ్చాయి. అందువల్లే ఆయనంటే చాలా ఆకర్షణ.

కలకత్తాలోని కలిగిన కుటుంబంలో జన్మించిన విక్రమ్‌సేర్ ఆక్స్‌ఫర్డ్‌లో చదువుకున్నారు. పొలిటిక్స్ ఫిలాసఫీ ఎకనామిక్స్ (పిపిఇ)లో పట్టభద్రులయ్యారు. వ్యాపార కుటుంబంలో పుట్టినా ఆయన దృష్టి కవిత్వం వైపు మళ్లింది. చైనా నాన్సింగ్ విశ్వవిద్యాలయం ఫెలోషిప్ కారణంగా చైనా జీవితం గురించి విపులంగా రాశారు. తల్లి జడ్జి, తండ్రి షూ కంపెనీ ఎగ్జిక్యూటివ్.

ఇంగ్లీషు రచనల్లో 'స్వేచ్ఛ' ఏ నైతిక పరిమితులను పాటించకపోవడం వల్ల అనైతికత ప్రధాన ఆకర్షణ అవుతుంది సంపన్న సమాజంలో. అందగాడు, అభివ్యక్తి వున్నవాడు, అభిప్రాయాల్లో ఎదుగుతున్న వాడు వైవిధ్యాల మధ్య వికాసం చెందుతున్న వాడు, ఏ మేరకు దేశానికీ, ప్రజలకు దక్కుతాడనేది శేషప్రశ్న. ముల్క్‌రాజ్ ఆనంద్‌లా ఎదిగితే సమాజం హర్షిస్తుంది. చింతన పెరగాల్సివుంది. పుష్కిన్ ప్రభావం, ఆర్కే నారాయణ్ అభివ్యక్తి విక్రమ్‌సేర్‌ను జారిపోకుండా చూసే అవకాశం లేకపోలేదు. **-జ్వాలాముఖి**

సృష్టించడం, దొరక్కుండా వ్యాఖ్యానించడం) అని నిర్వచించారు. అయితే ఈ సంభాషణ రచయిత మరీ లోతులకు వెళ్లి తనను మరచిపోయి తనను తాను వెల్లడించుకునేలా చేయలేకపోయింది.

రచయితలు తమ రచనలు వినిపిస్తే వినడం ఎప్పుడూ గొప్పగానే వుంటుంది. ఈ విషయంలో కూడా విక్రం సేర్ తన "బీస్టలీ టేల్స్'తో ముందున్నాడు. శబ్ద దృష్టి,లయ, సంగీతం అన్ని పాటిస్తూ చదివాడు. నిశితమైన ప్రతీకలతోస్ఫూర్తివంతమైన వ్యక్తీకరణతో, సునీతీ నామ్‌జోషి కూడా తనదైన ముద్ర వేశారు. కేకీ దనుర్వాలా, ఫిరోజ్ జుస్సావాలా, జాన్ కెంప్, హోషన్ మర్చంట్, సతేంద్ర నందన్, మార్కండ్ పరంజపేలు కూడా తమ వచనాలు వినిపించారు. దయానా బ్రిడ్జి రాసిన గొంతుకతోనే వినిపించారు.

చాలాపుస్తక ఆవిష్కరణలు ప్రత్యేకత కలిగించాయి. శశిదేశ్‌పాండే "మువింగ్ ఆన్" (పెంగ్విన్) విడుదలలో సుహృద్భావం తొణికిస లాడింది. శ్రీలంక కు చెందిన జీన్ అర్సంగ నాయకం క్లుప్తంగా పరిచయం చేస్తూ దిగ్భ్రాంతికరమైన సన్నివేశాలకు సజీవత సంతరింపచేశారు. డచ్‌లో కలహాలతో అతలా కుతలమైన ఎమెరాల్డ్ దీవుల ఒక మైనారిటీ తెగనుంచి వచ్చిన ఆమె తమిళున్ని పెళ్లి చేసుకున్నారు. ఆమె ద్విముఖ దృష్టి ఒక చెరిగిపోని ముద్రవేసింది.

వాసిఫెరీ సంపాదకురాలు దేబీ డీన్‌తో సుశీలా నాస్తా సంభాషణ జరిపారు. శ్వేతేతర రచయితలపై వచ్చేమార్కెట్ ఒత్తిళ్లను దృష్టిలో పెట్టుకుని స్కిజోఫ్రీనియా ను సృజనాత్మకంగా ఉపయోగించుకోవచ్చునని ఆమె అన్నారు. మీరు నల్లజాతివారైతే కష్టాలుపడతారు. వారికి మీ కష్టాలపై కన్నా నల్లతనం పైన ఎక్కువ దృష్టి అని అన్నారు.ఆమె ఆధునిక దేశాలకు చెందని జాతుల సంస్కృతుల సాహిత్యాన్ని ప్రచురించేందుకు ఇరవై ఏళ్లుగా కృషి చేస్తున్నారు.

**విమర్శలు - వివాదాలు**

ఈ మహాసభలో అసమ్మతి స్వరాలు కూడా వినిపించకపోలేదు. కొంతమంది స్థానికులుమరికొంత మంది బయటనుంచి వచ్చిన వారు కూడా ఈ ఫైవ్ స్టార్ వాతావరణాన్ని, అట్టహాసాన్ని, భారీ ఫీజులను, అధికార కూటములుగా ఏర్పడటాన్ని, పత్రాలలో ప్రామాణికత లోపించడాన్ని విమర్శించారు. హైదరాబాద్‌లో జరుగుతున్నా మహాసభలో తెలుగు, ఉర్దూ భాషలకు చోటు కల్పించక పోవడాన్ని ఎత్తిచూపారు. (కన్నడ తమిళ భాషలపై సభలు జరిగాయి) విద్యార్థులకు సాధారణ ప్రజానీకానికి అవకాశం లేదన్నది ప్రధాన విమర్శగా వుంది. అయితే ఇతరులు మాత్రం ఈ కార్యక్రమం బాగానే వుంది అన్నారు. పరిశీలనాత్మకమైన ఇలాటి సభలు నాటకాలు సినిమా ఉత్సవాల వలె జరపలేమని అభిప్రాయపడ్డారు. ఈ సభలలో సమర్పించిన పత్రాలు చాలా ఉన్నత స్థాయిలోవున్నాయని విదేశాల నుంచి వచ్చిన మేధావులు పలువురు అన్నారు. సిద్ధాంతవేత్తలు సాధారణ మానవులుగా సంచరించడం విశేషమన్నారు.

(ఫ్రంట్‌లైన్ వ్యాసానికి సంక్షిప్తీకరణ)

❖

# "కుమ్ము"




సాయంకాలం ఐదు గంటలు.
నడికుడిలో 'యింటర్‌సిటీ' దిగి
రోడ్డు మీదికి వచ్చి దాచేపల్లి
సెంటర్‌కి వచ్చాడు.
ఊరికెళ్ళే బస్సు వుందో?
వెళ్ళిపోయిందో? కనుక్కుందామని
రోడ్డుకవతల జెండా చెట్టు సెంటర్
వైపు నాలుగడుగులు వేశాడు.
యరపతినేని శంకర్రావు.

నల్లూరి రుక్మిణి

ఆ చెట్టు ఎప్పటిదో? దాని మాను నలుగురు వాటేసుకున్నాచాలదు. చెట్టు చుట్టూ అరుగులు కట్టి దారిప్రయాణీకులకు చారెడు నీడ కోసం ఆసరాగా వుంటోంది.

ఆ అరుగుల మీద పదీ పదిహేనుమంది దాకా వున్నారు. వయసుపైబడినవారు చుట్టలు తాగుతూ లోకం పోకడ మీద నిట్టూర్పులు విడుస్తున్నారు. మధ్య వయసువాళ్ళు రాబోయే ఎలక్షన్లలో సీటు ఎవరికిస్తారో... ఏ పార్టీ గెలుస్తుందోనని... పందాలు విసురుకుంటూ చర్చలు చేస్తున్నారు. ఆడవాళ్ళు, మిగిలిన వాళ్ళ లోకాభిరామాయణం వింటూ మధ్యమధ్యలో రోడ్డు వైపు చూపులు సారిస్తున్నారు బస్సుకోసం.

శంకర్రావు వాళ్ళ దగ్గరకు వెళ్ళాడు.

తమ ఊరి వాళ్ళ కోసం అటూ ఇటూ కలియచూసి  ఎవరూలేరే! అనుకున్నాడు. బస్సు టైమ్ కాలేదేమో లేకుంటే ఎవరో ఒకరు రాకుండా వుంటారా?' అనుకుంటూనే, అక్కడున్న వాళ్ళను "బొమ్మరాజుపల్లె" బస్సింకా రాలేదా? అనడిగాడు.

"ఏమో నబ్బయ్యా... ఏళ అయిపోయింది... అదింకా రాలా... దాని కోసమే జూస్తున్నాం" అన్నాడొక పెద్దాయన.

నాలుగ్గంటలు రైల్లో కూచ్చుని వచ్చిన శంకర్రావుకు అప్పటికే విసుగ్గా వుంది. ఎండ చిటపటలాడతా వుంది. సిటీలో వున్నప్పుడేమో ఇంటికెప్పుడెప్పుడు పోదామా అన్న ద్యాసే... తీరా వస్తే ఇదిగో ఈ తంతు... అసలు తననే చదువు అబ్బక పోయినా బావుండేది... వున్న కాడికి సర్దుకుని అట్లానే బతికేవాడిని..." యాష్టగా అనుకున్నాడు.

శంకర్రావు అష్టకష్టాలుపడి ఎట్లానో డిగ్రీ అయిందనిపించాడు. అదయినా దాచేపల్లిలో కాలేజీ వుండబట్టే. పొద్దున్నే యింట్లో యింతతిని వెళ్ళివచ్చాడు. ఫీజు తప్ప మరే ఖర్చు లేదు. అప్పటికి ఊళ్ళో శంకర్రావు చదువేగొప్ప.

చదువు అయిపోతానే... ఉద్యోగం మీద ఆశతో పేపరులో పడిందానికల్లా అప్లయ్ చేస్తూ వచ్చాడు. కట్టిన బ్యాంకు డిడిలు దండగయ్యాయి తప్ప ఉద్యోగం వచ్చింది లేదు.

ఖాళీగా వుండి, ఊళ్ళో తోచక రోజూ దాచేపల్లి రావడం... సాయంత్రం దాకా కాలక్షేపం చెయ్యడం.. పొద్దుగూకే వేళకి ఇల్లుచేరడం... ఇలా రెండేళ్ళు గడిచిపోయాయి.

అనుకోని రీతిలో చిన్నపాటి ఉద్యోగం వచ్చి సిటీకి ళ్ళిపోయాడు. ఈ నాలుగేళ్ళగా కిందా మీదగానే వుంది తప్పు... స్థిరమైన వితమేదీ?... అట్లా అనుకుంటుంటే తల్లి గుర్తుకొచ్చింది.

తనను ఎలాగైనా ఊరి నుండి పంపించి వెయ్యాలని ఎంత ాపత్రయ పడిందీ? ఆమె తపనే తనను హైదరాబాదుకు దారి యించిందనుకున్నాడు.

"ఏరా! శంకరూ..." రెండిటికి చెడ్డ రేవడిలాగా" అటు న్నపనైనా చూసుకోపోతివి.. పెద్దోడి లాగా అరకన్నాపట్టకపోతివి! ట్లారాని? సతాయించేది. పని లేకుండా తిరుగుతుంటే మనుషులు మైపోతారోనని ఆమె భయం.

ఆ రోజూ! ఎప్పటిలానే మొదలుపెట్టింది... ఎందుకో ాటయ్యకు కోపం వచ్చి... "వాడి వొళ్ళో వున్నయ్యంటే ఉజ్జోగాలు... ం చెయ్యమంటావ్... ఎప్పుడూ సతాయింపేనా?... ఉరిబెట్టు ాల్సిందే ఇక."

ఆ మాటతో శంకర్రావు కంచం దగ్గర నుండి లేచాడు.

తల్లి కళ్ళనీళ్ళు బెట్టుకుంటూ, "వాడు నాకేమన్నా కానివాడయ్యా ళ్ళ ముందు వుండాలని నాకుండదూ?... నాది మాత్రం కన్న కడుపు దూ! వాడికి ఏదో దారి ఏర్పడాలనేగానీ నా బాధ..." ంది.

"అయితే మాత్రం... పొద్దాక అంటుంటే ాడికి కష్టం వెయ్యదూ! మన చేతల్లో ఏం వుందీ? ంతా వాడి దయ..."

వీడిట్లా దాచేపల్లికి తోచక రోజూ పోయి స్తుంటే... ఖాళీగా వుండి ఎటు దారి తీస్తాడోనని యంగా వుంది. ఊళ్ళన్నీ ఎట్లున్నాయో చూస్తున్నాంగా? దో పని మీద ఊరుదాటిపోతే బతకనన్నా బతుకుతాడని శతప్ప.



తల్లితండ్రుల ఆందోళన శంకర్రావుకు ఎంతో ష్టం కలిగించింది. 'తను మాత్రం ఏం చెయ్యగలదూ? మకు పలుకుబడి గలిగిన రాజకీయ నాయకుల ండా? లేక డబ్బు పెట్టుబడి పెట్టి ఉద్యోగం కొనుక్కునే స్తోమతా? ముందీ?, చదువు సంధ్యలు లేని మధ్యతరగతి రైతాంగం తమ ంధుజనమంతా! తనకు దారి ఏర్పడటం మాటలా ఇదంతా వాళ్ళకెట్లా ర్థమవుతుందీ!...

కానీ ఊళ్ళల్లో పరిస్థితులూ అట్లానే వున్నాయి... ఏవో గొడవలు పల్లోపల.. .వీరారెడ్డి చేలో మిరపకాయలు దొంగతనం చేశాడని ాలోడి'ని కొడితే... పల్లెజనం వీరారెడ్డి మీదకు ఎట్లా వచ్చారు ోట్లాటకు? అసలు అలా మాట్లాడటం ఎన్నడైనా చూశారా? ఊళ్ళల్లో.

కానీ ఏమైందీ?... జనాన్ని కూడేశాడని 'శౌరీ'ని... లేవకుండా తగ్గొట్టారు. ఒకప్పుడు ముఠా తగాదాలు.. బాంబులూ.. కత్తులూ! ప్పుడేమో అన్నల గొడవ. బాగుపడే దారిలేదుకదా?... ఎక్కడ ఈ ొడవల్లో ఇరుక్కుంటానోనని అమ్మభయం.

తల్లి సతాయింపులోని ఆంతర్యం... శంకర్రావు మనసు ర్థమైంది. తన తల్లికి చదువులేదు... సున్నితంగా చెప్పే భాష తెలియదు... ానీ మాటల వెనుక మమకారాలెక్కడికి పోతాయనుకున్నాడు.

మర్నాడు దాచేపల్లి వెళ్ళినపుడు తన స్నేహితుడిని ాధేయపడినట్టుగానే అడిగాడు "మీ బావనడిగి చిన్నపాటి ఉద్యోగం ూపించి పెట్టరా... కాలు నిలబడితే చాలు... ఆ తరువాత నా తిప్పలేవో నేను పడతాను"

అట్లా మరో రెండు నెలల్లో హైదరాబాద్‌కు మారిపోయాడు.

సిటీకి వెళ్ళిన ఈ నాలుగేళ్ళల్లో ఊరికి వెళ్ళింది తక్కువేననుకున్నాడు... కానీ ఈ ఎలక్షన్లు... హడావిడి, మాదినపాడు ఎలా వుందో.. ఎవరికి ఏ పార్టీకి ఓట్లు వెయ్యాలనుకుంటున్నారో?.. ఊరంతా ఎంత సందడిగా వుందో? అనుకుంటూ? ఊరిమీద గాలిమళ్ళినట్లయి శంకర్రావు ఆత్రంగా బయలుదేరాడు.

'అలా అనుకుంటున్నానేగానీ... ఎలక్షన్లు సజావుగా జరిగేనా? తమ ప్రాంతపు వార్తలు చూస్తుంటే... ఎప్పటికప్పుడు ఎంత ఆందోళన వుంది?' తను లేడనేగానీ... ఊరు మనుషులూ ఎక్కడికి పోతారూ? రానురానూ ఎవో ఆరాటాలు ఎక్కువవుతున్నాయేగానీ.'

'దీనికి తోడు రైతాంగంలో ఎంత నిస్పృహ... వానల్లేకా... పంటలు పండక... వ్యవసాయాలు మూలబడిపోయి... ఎంత దిగజారిపోయింది రైతాంగం... ఎనిమిది ఎకరాల భూమని పేరేగానీ... ఇంట్లో ఎలా వుంది పరిస్థితి'... దిగులుగా అనుకున్నాడు.

ఇలా అనుకోగానే తను పని చేస్తున్న "రియల్ ఎస్టేటు" కంపెనీ గుర్తుకొచ్చింది. 'ఈ రెండేళ్ళల్లో రియల్ ఎస్టేటు వ్యాపారంలో ఎంత లాభాలు పోగు చేసుకున్నారు. సిటీకి దూరంగా నలభైమైళ్ళ దూరంతో కూడా రిసార్ట్స్ పేరుతో ఎగబడి కొంటున్నారే? వాటి కోసం వచ్చే వాళ్ళతో తిరుగుతుంటే వీళ్ళకింత డబ్బెక్కడిదోననిపించేది కాదూ? ఎక్కడెక్కడి పొలాలూ స్థలాలైపోతున్నాయి.'

కానీ ఈ రెండు మూడేళ్ళగా ఊళ్ళన్నీ ఎలా వున్నాయీ?... చేసే పనిలేకా... ఏం చెయ్యాలో తెలియక... 'పులి-మేక' ఆడుకుంటూ అరుగుల మీద కూర్చుంటున్న రైతులు కళ్ళల్లో కదిలారు.

'అందనీ పొందనీ రెండు రకాలైన జీవితాలు... డబ్బు ఎక్కువయి రాళ్ళపాలు చేసేవాడొకడు. ఇక్కడ అమ్ముదామన్నా కొనేవాడేలేక మరొకరు... కొనేమాట అట్లుంచు... అందరూ అమ్మేవాళ్ళగానే మారిపొయ్యారే?'

శంకర్రావు ఆలోచనలను చెదరగొడుతూ డబడబలాడుతూ బస్సు సెంటరుకు వచ్చింది. పార్టులన్నీ వూడిపోతుందేమోనన్నట్టుగా వూగివూగి ఆగింది. క్లీనరు హడావిడిగా మాదినపాడు, చింతపల్లిపాడు, కొత్తపాలెం, బొమ్మరాజుపల్లె... ఇదే ఆఖరి ట్రిప్పు... రావాల... రావాల, అని అదే పనిగా బస్సు డోరు పక్కగా దబదబా బాదసాగాడు.

అక్కడక్కడా చెదురు మదురుగా కూర్చున్న వాళ్ళంతా బిలబిలమంటూ... మూటలూ... గోతాలతో బస్సు మీదకు ఎగబడ్డారు. దూరంగా నించోనున్న శంకర్రావు బస్సును చూస్తూ, తను చదువుకునేటప్పటి నుండీ ఇదే బస్సు... ఈ ఐదారేళ్ళలో మరిన్ని పార్టులు పోయినయ్యేగానీ... దాని మొహాన రూపాయి పెట్టి బాగు చేయించినట్టులేదు! ఓనరు' అనుకున్నాడు.

అప్పటిదాకా ఎదురు చూడ్డంలోని విసుగుదల... పొద్దుగూకుతోందనే ఆత్రుతతో' ఎప్పుడు కదులుద్దీ... పొద్దుపోయింది... ఇళ్ళకు పోవాల'నంటూ తొందర చెయ్యసాగారు ప్రయాణికులు.

ఎవరెన్ని మొత్తుకున్నా... బస్సు నిండేదాకా వెనక్కీ ముందుకీ వూగిందే కానీ... కదలలేదు. శంకర్రావు బస్సు కదిలేదాకా కిందేనించుని.. ఆఖరున ఎక్కి ఫుట్ బోర్డు మీద నించున్నాడు... దాని మీద పది మంది దాకా వుండటంతో ఎక్కడ పట్టుజారిపోతానన్నట్టు వుంది.

అయితే హైదరాబాద్ సిటీ బస్సుల అనుభవం ఇక్కడ పనికి వచ్చిందనుకున్నాడు.

ఇంతలో ఓ మూలమలుపు వచ్చి బండిని సర్రున కోశాదు డ్రైవరు. జనమంతా కుప్పలు పడ్డారు.

"ఓరి నీయమ్మ కడుపుకాలా! మమ్మల్ని కాళ్ళూ చేతులూ విరగ్గొట్టేటట్టు వున్నావే! ఏందా కొయ్యటం? మా మీద కచ్చగాని పట్టావా?" ఆడవాళ్ళంతా అరుపులకు లేచారు.

"ఏం చేద్దాం?.. ఇదేమన్నా అయిదరాబాదా? చంద్రబాబు రోడ్లు వెయ్యడానికి?... అక్కడికిపోతే యిమానంలో పోయినట్టు కడుపులో చల్లకదలకుండా కూర్చోవచ్చు. మరిదేమో ముప్టి 'బొమ్మరాజుపల్లె' రూటు. మారెడ్డిగారేమో... ఎంతవస్తే అంతకాడికి జేబులో వేసుకోవడమేగానీ... బస్సుకు రిపేరు దండగని ఆయనగారి ఆలోచన... దానికి తోడు ఈ రాళ్ళూ... గుంతలూ... ఏం చెయ్యాల?.

డ్రైవరు మాటలు వింటుంటే శంకర్రావుకు... నక్లెస్‌రోడ్డు, ఫ్లైఓవర్లు, బైపాస్‌లు కళ్ళ ముందు కదిలాయి. రోడ్లన్నీ నిగనిగలాడుతూ కోడేతాచులల్లే ఎట్లా మెరిసిపోతుంటాయి. జర్రునజారిపోయేట్టు మధ్యాహ్నపు ఎండలో ఎంత తళతళ లాడుతుంటాయి. అందుకే దేశం వెలిగిపోతుందన్నారు.

పగలు ఎండకు మెరిసిపోతే.. రాత్రుళ్ళ 'నియాన్‌లైట్లతో, సిలికాన్ చిప్స్‌తో వెలిగిపోతుంది... నిజమే సిటీలో 'దేశం' వెలిగిపోతోంది. సత్యం... ఇన్ఫోసిస్... ఐటి మాదాపూర్ అంతా ఎంత ఎత్తు ఎదిగిందీ? ఎంత దూరానికి వెలిగిపోతూ కనబడుతుందో?



'అక్కడే వున్నప్పుడు అది నిజమేననిపించేది. తన వూరూ... రోడ్లూ... ఏనాడూ గుర్తుకొచ్చినట్లు లేవు"

'నిజంగానే డ్రైవరు ఎంతబాగా అన్నాడూ!.. ఇదేమన్న చంద్రమండలమా? బోడి మాదిన పాదు! ఎవడికి పట్టిందీ? వీటి గురించీ?

శంకర్రావు ఆలోచనలను తుంచుతూ బస్సు పెద్ద గుంటలోపడి ఒక్క కుదుపు కుదిపింది. అయ్యో! అయ్యో! నడుములు విరిగిపోయినయ్... నీదుంపార... ఏం తోలడం..." ఓ ముసలమ్మ అరిచింది.

"ఏం ముసలిదానా నడుములు విరిగిపోతన్నయనుకుంటే... ఇంట్లో కూర్చోక... ఏం పెత్తనాలు చెయ్యడానికి టౌనుకొచ్చా!"... అన్నారెవరో నవ్వుతా.

"ఏందయ్యా! ముసలిదాన్ని పట్టుకుని... మాలావు... ఈ ఎత్తిపడెయ్యడాలకు బస్సు దిగేటప్పటికి చుక్కలు కనబడతున్నాయి".. ముసలమ్మకు సపోర్టుగా ఆడాళ్ళు అందుకున్నారు.

అట్టా అట్టా మాటా మాటా పుంజుకుని.... కాసేపు బస్సులో గందరగోళంగా తయారయింది.

ఈ గోలవింటూ తమ ఊరు వచ్చిందన్నది గమనించనేలేదు శంకర్రావు "మాదినపాదు, మాదినపాదు దిగండి...దిగండి" అరిచాడు క్లీనరు.

అతనితోపాటు మరో ఇద్దరు దిగారు స్టేజీలో.

వీళ్ళెప్పుడు ఎక్కారబ్బా! గమనించనే లేదనుకున్నాడు.

బస్సు దిగిన వాళ్ళు శంకర్రావును ఎగాదిగా చూశారు. "ఏం మావ్రా! నేనేనే! గుర్తు పట్టలా?" అన్నాడు పలకరింపుగా.

ఆ మాటకు తేరిపార జూసి "నువ్వా! కోటయ్య కొడుకువి కదూ అన్నారు. నీ సూటూ బూటూ చూసి ఎవరో అనుకుంటున్నాం."

'జీనుపాంటు, ఇన్‌షర్టు... పైగా బూట్లు.. ఊళ్ళో వాళ్ళకి విచిత్రంగానే వుంటుంది మరి... కానీ తను చేసే ఉద్యోగంవల్ల అలవాటపోయి... షర్టు తొడుక్కోగానే పాంటులో దోపెయ్యడం అలవాటైపోయింది. జీతమెంతున్నా... పనెట్లా వున్నా... వచ్చిన కస్టమర్లకు దర్జాగా కనబడాలయ్యే...' లోనలొటారం, పైనపటారపు బతుకులు'

ఈ బ్యాగు, ఈ వేషం అచ్చం ఏ మెడికల్ రిప్రజెంటేటివోననుకుంటారు మరి... 'పల్లెటూళ్ళో క్షణంలో పట్టిస్తుంది మన వేషం...' అనుకున్నాడు.

మెల్లిగా కనబడ్డవాళ్ళను పలకరిస్తూ ఇంటికి వచ్చాడు.

అన్నమ్మ దూరం నుండి చూసింది, గానీ పట్టించుకోలేదు.. తీరా దగ్గరకు వచ్చాక తలెత్తి చూసి "ఒరే నువ్వంటరా శంకరా! ఎవరోననుకున్నా" అంటూ,

"అయినా చెప్పాపెట్టాకుండా దిగావేందిరా" అంది.

ఇంటికొస్తా చెప్పే, దేండే... నువ్వేమన్నా ఊరువదిలి పెట్టిపోయేదానివా? మహా అయితే ఏ పొలానికో లేకపోతే 'కొష్టం' కాడికో.. అంతేగా? అన్నాడు.

ఇంటి కొచ్చిన వాడిని... 'అట్లా అంటుందేమిటి?'.. ఓ క్షణం చివుక్కుమంది.

అప్పటికి చీకటి పడింది. ఇళ్ళల్లో దీపాలు వెలిగించారు.

"కాసిని నీళ్ళు తోడవే... చిరాగ్గా వుంది... స్నానం చెయ్యాల... ఒళ్ళంతా ఒక్కటే దుమ్ము"...అన్నాడు.

'నీళ్ళా?.. ఇప్పుడే గాబు కడిగి పెట్టారా! అన్నాయింకా 'కొష్టం' కాడి నుండి రాలేదు. బోరింగు నీళ్ళు కొట్టిపొయ్యాల".

ఆ మాట వినగానే శంకర్రావుకు నీరసమొచ్చింది. నీళ్ళకోసమిప్పుడు బోరింగు దగ్గరకు పోయి... కొట్టుకోవాలాని?

బట్టలు మార్చుకుని... లుంగీలోకి మారి... కడవలో కాసిని నీళ్ళుంటే... కాళ్ళూ చేతులు కడుక్కున్నాడు. ఈ లోపు తల్లి మంచం వాల్చి, దుప్పటి పరిచి... మంచినీళ్ళు యిచ్చింది.

గ్లాసందుకుని.. రెండు గుక్కలు తాగాడో, లేదో.. మొహం చిట్లించుకున్నాడు... దప్పిక తీరకుండానే గ్లాసు తిరిగి యిచ్చేశాడు.

చెమటలు కారి, వొళ్ళంతా జిడ్డెక్కిపోయింది. ఫ్యాను కోసం అలవాటుగా తలపైకెత్తి చూశాడు... ఫ్యానే లేదు. అబ్బా! అనుకుని నిట్టూర్చాడు.

పుట్టి పెరిగిన వూరిమీద మమకారంతో రావడమేగానీ... వచ్చిన దగ్గర నుండి... ఎప్పుడు వెళ్ళిపోదామా! అనే అన్పిస్తుందాయే! ఏం వూళ్ళో! ఏం బతుకులో! ఎప్పటికి మారేనూ? దిగులుపడ్డాడు శంకర్రావు.

పదిగంటలకు రూమ్‌లో నుండి బయటపడితే... రోజూ ఎన్నిమైళ్ళు తిరుగుతాడు తను... ఒక్కోసారి వందమైళ్ళు కూడా, కస్టమర్లకు 'సైట్స్' చూపించడానికి పోవాల్సి వుంటుంది. అయినా ఏ చికాకూ కలగదు.

ఆఫీసులో వున్నా... హాయిగా ఫ్యానుగాలి... ఎన్నడూ కరెంటే పోదు... ఇక్కడా? వొళ్ళంతా దుమ్ము... చెమటలు కారుకుంటూ,

ననుకుంటూ... చేతులు వొంటి కానకుండా దూరంగా మంచం పట్టెలు పట్టుకున్నాడు.

శంకర్రావుకు అప్పుడసలు మాట్లాడే 'మూడే' లేకుండా పోయింది. ఇంటి కెళ్ళగానే హాయిగా నీళ్ళు పోసుకుందామనుకున్నారు. ఏవీ నీళ్ళు? ఈపాటికి సిటీలో అయితేనా? బట్టలు విప్పి పంపుకింద కూర్చున్నామంటే ప్రాణం లేచివస్తుంది. కావాల్సినన్ని నీళ్ళు... అందులో తానున్న అపార్టుమెంటులో నీళ్ళకు కరువేలేదు'. హాయిగా మంజీరా వాటరు టాంకులకు ఎక్కిస్తారు.

మంచినీళ్ళు ఎంత తియ్యగా వుంటాయి. ఇక్కడ తాగటానికి కూడా ఈ బోరింగు నీళ్ళే... ఎంత ఫ్లోరైడ్ వుందో? 'అమ్మో' అనుకున్నాడు. పుట్టిందగ్గర నుండి తాగింది ఆ నీళ్ళే... అయినా వేడి చేస్తుందేమోనని సందేహపడ్డాడు. తన వూరును కొత్తగా.. బయటి వ్యక్తిలాగా చూస్తున్నట్టుగా అయ్యాడు, మొదటిసారిగా! శంకర్రావు.

ఉత్సాహంతా నీరుగారిపోయినట్లయింది.

చివరికి లుంగీపైకి ఎగ్గట్టి... మర్చిపోయిన నీళ్ళు కావిడికోసం వెదికాడు, రెండు కావిళ్ళు తెద్దామని.

శంకర్రావు లేవడం చూసి, "ఒరే చిన్నోడా? అంత దూరం నుండి పడి వచ్చావ్... నువ్వేం తెస్తావ్? వద్దులే! పెద్దోడు వస్తాడని చూస్తున్నా!" అంది తల్లి.

అయినా రెండుకడవలు కొట్టుకొస్తానని బోరింగు దగ్గరకు పోయాడు. ఎంత సేపో కొడితేగాని నిండలేదు బుంగలు. శంకర్రావుకు గూళ్ళు నొప్పిపట్టినట్టయ్యాయి.

భుజాలు సవరదీసుకుంటున్న కొడుకుని చూస్తూ! "ఊళ్ళల్లో బావులు ఎండిపోయి ఎన్నేళ్ళయ్యిందోరా!... ఇప్పుడందరూ ఈ బోరింగు నీళ్ళే... ఆ బోరింగుల్లోనూ కొన్నిట్లో నీళ్ళున్నాయి... కొన్నిట్లో అవీ లేవు. ఏం చేస్తాం... అయ్యే కొట్టీకొట్టీ చేతులరిగిపోతున్నాయి" అది అన్నమ్మ.



తల్లి మాటలు... తను చూస్తున్నవి... శంకర్రావులో మధన కలిగింది'.

రోజూ పేపర్లో 'దేశం వెలిగిపోతుందని చెప్పినా...! వెలగలేదూ ఆరిపోయింద'ని చెప్పినా... తనకు సంబంధించిన విషయాలు కావన్నట్లు... అట్లాపైపైన హెడ్డింగులు చూడటం... అవతల పారెయ్యడం... కాకపోతే 'రియల్ ఎస్టేటు' వార్తలు చూడటం.

కానీ 'నడికూడి'లో ట్రైన్ దిగింది మొదలు ఈ నాలుగైదు గంటల్లో ఏం చూశాడు? ఏం అనుభవించాడు? వీసమంత మార్పులేని తన ఊరు... జనమూనూ?

ఇదీ ఒక జీవితమేనా? ఎట్లా బతుకుతున్నారు.

ఇక్కడే పుట్టి పెరిగాడూ అయినా వీటి మంచి చెడ్డల గురించి ఆలోచన ఎన్నడూ కలగలేదు. తను వీటన్నిటిలో భాగంగా జీవించాడు.

కానీ 'సిటీ' జీవితం... అక్కడితో పోల్చుకుంటే ఏం జీవితాలివి! అన్పించసాగింది, మొదటిసారిగా.

ఏ వస్తువు కావాలన్నా డబ్బు పారేస్తే దొరుకుతుంది. పైగా చల్లగా హాయిగా వుండి జీవితం ఆనందంగా వున్నట్టే వుండేది.

శంకర్రావుకిప్పుడవన్నీ తలకిందులుగా కనబడ్డాయి. ఉద్యోగాల్లేక... వ్యవసాయాలు దెబ్బతిని... కూలీ కోసం వున్న వూరును వదిలిపెట్టి పోతున్న జనం ఒకవైపు.

ఇంకా ఊళ్ళోనే ఇళ్ళనూ వాకిళ్ళనూ వదిలిపెట్టలేని రైతాంగం మరొకవైపు. ఏమిటీ వూళ్ళస్థితి?

నీళ్ళులేవు... పంటల్లేవు... తింటానికి తిండిలేదు... మరి జనం చస్తే చచ్చామని తిరగబడరా? ఎలాగూ చచ్చేదే? ఎట్లా చస్తే ఏం మునిగిపోయిందీ?

ఇంకా అన్న, తండ్రి ఇంటికి రాలేదు. అన్నమ్మ ఊళ్ళో విశేషాలు చెప్తా వుంది. "ఏమోరా! నువ్వు వచ్చావంటే గుండె గుబగుబలాడతా వుంది. ఇప్పుడసలు వూళ్ళల్లో నీ ఈడు పిల్లలు ఎవరూ వుంటంలేదురా! అందులో ఈ ఎలక్షన్లు వచ్చాయి.. ఊళ్ళనిండా పోలీసులే... ఏమవుద్దోనని పిసుక్కు చస్తున్నామనుకో"

"నేను పోయేటప్పటికి యింత ఘోరంగా లేదుగామ్మా! పోయినసారి వచ్చినప్పుడు కూడా యింతగా భయపడ్డట్టులేవూ... ఈసారేంటిలా యిదైపోతున్నావ్", తల్లి ఆందోళన చూసి శంకర్రావు ఆశ్చర్యంగా అడిగాడు.

"రోజురోజుకూ అట్లానే వుంటుందంటారా?, మూడేళ్ళనాడున్నట్టు ఈ రోజుందా. ఎన్ని జరిగి పోలేదూ?.. నువ్వు ఎప్పుడో ఓసారివచ్చి పోతుంటే ఏం అర్థమవుతాయి?"

అవున్రా... మాలమాదిగోళ్ళని వెనకేసుకొచ్చాడని... ఆ కంసాలోళ్ళ పిల్లోడు లేడూ... నీతో తిరిగేవాడు... వాడిని రెండుమూడు నెల్లైంది. గొంతు తగ్గించి మాట్లాడింది.

ఏందీ? ఏం చేశారూ?

"ఏమోరా? పాపమెంతో పుణ్యమెంతో? ఫకీరారెడ్డి పనేనంటున్నారు.

"చెరువుకింద బాడవ చేనులేదూ?.. వాళ్ళ నాయినోళ్ళ కాడి నుండి రెడ్డి కిందనే వుండే... అది రెడ్డిగారి బాడవనే పిలుస్తారయ్యే!... ఈ మాలమాదిగోళ్ళకు ఎట్లా తెలిసిందోరా? చెరువులో నీళ్ళూ లేవు! బాడవ పొలమూ పోరంబోకేనంట... అది తెలిసి, చెరువూ... బాడవ మొత్తం కలిపి దున్నుకున్నారు".

ఎల్లకాలం కళ్ళు మూసుకునేవుంటారా?

కళ్ళముందు 'అచారి' కనబడ్డాడు. ఎవరి జోలికీ పోయేవాడుకాదే? వాళ్ళకన్నీ ఆచారాలు... అందుకే ఎవరితోనూ కలవడనుకునే వాళ్ళు. అంత పట్టింపులున్నాడు ఈ మాలమాదిగలతో ఎట్లా కలిశాడూ? ఈ గొడవల్లో ఎట్లా వేలుపెట్టాడూ?

"ఇదొక్కడేనా? ఊళ్ళల్లో అన్నీ మారిపోయినయ్యి శంకరూ, వెనకటిలాగా మాలమాదిగలను.. 'ఏరా!పోరా!' అంటే వూరుకుంటలేదు. అసలు ఎవరితో మాట్లాడొచ్చో... ఎవరితో మాట్లాడకూడదో తెలియడంలేదు... నోరు మెదపటానికి భయంగా వుంది శంకరూ".

"ఊరు ఊరులాగా లేదురా"

'నిజమే తను ఈ ప్రాంతపు వార్తలు చూస్తున్నాడు. కానీ ఇంత ఆందోళనకరంగా బతుకుతున్నారనుకోలేదు... వార్తలు వినడం వేరు... వాస్తవాల మధ్య బతకడం వేరు.'

అప్పటికి ఎనిమిది గంటలయింది. తండ్రి యింకా ఇంటికి రాలేదని చూస్తున్నారు.

ఇంతలో ఎదురింట్లో పిల్లలు చేరి 'దొంగా... పోలీస్' ఆట ఆడుకుంటూ... గట్టిగా, 'దొంగా దొంగ', 'పట్టుకోండి... పట్టుకోండి' అని అరుచుకుంటూ, వుత్సాహంగా విజిల్స్ వూదసాగారు.

ఆ మోత వినగానే... మాట్లాడుతున్నది ఆపేసి అర్థాంతరంగా దడదడలాడుతూ బజార్లోకి పోయింది.

తల్లి అట్లా కంగారుగా బయటికి ఎందుకుపోయిందో అర్థంకాలేదు.

ఇంతలో ఇంటి చుట్టుపక్కల వాళ్ళూ హడావిడిగా వీధిలోకి వచ్చారు. అప్పటి దాకా నిశ్శబ్దంగా వున్న వీధంతా గుబగుబలాడిపోయింది. ఈ లోపు పిల్లల్ని నాలుగు అంటించి వాళ్ళ చేతుల్లో పీకలు లాక్కున్నారు. ఆ దెబ్బలకు కొందరు నోరు మూసుకున్నా... కొందరు పెద్దగా ఏడ్చారు.

ఇక వూరుకోండీ! అసలే చీకటిపడింది... ఆ పంచి పెట్టిన పీకలు వాళ్ళకందేటట్టు ఎవడు 'పెట్టమన్నాడూ? చాతకాకపోతేసరి అని పెద్దవాళ్ళనే మందలించి వెళ్ళిపోయారందరూ.

శంకర్రావుకు ఇది మరీ విచిత్రంగా వుంది. 'పిల్లలు విజిల్స్ వూదితే పెద్దవాళ్ళకు అంత కంగారెందుకు? చిన్న పిల్లలు సరదాగా ఆడుకునే ఈ ఆటలకూ ఈ ఆంక్షలేమిటీ? మనుషులెందుకింతగా... గాలి కదలికలకే వులిక్కిపడుతున్నారూ?

"ఏం బతుకులో... చీమ చిటుక్కుమన్నా అదిరిపోవాల్సి వచ్చింది. కాళ్ళు గజగజలాడుతున్నాయనుకో"

గొణుక్కుంటూ అన్నమ్మ లోపలికొచ్చింది.



అది జరిగి స్థిమిత పడ్డారో! లేదో! ఓ ముగ్గురు మనుషులు బజార్లో నిలబడి అటూ ఇటూ చూడసాగారు. వాళ్ళను చూస్తూనే అన్నమ్మ పై ప్రాణాలు పైనేపోయాయి...

వాళ్ళ దృష్టి శంకర్రావు మీద పడింది.

"ఎవరదీ!" అంటూ దబాయింపుగా అతన్నుద్దేశించి కేకవేశారు. తల్లి కంగారూ.. వాళ్ళ గదమాయింపు ఆ తల్లి ఆలోచనల్లో పడేసింది. ఇంట్లోకెళ్ళి చొక్కా వేసుకుని వచ్చాడు. వాళ్ళను చూసి అతను కంగారు పడకపోవడం చూసి... ఉద్యోగస్తుడనుకుని దూకుడు తగ్గించి వివరాలు అడిగారు.

అన్నమ్మ గబగబా ముందుకు వచ్చి, "మా చిన్నబ్బాయి! నాయినా... ఇక్కడ వుండేవాడు కాదు... ఇందాకే వచ్చాడు" అంది.

శంకర్రావూ... తను చేస్తున్న కంపెనీ పేరూ, అడ్రస్ చెప్పాడు.

... ఈ బజారులో విజిల్‌మోత వినబడితే.. "ఎవరైనా కొత్తవాళ్ళు వస్తే మీ బజారు వాళ్ళు వూది వుంటారేమోనని! ఇటు వచ్చామన్నారు.

సరే!... మేం చెప్పినట్టు ఎవరన్నావస్తే విజిల్ వూదండి... క్షణంలో వస్తాం... జాగ్రత్త ఎవర్నీ కొత్తవాళ్ళను రానివ్వొద్దు.

అన్నమ్మ వూపిరి పీల్చుకుంది. "పోనీలే నాయనా... యివ్వాల్టికి మనం గట్టెక్కాం" అంది.

వాళ్ళు వెళ్ళిపోయారనుకుని పక్కిళ్ళవాళ్ళు వచ్చి, 'ఏమన్నారూ... ఏమంటున్నారూ" అని ఆత్రుతగా అడిగి... జరిగింది విని 'హమ్మయ్యా' అని గాలిపీల్చుకున్నారు.

"అయినా ఎందుకొచ్చావ్ శంకర్రావ్! యిప్పుడు? మూలిగేనక్కమీద తాటికాయ పడ్డట్టు... అసలే బాగా లేదు... దానికితోడు ఈ ఎలక్షన్లు! మన ప్రాణాల మీదకు" అన్నారు.

శంకర్రావుకు యిదంతా దిమ్మ తిరిగినట్లయింది... ఈ రెండు మూడేళ్ళగా అడపా దడపా వచ్చిపోవడమేగానీ... జరుగుతున్నదేమిటి చూడలేదనుకున్నాడు.

ఊళ్ళల్లో యింత మార్పులేమిటీ? ఇదేమన్నా శత్రుదేశ సరిహద్దులోని గ్రామమా?... తనకు తెలిసిందానికంటే, తెలియం ఎక్కువుందనుకున్నాడు.

'ఎప్పుడూ తనతల్లే... "ఇప్పుడెందుకురా! ఇక్కడేముందీ? అంటుంటే.. శలవు పెట్టివస్తే ఉద్యోగం పోతుందేమోనని భయమేమోననుకునేవాడు.

కానీ 'యిప్పుడందరూ!' తొందరగా పో.. తొందరగాపో అంటున్నారే!

అసలు ఈ విజిళ్ళేమిటి? ఈ పోలీసులేమిటి? త వూరేమిటి? అయోమయంగా అనిపించింది శంకర్రావుకు.

ఇంతలో తండ్రీ, అన్నా కొష్టం దగ్గర నుండి వచ్చారు. "ఏం ఇంత చీకటి పడిందాకా వున్నారు".. అంది. అన్నమ్మ మొహం చూసి ఏమైవుంటుందీ?, 'అట్లా వుందేంటీ' అనుకున్నాడు కోటయ్య.

చూపు తప్పిస్తూ "ఎప్పుడొచ్చావురా" అని పలకరించారిద్దరు వాల్చివున్న మంచాల మీద కూర్చొని... చొక్కా విప్పుతూ.. కడవలు బయటపెట్టమ్మా... నీళ్ళు తెస్తా" అన్నాడు పెద్దకొడుకు.

"నీళ్ళకు పోదామని బిందె తీసుకున్నానో! లే ఈ రభస జరిగి... ఆగిపోయ్యానురా" అని... జరిగి సంగతులు చెప్పింది అన్నమ్మ.

అదంతా వింటూ మౌనంగా వుండిపోయార "ఏం చేద్దాం... అట్టా తయారయ్యినయి ఊళ్ళు... ఏ జరుగుద్దో... ఎటుపోతుందో... ఆ భగవంతుడి తెలియాలి" అన్నాడు పెద్దకొడుకు.

కోటయ్య ఆ భారాన్ని తగ్గించాలన్నట మాటమారుస్తూ "ఏ యే పిల్లోడొళ్ళు యియ్యాలా రాల అని... నాలుగు రోజులైంది పోయి... రానేలేదే అన్నాడు.

"వస్తది లేవయ్యా! పోకపోక పుట్టింటికి పోతే రెండు రోజులన్నా వుండొద్దా? ఏంది?"..

"అదిగాదే పిల్లోడు లేకపోతే యిల్లుబోసిగా లేదం సందడంతా పోలా! వాడు లేకపోతే," అన్నాడు.

బిక్కుబిక్కుమంటూ గడిపే రోజువారీ జీవితాల్లో పసిపిల్ల వారికి వూపిరి పీల్చుకునే క్షణాలనిచ్చేది.

కొద్దిసేపు అందరూ మెదలకుండా వూరుకుండిపోయారు

అంతలో పెద్దకొడుకు నీళ్ళ కావిడితో రాగానే అన్నమ్మ ఇంట్లో లేచివెళ్ళింది.

శంకర్రావు నుద్దేశించి "ఏందిరా? ఏంది సంగతులు" అన్నా తండ్రి.

సిటీ విశేషాలూ... కాసేపు రాజకీయాలు... ఆ తరవా ఉద్యోగం... అన్నీ మాటల్లో వచ్చాయి. శంకర్రావు తండ్రితో "ఊ పరిస్థితి ఇట్లా వుందేంటన్నాడు".

"తిరుపతి సంగతప్పుడు నుండి మరీ పోలీసుల హడావి ఎక్కువయిందిరా ఈ ప్రాంతంలో".

"అది సరే! ఈ ఏడాదన్నా సంబంధాలు చూడమంటావ ఎప్పటికప్పుడు వాయిదా వేస్తున్నావ్"... "జీతమూ పెరిగింది క

ఇంకేంది".

"ఇప్పుడే కాదులే! నాయినా! నాకు ఎక్స్‌పీరియన్స్ వస్తే..మంచి కంపెనీకి మారొచ్చు. అప్పుడు జీతమూ పెరుగుతుంది".

"అప్పటికి నీకు ఎంటికలు కూడా నరిసిపోతయ్యా... పాతికేళ్ళు నిండినయ్... ఎంత చెట్టుకు అంతగాలి... వున్నదాన్లో సర్దుకోవాల... అక్కడందరికీ వేలువేలు జీతాలే వస్తాయా? ఏంది?" అన్నాడు కోటయ్య.

ఆ సంభాషణ ఎటూ తేలకుండానే నీళ్ళు కాగినయ్యి... లేవండంటూ అన్నమ్మ 'కేక' వేసింది. అందరూ వరసగా నీళ్ళు పోసుకుని... అన్నాలు తింటూ, ఊళ్ళో ఈ రెండు మూడేళ్ళుగా జరుగుతున్న సంగతులు మాట్లాడుకున్నారు. తమ ఊళ్ళోనే కాదు చుట్టుపక్కల గ్రామాలన్నీ అట్లానే వున్నాయంటూ... తమకు తెలిసిన సంగతులు... తాము విన్న విషయాలు చెప్పారు.

"అట్లాగాదూ ఆ చాకలి 'కోటేశు'ను నిలువునా పొట్టనబెట్టుకున్నారు. వాళ్ళిద్దరూ యిష్టపడ్డారని... వాళ్ళను సపోర్టు చేసి పెండ్లి చేసినందుకు... వీడు ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఆ అక్కాచెల్లెళ్ళెంత ఏడ్చారో?"

"శంకర్రావుకు ఆశ్చర్యం కలిగింది.. .పెండ్లి చేసినందుకు ఇంతశిక్షా?"

"అవున్రా! ఊళ్ళో వాళ్ళ పెత్తనాలకు అడ్డం వస్తున్నాడని... పంచాయితీల పేరుతో తమ ఆటలు సాగటంలేదనీనూ"

"అవన్నీ వింటుంటే... పుట్టి పెరిగిన వూరిమీద మమకారం వదులుకోవాల్సి వస్తుందేమోనని జంకు కలిగింది. తమ ఊళ్ళను రక్షించే నాథుడే కరువయ్యాడా? మరీ యింత అధ్వానమై పోయిందేమిటి?" అనుకున్నాడు.

'వానల్లేకా... పంటలు పండకా... ఆత్మహత్యలే శరణ్యమంటున్న రైతాంగం...'



"తనకు తెలిసిందగ్గర నుండి తన కుటుంబమంతా ఎంత చాకిరీ చేస్తోంది?... తన తల్లితండ్రులకు ఆ ముతక చీర... ఆ నీరుకావి పంచలూ తప్ప మరొకటి తెలుసా?... సిటీలో ప్లాట్లకోసం... ఆ రాళ్ళల్లో రప్పల్లో గుమ్మరించే డబ్బు... యింతగా వీళ్ళకెట్లా వచ్చిందో?నని! ఎన్నిసార్లు అనిపించలేదూ?

"ఏమిటీ వైరుధ్యం... బతకలేక ఒకడూ... ఎక్కువయ్యి మరొకడూ"

కూలిపోయే ఈ జీవన దృశ్యాలను సరిచేసే వాడు ఒక్కడూ కనబడటంలేదు. పైగా ఈ నిప్పుల గుండాలేమిటో? ఎవరిని రక్షించడానికీ?

శంకర్రావు పడుకున్నాడనేగాని నిద్రపట్టలేదు...

ఇంతలో విజిల్స్ మీద విజిల్స్ వూదుతూ జనం పరిగెత్తుతున్నారు. 'పరిగెత్తండీ... పరిగెత్తండీ'... "పట్టుకోండీ... పట్టుకోండీ' అని అరుస్తున్నారు.

శంకర్రావూ, "పట్టుకోండి, పట్టుకోండని" అరిచాడు.

ఆ అరుపుల్లో మెలకువ వచ్చేసిందతనికి, 'ఛా! కలా! ఇదంతా!' అనుకుంటే అదే వస్తుంది కలలో! ఇదో రోగం నాకు.

మంచినీళ్ళు తాగుదామని, లేచి కూర్చున్నాడు. ఎదురుగా మంచాల మీద ఎవరూ కన్పించలేదు. తలతిప్పి చూస్తే తల్లి బజార్లో చుట్టుపక్కల ఆడవాళ్ళతో కలిసి వుంది. ఇళ్ళన్నీ మేలుకోనున్నాయి. 'మళ్ళీ ఏమైందో'నని లుంగీ సరిజేసుకుంటూ బజార్లోకొచ్చాడు శంకర్రావు.

తల్లినుద్దేశించి "ఏమైందే? అందరూ ఏంది నుంచోనున్నారు"

"ఏమోరా! ఇంకా తెలియలేదు... ఊరి చివర తోపుల దగ్గరగా ఈల మోతలు తెగవినబడితే... జనమంతా పరిగెత్తారు... ఏం జరిగిందో? ఏమో? ఆందోళనగా అంది.

అక్కడ అన్నమ్మే కాదు... అందరి మొహాలు అట్లానే వున్నాయి. 'అయితే తను విన్నది కలలో కాదన్నమాట'.. అనుకున్నాడు.

సెంటరు దాకా వెళ్ళివస్తానని రెండడుగులు వేశాడు. 'వెంటనే అన్నమ్మ' ఎక్కడికిరా! బయలుదేరావ్! పద ఇంట్లోకి... ముందు నీ కోసం హైరానా పడాల... ఎందుకొచ్చిన గోల' అని పోనివ్వక పోయింది.

తల్లి భయం చూసి... ఆమెను బాధపెట్టడం ఎందుకులే! అని ఆగిపోయాడు. కాని ఏమి జరిగిందోనన్న ఆత్రుత ఆగిందికాదు. అతనూ అక్కడే నిల్చుండిపోయాడు... వాళ్ళ మాటలు వింటూ... అందరి ఆందోళనలు గమనిస్తూ' మనుషులు భయంనీడలో బతకడమంటే ఇదే కాబోలు'ననుకున్నాడు.

'నిన్నటి అక్కడి జీవితానికీ... ఈ పూట, ఈ రోజు యిక్కడి బతుక్కీ ఎంత తేడా?'

అట్లా ఓ గంటకు పైకి పోయిన వాళ్ళు ఒక్కొక్కరే వచ్చారు.

మొదట కనబడిన వాడిని నిలబెట్టి... ఏమయ్యిందీ? ఎవరొచ్చారూ? ఎవర్ని పట్టుకున్నారూ? అని అతన్ని చుట్టి తలోప్రశ్నా వేశారు.

"ఛీ..ఛీ... వెదవనాయాళ్ళు... వీళ్ళా మనకు కాపాలా కాసేది. వీళ్ళా మనల్ని రక్షించేది... వీళ్ళు వున్నన్ని నాళ్ళు పాము పడగ కింద బతుకులీడుస్తున్నట్లే... ఎప్పుడు పోతారో?"

"అసలేమయ్యిందీ! చెప్పాచెప్పకుండా తిడితే మాకెట్లా తెలిసి చస్తది"... అసహనంగా అరిచారు. అసలే టెన్షన్‌లో వుంటిరాయె!

ఎండాకాలం కదా... వీరాసామి లేడూ... అదే ఆ మాదిగ 'వీరడు' వాళ్ళందరూ బయటే మంచాలేసుకుని పడుకున్నారు. మంచినిద్రలో వుండగా... ఆ వుత్తరాది పోలీసోడు... వాడికి మనబాసకూడారాదు... వాడు బాగా పూటుగా తాగి మాదిగ పల్లెపోయి! వీరడుకూతుర్ని అమాంతం భుజానేసుకుని పోతుంటే... ఆ పిల్ల భయంతో కేకలు పెట్టిందట... అంతా పక్కపక్క కొంపలాయె... ఆ పిల్ల అరుపులకు పల్లెంతా గుబగుబలాడతా లేచిపోయింది.

"ఆ వచ్చిన వాడు! ఎవడో! ఏమిటో అర్థం కాక... ఇచ్చారుగా ఇంటికో విజిలు... తలో 'ఈల' తీసుకుని గందరగోళంగా వూదిపారేశారు. పరిగెత్తుకుంటూ పోయి వాడ్ని పట్టుకుని కట్టేశారు"

ఈ గందరగోళానికి... కాంపులో వున్న పోలీసులంతా వచ్చి పడితిరి.

అతను చెప్తుండే అందరూ నోళ్ళు వెళ్ళబెట్టి ఆశ్చర్యంగా విన్నారు.

"ఇంతకీ వాడ్ని నాలుగు తన్నానైనా లేదా?"

"పోలీసోళ్ళు వచ్చేప్పటికీ నాలుగు యిరగదీశారు...ఇంతలో వాళ్ళు రానే వస్తిరి... వాళ్ళు వచ్చాక... వాళ్ళవాడిని కొట్టనిస్తారా?

"మరి వాడిని వూరికే వదిలేశారా?"

"ఏమోమరి!... గందరగోళంగా జనం అరుస్తున్నారు...

పోలీసులేమో సర్దుతున్నారు... నేనీ లోపు వచ్చేశా?" అన్నాడతను.

ఈలోపు కోటయ్య రానేవచ్చాడు.

"ఇంతకీ చివరికి ఏం చేశారు వాడిని".. అని కోటయ్యనడిగారు.

"నాలుగు దెబ్బలేస్తే ముందు వూరుకున్నారు.... జనం మరీ ఎగబడతుంటే గదమాయింపులు మొదలెట్టారు... అసలే మామూలు పోలీసులు కాదాయె... జనం వెనక్కి తగ్గారు! ఏం చేస్తారో నన్నట్టు".

'వీరాసామి వాళ్ళు ఏమంటున్నారూ'

అంత జరిగితే ఎందుకూరుకుంటారూ? వీరసామి కొడుకు 'లింకను లేడూ! అతను' వాడిని వదిలిపెట్టమని ఎదురు తిరిగాడు. అయితే జనం లింకన్‌కు సర్దిచెప్పి... రేపు తేల్చుకుందామన్నారు. అప్పటికిగాని వాడు వూరుకోలేదు.

నేను వచ్చేటప్పుడు, వాడి మీద కేసు పెట్టకపోతే మండలానికి పోయి రిపోర్టు చేద్దామని... అక్కడా కాకపోతే గుంటూరు పోయి కలెక్టరుని కలుద్దామంటున్నారు.

ఎందుకూరుకుంటారూ? జనం ఎట్లున్నారిప్పుడూ? అందులో మాదిగపల్లె, మాలపల్లె జనాలూ?

"ఆ పిల్లోడు అట్లా ఎదురు తిరిగితే... గుర్తు పెట్టుకోరూ... ఇంకేమన్నా వుందా?" అన్నారెవరో

"ఎన్నాళ్ళని వూరుకుంటారూ? తిని కొవ్వెక్కి ఆడపిల్లల మీద బడితే... వాళ్ళ బతుకులేం కావాలా?... అందులో అందరి ముందూ? వాళ్ళకి మాత్రం చీమూ.. నెత్తురూ లేదూ?"

"అయిన కాడికి అయిందని చావో... రేవో అనుకోరూ"

ఎవరికి తోచింది వాళ్ళు మాట్లాడసాగారు.

ఇదంతా వింటున్న శంకర్రావుకు సాయంత్రం నుండి పడుతున్న బాధంతా, గోటితో తీసేసినట్టుగా పోయింది.

ఇంత అక్రమం కళ్ళముందు జరిగినా... జనం మౌనంగా వుంటే! ఇక ఆ జనం చచ్చినకిందే లెక్క... ఆ వూరు 'వల్లకాడు' కిందే జమ.

కానీ ఇది నా వూరు.. నేను పుట్టిపెరిగిన ఊరు. ఈ మట్టి నాది... ఇది నా మాదినపాడు" శంకర్రావుకు ఏదో ధైర్యం మనసంతా నిండింది.

(ఎస్.పి. రవిశంకరయ్యన్నార్... పల్నాటి గ్రామాల్లో విజిల్ పంచిపెట్టిన నేపథ్యం) ❖



# అంతా సజావుగానే ఉంది

ఎస్.డి. చంద్రశేఖర్

అంతా సజావుగానే ఉంది
సముద్రాలు ప్రశాంతంగానే ఉన్నాయ్
సముద్ర గర్భంలోని బడబాగ్నులూ ప్రశాంతంగానే ఉన్నాయ్
జలాలు ప్రశాంతంగానే ఉన్నాయ్
అవి పాతాళ కుహరాల్లోకి వెళ్ళి దాక్కున్నాయ్
రాయలసీమ ప్రజలంటే వాటికి ఎక్కళ్ళేని భయం
అందుకే అవి పైకెక్కడా కనిపించకుండా
పాతాళకుహరాల్లోకి వెళ్ళి ప్రశాంతంగా నిద్దురోతున్నాయ్

ఆకాశమూ ప్రశాంతంగానే ఉంది
మబ్బుల్లేవు, గాలుల్లేవు
తుఫానులూ లేవు
కర్షకుల కన్నీటి కడగండ్లను గట్టెక్కించడానికి
ఎవరూ పూనుకోకపోతే మనకేం పట్టిందని
నీలి మేఘాలు, కారుమబ్బులూ
కంటికే కనిపించడం లేదు
అవి ఉత్తర ధృవంలోకో దక్షిణ ధృవంలోకో వెళ్ళి దాక్కున్నాయ్
మన టీవీ ఛానళ్ళన్నీ వాటి కోసం వెదుకుతూ ఉన్నాయ్

అంతా సజావుగానే ఉంది
భూమి కూడా ప్రశాంతంగానే ఉంది
భూమ్మీది ప్రజలకంటే పోలీసులే ప్రశాంతంగా ఉన్నారు
ఏ గొడవలూ లేవు
అరెస్టులు అసలు లేనేలేవు
అడవిలో సాధు జంతువులకంటే
క్రూర జంతువులే శాంతంగా ప్రశాంతంగా ఉన్నాయ్
ఏ దేశమూ ఇంకో దేశంపైన దండెత్తడంలేదు
ధరలు ఏ మాత్రమూ పెరగడంలేదు
పత్తిరైతుల ఆత్మహత్యల్లేవు
రైతు కూలీల వలసలూ లేవు
పాలకోసం పసివాళ్ళ ఆకలి కేకలూ లేవు
నక్సలైట్ల పైన ఎన్‌కౌంటర్లూ లేవు
ఎక్కడ చూసినా వరికోతలే తప్ప కరెంటు కోతలసలే లేవు
అంతా సవ్యంగా ఉంది
ఋతువులూ సక్రమంగానే ఉన్నాయ్
వేసవిలో తీవ్రంగా ఎండలు కాస్తున్నాయ్
ఎండలబండలకింద పడి ఎవరూ చావడంలేదు
వర్షాల వంతెనల కిందపడి ఎవరూ కొట్టుకెళ్ళడంలేదు
ఏర్లూ లేవు వాటి ఉప్పొంగి ప్రవహించడాలులేవు
ఆనకట్టలసలు తెగడమే లేదు
పంట కాల్వలకు గండ్లు పడ్డమేలేదు
ఆడవాళ్ళు అర్ధరాత్రి పూట స్వేచ్ఛగా తిరుగాడుతూ ఉన్నారు
హత్యల్లేవు ఆత్మహత్యల్లేవు
అత్యాచారాలు లేవు మానభంగాల్లేవు
అంతా సజావుగానే ఉంది
నాకే ఈ మధ్య ఏమీ బాగుండడంలేదు
రాజకీయ నాయకుల వాగ్దానాల వర్షాల్లో తడిసి
కాస్తా జలుబు చేసినట్లుంది
చలిజ్వరం వచ్చేలా ఉంది
పచ్చకామెర్ల వ్యాధి సోకినట్లుంది
పచ్చ కళ్ళద్దాలు పెట్టుకొన్నట్లుంది
కళ్ళు బైర్లు కమ్ముతున్నట్లున్నాయ్
కాస్తా మతి స్థిమితం లేనట్లుంది

45

# కథావీధిలో కమనీయ విహారం

బి.ఎస్. రాములు



గ్రంథావిష్కరణ చేస్తున్న ప్రొ॥ కె. శ్రీనివాసులు, వేదికపై (ఎడమ నుంచి) కేతు, తెలకపల్లి రవి, ఎస్.వి. సత్యనారాయణ, మానేపల్లి, బి.ఎస్. రాములు, వెంకట్రాజం

ఔత్సాహిక రచయితలకు, కథారచనపై అవగాహన లిగించేందుకు సామాజిక తాత్విక విశ్వవిద్యాలయ విశాల సాహిత్య కాడమీ 27-29 ఆగస్టు 2004లో హైదరాబాద్‌లోని పొట్టి శ్రీరాములు లుగు విశ్వవిద్యాలయం ఆడిటోరియంలో మూడు రోజులపాటు శిక్షణా బిరం నిర్వహించాయి.

డా॥ సి. నారాయణరెడ్డి ముఖ్య అతిథిగా శిక్షణా శిబిరాన్ని ారంభించారు. ప్రాచీన వాఙ్మయంలోనే కథలు గేయరూపంలో, పాటల ాపంలో ఉన్నాయని సినారె పేర్కొన్నారు. మానవ జాతి చరిత్ర జానపద ాఙ్మయంతోనే ఆరంభమైందన్నారు. సాహిత్యంలో విశిష్ట ప్రక్రియ కథా ాపం అని అన్నారు.

విశిష్ట అతిథిగా విచ్చేసిన డా॥ ఎన్.గోపి మాట్లాడుతూ శిక్షణ బిరాలు నిశ్శబ్ద విప్లవాల వంటివని వెంటనే ఫలితాలు కనిపించవని ్నారు. ఇటీవల తెలంగాణా, రాయలసీమ నుండి కొత్త కథలు స్తున్నాయని, ఇవి గ్రామీణ జీవితాన్ని ప్రతిబింబిస్తున్నాయని తెలిపారు. యితే యిలాంటి కథల్లో శిల్పం ఉండడంలేదని కొందరు వాదిస్తున్నారని.. ఈ విషయంపై చర్చించాల్సిన అవసరం ఉందని అభిప్రాయపడ్డారు.

ఈ సందర్భంగా బి.ఎస్. రాములు రచించిన బీసీలు ంచేయాలి? గ్రంథాన్ని సినారె ఆవిష్కరించారు. ఆచార్య ఎన్. గోపి పులుగు ్రీనివాస్ రచించిన 'టీపాయింటు' పుస్తకాన్ని బిసి.ఎస్సీ విద్యార్థి ువజనులారా - బి.ఎస్. పిలుపు - పుస్తకాన్ని నారగోని, బీసి కులాల ్రక్పథం అనే మరో పుస్తకాన్ని సినారె ఆవిష్కరించారు.

ప్రారంభ సమావేశానంతరం మొదటి సెషన్‌లో కాలువ ల్లయ్య, చంద్రశేఖర్ ఆజాద్, ద్వానాశాస్త్రి, తదితరులు కథా ప్రక్రియపై ోదాహరణ ప్రసంగాలు చేశారు. బి.ఎస్. రాములు ప్రధాన ప్రసంగంలో థలు రాసే తీరు మెరుగుపరుచుకోవడంలో మెలకువలు, లిపి తప్పులు, వరణలు, పేరాల విభజన, కథా వస్తువును ఎన్నుకునే విధానంపై వరించారు. గోష్ఠిలో పాల్గొన్న కథకులు కథను వివరించి వాటి ప్రారంభం ుగింపు ఎలా ఉన్నాయో ఒక్కొక్కరు ఐదేసి కథల చొప్పున వివరించారు.

మొదటి రోజు సాయంత్రం సెషన్‌లో జ్వాలాముఖి, కె. వరలక్ష్మి, ా చంద్రయ్య, చంద్రశేఖర ఆజాద్, నంబూరి పరిపూర్ణ, ఆడెపు లక్ష్మీపతి, ాలువ మల్లయ్య, తమ కథల్లో ముఖ్యమైన ఐదు కథలను, వాటి వస్తువు, ితివృత్తం, ప్రారంభం, ముగింపు విశేషాంశాలను విశ్లేషించారు.

## స్పష్టత, క్లుప్తత, ఆప్తత

రెండవ రోజు కార్యక్రమంలో భాగంగా శనివారం వక్తలు "కథా స్తువుల్లో వైవిధ్యం"పై వివరించారు. రెండో రోజు కథల బడిని డా॥ కేతు శ్వనాథరెడ్డి ప్రారంభించారు. రెండు మూడు కథలకే మహారచయితలుగా విర్రవీగడం విడ్డూరంగా ఉందని, ప్రపంచ కథలు చదివితే ఎవరి స్థాయి ఏమిటో తెలుసుకోగలుగుతారని ఆయన హితవు పలికారు. అక్షర దోషాలను, ఔచిత్యం పాటించాల్సిన తీరును, ప్రాంతీయ మాండలికాలు రాసేటప్పుడు తీసుకోవలసిన మెలకువల గురించి కేతు విశ్వనాథరెడ్డి వివరించారు.

ప్రపంచంలో వచ్చిన మంచి కథలపై డా॥ ఎస్వీ సత్యనారాయణ, ప్రొ॥ కె. శ్రీనివాసులు, తెలకపల్లి రవి ప్రసంగించగా డా॥ మానేపల్లి తెలుగు కథలపై ప్రసంగించారు. వ్యక్తి, సమాజం, ప్రకృతి ఆరోగ్యం గురించి మాట్లాడుతూ మానసిక ప్రశాంతత రచయితకు ఎంత అవసరమని టి. వెంకట్రాజం పేర్కొన్నారు. తెలకపల్లి రవి పత్రికలకు వస్తున్న కథల గురించి మాట్లాడుతూ కథలు బాగా చదవాలని సూచించారు. కథారచనలో స్పష్టత, క్లుప్తత, ఆప్తత అవసరమన్నారు.

రెండవ రోజు మధ్యాహ్నం సెషన్‌లో పోతుకూచి సాంబశివరావు మాట్లాడుతూ ఇతర భాషల వారికి తెలుగు కథల గొప్పదనం వివరించేందుకు అనువాదాలు చేయవలసిన అవసరం ఉందన్నారు. రచయిత సలీం మాట్లాడుతూ 1990 నుండి దళిత, స్త్రీ, మైనారిటీ కథలు విరివిగా వచ్చాయని, అభద్రతాభావం, పరాయీకరణలోంచి ముస్లిం సాహిత్యం ఆవిర్భవించిందని అన్నారు. స్కైబాబా ఇటీవల ప్రచురించిన "వతన్" కథల సంపుటిలోని కథలను పరిచయం చేస్తూ ముస్లిం జీవితాల్లోని పరిణామాల్ని, సంస్కృతిని వివరించారు. వేదగిరి రాంబాబు మాట్లాడుతూ కథల్లో స్పందించే స్వభావం, జీవన దృశ్యాలు ఉండాలని, కథలు ప్రారంభం, ముగింపులు ఎలా వుండాలనే నిర్దిష్టతలేమీ లేవని చెప్పారు.

రెండో రోజు సాయంత్రం బి.ఎస్. రాములు తన ప్రధాన ప్రసంగంలో 1985 నుండి తెలుగు కథ విస్తరించిన తీరు వివరించారు. 1990 నుండి గత 15 ఏళ్ళుగా వచ్చినన్ని జీవిత కోణాలు, వస్తు శిల్ప వైవిధ్యం గత 90 ఏళ్ళ కథల్లోలేవని పాఠకులు మారారని, రచయితలూ మారారని, ఇప్పుడు కొన్ని కులాలు, ప్రాంతాల వారు కాకుండా, అన్ని కులాల వాళ్ళు, అన్ని ప్రాంతాల వాళ్ళు కథలు రాస్తున్నారని కథా సాహిత్యం విస్తరించిందని వివరించారు.

రెండో రోజు రాత్రి ఔత్సాహిక రచయితలకు పలు అంశాలు సూచించి కథలు రాయించడం జరిగింది. ఈ సందర్భంగా సుమారు 30 పైగా కథలు అప్పటికప్పుడు రాయడం ఒక విశేషం.

రెండో రోజు ఉదయం శిక్షణా శిబిరంలో "భారతీయ సాహిత్యం తెలుగు కథలు" సంపుటిని కేతు విశ్వనాథరెడ్డి, "50 ఏళ్ళ తెలుగు కథ తెన్నులు"గ్రంథాన్ని డా॥ మానేపల్లి, 'బీసీ ఎస్సీలపాటలు' పుస్తకాన్ని తెలకపల్లి రవి, విశాల సాహితి పిల్లల పాటలు పుస్తకాన్ని ప్రొ॥ కె. శ్రీనివాసులు ఆవిష్కరించారు. డా॥ మానేపల్లి కలలు నేల మీదికి పుస్తకాన్ని డా॥ ఎస్వీ

సత్యనారాయణ ఆవిష్కరించారు.



**పత్రికలపై ఆరోపణ**

మూడవ రోజు శిక్షణా శిబిరాన్ని ముఖ్యఅతిథిగా విచ్చేసిన ఆచార్య కొలకలూరి ఇనాక్ ప్రారంభించారు. సంపాదకుల అభిరుచి, అనుసరించి కథలు ప్రచురిస్తారని, బీసీ, ఎస్సీ, ఎస్టీలు మంచి కథలు రాసినా ప్రచురించకుండా నిలిపివేస్తారని ఆరోపించారు. ఓపికగా రాస్తూపోవాలని, కొన్నైనా అచ్చవడానికి సమయం తీసుకుంటుందని అన్నారు.

రచయిత్రులు జూపాక సుభద్ర, షాజహానా, జాజులగౌరి తదితరులు మాట్లాడుతూ 1960-70 వరకు వచ్చిన కథలే పేర్కొన్నారని 1985 నుండి వస్తున్న కథలను పేర్కొనలేదని ఆక్షేపించారు. దళిత, స్త్రీ, మైనారిటీ, తెలంగాణా, రాయలసీమ కథలు విస్తృతంగా వెలువడుతున్నాయని వీటిని పట్టించుకోకుండా మానవతా వాదంతో కథలు రాయాలని సూచించారని, ఈ కథల్లో మానవతా వాదం కనిపించడం లేదా అని ఆవేదన వ్యక్తం చేశారు. 1990 తర్వాత వచ్చిన కథల్లో ఆర్ద్రత, ఆప్తత, మానవతావాదం వివరించారు.

మరాఠీ తెలుగు సాహిత్య సంబంధాల గురించి తెలుగులోంచి మరాఠీకి అనువదించిన కథల గురించి షోలాపూర్‌కు చెందిన లక్ష్మీనారాయణ బొల్లి అనేక విషయాలు వివరించారు.

**అనువాదాలు జరగాలి**

మూడవ రోజు సాయంత్రం విశాలసాహితి కథా పురస్కారాలతో, పుస్తకావిష్కరణలతో సభ ప్రారంభమైంది. ఈ ముగింపు సమావేశానికి ద్రవిడ యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ ఆచార్య రవ్వా శ్రీహరి ముఖ్యఅతిథిగా విచ్చేశారు. దేశంలోని ఏ భాషకు తీసిపోని తెలుగు సాహిత్యానికి తగిన గుర్తింపు రావడంలేదని, కారణం అనువాదాలు రాకపోవడమేనని అనువాదాల కోసం కూడా శిక్షణా శిబిరం నిర్వహించాలని సూచించారు.

కన్నడ, మరాఠీ, మళయాళ భాషల రచయితలు అన్ని భాషల వారికి అనువాదమే తెలుస్తున్నారని మన రచయితలు ఇతర భాషల వారికి తెలియడంలేదని, ఆవేదన చెందారు.

ఈ సందర్భంగా తంబల్ల జనార్దన్ కథలను, విద్యాసాగర్ రాసిన సామాజిక అర్థశాస్త్రం పుస్తకాన్ని, సారంగ కవితా సంపుటి "ప్రేమాంజలి"ని ఆచార్య రవ్వా శ్రీహరి ఆవిష్కరించారు. జాజులగౌరి రాసిన "మన్ను బువ్వ" కథల సంపుటిని, బి.ఎస్. రాములు రాసిన 'పాలు-సదువు' కథల సంపుటి ప్రేమంటే ఏమిటి పుస్తకాన్ని ఆచార్య కొలకలూరి ఇనాక్ ఆవిష్కరించారు.

**తీర్మానాలు**

10వ తరగతి నుండి, ఇంటర్, డిగ్రీ పాఠ్యాంశాల్లో కథలు రాసే నేర్పుపై పాఠ్యాంశాలుండాలి. ఎస్‌సి, ఎస్‌టి, బిసి జీవితాలను పాఠ్యాంశాల్లో వుంచాలి. తెలంగాణ, రాయలసీమ, కోస్తాంధ్ర ప్రాంతాల జీవితాను పాఠ్యాంశాలుగా చేర్చాలి. తెలుగు విశ్వవిద్యాలయం, విశాలాంధ్ర, ప్రజాశక్తి, హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, ఓరియంట్ పబ్లిషర్స్, పెంగ్విన్ ప్రచురణ సంస్థలు, మరియు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1985 నుండి వస్తున్న కథలన్నీ తలా 100 కథల చొప్పున కథాసంకలనాలు వేయాలి. వేసవి సెలవుల్లో జిల్లా స్థాయిలో ఏటా కథావర్క్‌షాప్‌లు నిర్వహించాలి. ఇందుకుగాను సాంస్కృతిక మండలికి ప్రభుత్వం తగినన్ని నిధులను కేటాయించాలి. తెలుగు విశ్వవిద్యాలయం పుస్తకాలకు ఆర్థిక సహాయం 50% ఖర్చులకు సరిపోయేట్టుగా అందించాలి. కనీసం 10 వేల రూపాయలు ఇవ్వాలి. ఇందుకు ప్రభుత్వం 5 కోట్లు కేటాయించాలి. లైబ్రరీలు 1000 పుస్తకాల వరకు కొనుగోలు చేయాలి. అన్ని మండలస్థాయి లైబ్రరీలకు పంపాలి. తెలుగు సినిమాలకు, సీరియల్‌లకు, టీవీలకు నంది అవార్డులిస్తున్నట్లుగానే రాష్ట్ర ప్రభుత్వం కథలకు, కథాసంపుటాలకు, నవలలకు నంది అవార్డులివ్వాలి. తదితర తీర్మానాలు ఆమోదిం చారు.

మూడు రోజుల కథా శిక్షణా శిబిరంలో 15 జిల్లాల నుండి 170 మంది ఔత్సాహిక రచయితలు పాల్గొన్నారు. 15 పుస్తకాలు ఆవిష్కరించబడ్డాయి. 180 మంది సాహితీవేత్తలు ఔత్సాహిక రచయితలకు సూచనలు చేశారు. ఆత్మీయంగా కన్నుల పండుగగా శిబిరం జరిగింది.

జిల్లా స్థాయి కథల పోటీలోను, శిక్షణా శిబిరంలో కథలు రాసిన వారికి విశాల సాహితి ప్రశంసాపత్రాలను, బహుమతులను మెమెంటోలను అందజేశారు. తెలుగు కథా సాహిత్య చరిత్రలో ఈ శిబిరంలో చిరకాలం గుర్తుండిపోతుందని పలువురు పేర్కొన్నారు. ❖

## 'వాఙ్మయి' సంపాదకుడిగా డా॥ ఎండ్లూరి

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఆధ్వర్యంలో ప్రచురితమవుతున్న త్రైమాసిక పత్రిక 'వాఙ్మయి' ఎడిటర్‌గా ప్రసిద్ధ కవి, విమర్శకుడు డా॥ ఎండ్లూరి సుధాకర్ నియమితులయ్యారు. సుధాకర్ తెలుగు విశ్వవిద్యాలయం, సాహిత్య పీఠం, బొమ్మూరులో అసోసియేట్ ప్రొఫెసర్‌గా పని చేస్తున్నారు. జాతీయ పురస్కారాలతో పాటు 'ఆటా' ఆహ్వానంపై అమెరికా వెళ్ళి అంతర్జాతీయ పురస్కారాలు అందుకున్నారు. వీరి రచనలు పలు భారతీయ భాషల్లోకి అనువదించబడ్డాయి. పత్రికా రచయితగా డా॥ సుధాకర్ అన్ని తెలుగు పత్రికలకూ సుపరిచితులు.

'వాఙ్మయి' స్వతంత్ర ప్రతిపత్తి గల్గిన పరిశోధనాత్మక సాహిత్య పత్రిక. తెలుగు విశ్వవిద్యాలయం మొదటి ఉపాధ్యక్షులు ఆచార్య తూమాటి దొణప్ప అప్పటి ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు స్ఫూర్తితో స్థాపించారు. ఆచార్య గంగిశెట్టి లక్ష్మీ నారాయణ, ఆచార్య జయధీర్ తిరుమలరావు, ఆచార్య బేతవోలు రామబ్రహ్మం వాఙ్మయికి సంపాదకత్వం వహించారు. ఆచార్య ఎన్. గోపి వైస్‌ఛాన్స్‌లర్ బాధ్యత స్వీకరించాక 'వాఙ్మయి' కేంద్ర కార్యాలయం హైదరాబాద్ నుండి బొమ్మూరులోని సాహిత్యపీఠానికి తరలించారు. బేతవోలు సంపాదకుడిగా డా॥ ఎండ్లూరి, డా॥ పి. లీలావతి ఉపసంపాదకులుగా వాఙ్మయి పదిహేడు సంచికలుగా వెలువడింది. రాష్ట్ర వ్యాప్తంగా, దేశ వ్యాప్తంగా పేరు తెచ్చుకొంది. విదేశాలకు కూడా వెళ్ళగలిగింది. ప్రస్తుతం పునర్వ్యవస్థీకరణలో భాగంగా ఎండ్లూరి సుధాకర్‌ని సంపాదకుడిగా, అసిస్టెంట్ ప్రొఫెసర్స్ కత్రినాగార్జున, డా॥ జి.ఎస్. భాస్కర్‌లను సహాయ సంపాదకులుగా, జూ॥ అసిస్టెంట్ ఆర్‌ఎన్.వి. శ్రీనివాసరావుని సాంకేతిక సహాయకునిగా 'వాఙ్మయ' ప్రధాన సంపాదకులు, విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం నూతనంగా నియమించారు. ❖

# రడం

ఎర్ర మస్కలో మాయప్ప గుంటుక్కగట్టిండు. రొట్టెల్ల ఆయని మాయమ్మ అలతేరుతున్నది. గుత్తల్లవోయిన మాట తప్పించుకొనుడు కల్ల, మా పిల్లల తండ్రికి రొట్టె పంపియ్యాలె ఎర్రగడ్డ రేవున ఎవరైన వోతె జెర జెప్పు సిన్నమ్మ అని మాలె నాగవ్వ నడిగింది మాయమ్మ.




గోగు శ్యామల

ఇంక జెరసేపటికి ఇంటెంటకెంచి కూత వెట్టి 'నా అల్లునొంకల వొయ్యేటోల్లెవ్వరు లేరు కొడుకా అనంతమ్మ. ఏం జేస్తవో సుదురాయించుకో అంబటాల్లయింది. అర్కలోల్లంత ఇంటొంకల మొఖం బెడుతరుబిడ్డా. నీ మొగడు కూడా ఇటొంకల్నే జూస్తడు. ఇక్కడనేమో కూలోళ్ళు ఎల్లింద్రు. యాదొకటి జేసి బయటపడు కొడుకా' అని మాయమ్మను నాగవ్వ పురమాయించింది. ఏం చేయాలో వశపడక ఆకర్కి కూలి మానుకుందామనుకున్నది మాయమ్మ. కాని బాధపడుతున్నది. నాలుగు దినాల నుండి వంగిన నడుం లేపకుండ పదిగేను మందిమి వదెకరాల గుడ్డంల నాట్లేస్తిమి ఈ పొద్దటికి మట్టం నలపై రూపాలొచ్చేటిపని గునిగింది. నాతో ఏమి మాట్లాడకుండానే మాయప్పకు రొట్టె గట్టింది కూరేసింది. సెంబుల ఇంత సల్లవోసింది. సల్ల తెల్లగ కనిపించి నదరు (దిష్టి) తగులుతదని అందుట్ల బొగ్గుతుకుడేసింది. దీన్నేవరు మోసుకపోవాల్నని మాయమ్మ సోచాయించపట్టింది. నేను ఇంత పనిల ఆసరగావాలే అనుకున్ననేమో 'ఓయమ్మ నేను మైయప్పకు రొట్టె తీసుకపోతనే నీవు కూలికెల్లు' అన్న. ఇగ మాయమ్మ మొఖం జూడాలె ఐదు పున్నాల సందమామలు ఒకనాడొచ్చి ఎన్నెల రాలినంత సంబరం.

'పోతవాకొడుకా మాయమ్మ గద మెల్లెగవో కొడుక' అని పొయికాడికురికి రొట్టెపెంచుకున్న మసి ఏలుకు అద్దుకొని తీసుకొచ్చి నా అరికాలుకు అరిచేతికి కంతల్ల దిష్టిచుక్క వెట్టి 'సడాకు పక్కపొంటి పో కొడుకా ముందల జూసుకుంటనడువ్ తట్టుతాకి కిందపడతవ్ నిమ్మలంగ ఎదార్దంగా కుదార్దంగవో నాయనా' అని తీరొక్క ఉపాయం జెప్పపట్టింది. 'ఎవరైన తాతొర్సమామొర్స అయినోల్లు నగువాటుకు అక్కడిక్కడ జూడమంటె కూడా సూడకు నాయన' అన్నది. ఇగ నెత్తి మీద రొట్టె మూట వెట్టుకొని బాట పట్టిన. మాయప్ప నన్ను చూసి తెగ మెచ్చుకుంటడని, మనుసులో తల్సుకుంట ఎప్పుడు సేనికి జేరి మాయప్ప కంట్ల పడాలనే ఉబలాటంతో బిరాబిరా నడుస్తున్న. సడాకు దాటి పిల్ల బాట వట్టిన. గడ్డ ఎక్కి దిగుట్ల తలారి సామేలు తాత నన్ను జూసి పరేషాన్ అయిండు. 'ఏం మనుమరాల మీయప్పకు రొట్టెదీస్కపోయేంత దానివయినావ్ పైలంగబోల్యాగ' అన్నడు. 'అయితాయనే తాత' అని బదులు చెప్పిన. బాట పక్కపొంటి పెద్ద నల్లరాయి ఒకటుంటే దాని మీద సల్లసెంబు జెరసేపు వెట్టి, నెత్తిమీద రొట్టె సద్దిని దించి అటు ఇటు జూసి నీల్గిపోయినట్లయిన చేతిని గట్టిగా ముద్చుకొనీ తెరుసుకొని చేతినటు ఇటు ఆడించిన. సెంబుల సల్లజెరంత నోట్లవోసుకుని మింగి సప్పరిచ్చి మూతిని తూడ్సుకొని మల్ల రొట్టెత్తుకొని నడ్సుడు సురువుజేసిన. జెర దూరం నడిసిన మామిల్లోల్ల అంతుమామ ఎడ్లను మేపుకొని అడ్డమొచ్చిండు. 'నీవేనా కోడలో

మీయప్పకు రొట్టె తీసుకుపోతున్నవా ఆహ! మొగులు మీద గద్ద కోడిపిల్ల నెత్తుక పోతున్నది జూడు' అన్నడు. 'నీ మామను పట్కనె పడేతు. జూటమాట్లు జెప్తున్నడు ఇట్లంటరని మాయమ్మ నాకు ముందే జెప్పింది. గందుకనే నేను మీదికి జూడలేదు సటసటా నడిసిన'.

రొట్టెల్ల అయింది. 'మాయప్ప ఆకలిగొని మొఖం ఇంటొంక వెట్టెనేమో'... అన్న మాయమ్మ మాటలు యాదికొచ్చినయి. ఇంక జెర బడబడ నడిసిన. మొత్తానికి సేనికి జేరుకున్న.

మాయప్ప ఇంకా అరక ఇడవనేలేదు. ఇంకా రొప్పుతూనే ఉన్నడు. నన్ను జూసి ఒక్క అంజల ఒరం మీదికి ఒచ్చినెత్తిమీది రొట్టెల మూటను సేతుల సల్లసెంబును తీసి కింద వెట్టిండు. 'మాయమ్మ సరిగ్గా రొట్టెలు తినేయాలకు రొట్టె దెచ్చిందిరో' అని సంబరంగా అన్నడు. తర్వాత కోపం తెచ్చుకొని 'మీయమ్మ తీస్కరాక నీతోనిపంపినాదిరా!' అన్నడు. 'మాయమ్మనే ఒచ్చేది గుత్తల కూలి ఆఖరి దినం ఈ పొద్దు కూలి ఇస్తరంట. అల్లంత జెప్తుతుంటె విని నేనే తయారై రొట్టె తీసుకొచ్చిన. అట్లనే మన సేన్ను జూతమని' అని వెంటనే బదులిచ్చిన. కండ్లు పెద్దవిజేసి సంబరంతో నన్ను 'మాయమ్మ నెత్తిపెద్దది గుండెపెద్దది మాయవ్వలాక' అని పొల్చుకున్నడు. ఇద్దరం తిన్నం. తినుడు అయిపోయినాక ఈన్నే సెట్టుకింద గూసో కొడుక అనిచెప్పి మాయప్ప మల్ల అర్కగట్టిండు.

'మాగిపొద్దు (మాగమాసం పొద్దు) బుర్రున మూకుతది. ఈ పొద్దు నడిం ఒరం దాటకొడితె రేపు మద్దిబిల్లను మొదలు వెదుత' అనుకుంట మాయప్ప రొప్పుతుంటె సెట్టుకింద కూసున్న నాకు సరిగ్గా కనపడకొచ్చింది. అంతట్లనే శాయమ్మా... ఇక్కరారా అని పిల్సిండు. దగ్గరుండి ఎట్లరొప్పుతున్నడో సూడొచ్చునని ఉరికిన. 'అరే... గుంటుకుకొయ్యలు భూమిలకు సరిగ్గ దిగకొచ్చినయి. రాయి బరువు వెట్టినగాని



పొందకొచ్చె. మాయమ్మగద గుంటుకు కొయ్యలు గట్టిగ పట్టుకొని కూసో ల్యాగ అన్నడు. మహాసంబరంగా ఒప్పుకున్న. ఇగ లంగను గోసివోసిన రొండు జడలను ఎంటుకు మడ్సి కల్పికట్టి గుంటుకు మీద కూసున్న. గిప్పుడు భూమిలోపలికి దిగే కొయ్యలు స్పష్టంగా కనిపిస్తున్నయి. నా బరువుకు ఇంకొంత లోపలికి దిగుతున్నయి. లోపలి నీటి పదను గుంటుకు మీద కూసున్న. గిప్పుడు భూమిలోపలికి దిగే కొయ్యలు స్పష్టంగా కనిపిస్తున్నయి. నా బరువుకు ఇంకొంత లోపలికి దిగుతున్నయి. లోపలి నీటి పదను గుంటుకు కొయ్యలకు తగిలి మెత్తటి పచ్చిమన్ను కమ్మటి వాసనతో వెచ్చగా పైకి పొంగుతున్నట్లె పైకొస్తున్నది. ఆ మన్ను మీద మొలిసిన గడ్డి మొలకలు వేర్లతో సహ పెకిలిపోతున్నా నాకు బాధకలగకొచ్చె. పంట మొక్కలు నాటనీకెనే గదా గడ్డి మొలకలను తీసేసేది అనుకున్న. అంతట్లనే మాయప్ప 'కిందికొంగి సూడకురా కండ్లల్ల మన్నుజిట్లగల్ల' అంటే ఆలోచన నుండి బయటపడి తలపైకి లేపి ముందుకు సూడపట్టిన. కొంత సేపటికి గుంత భూమి ఒయ్యి గడ్డ భూమి వచ్చింది. ఇగ బరువు అవసరంలేదు.'నీవు దిగి మద్ది సెట్టు నీడకు కూసో కొడుక' అంటే దిగి గోసిడిసి సెట్టుకిందికి పొయ్యి కూసున్న.

ఇంక గాలిలో ఒక్కొక్కదిక్కు నుండి ఒక్కొక్క కమ్మటి వాసనలు వస్తున్నయి. ఎడమ బందుకు కాతకు సిద్దంగా కొమ్మల నిండ పూతతో కందిసేను ముదురు ఆపచ్చగా నిగనిగలాడుతూ పచ్చి కందికాయ వాసనను పంపుతున్నది. మంచి బందుకేమొ పొట్టతో ఉన్న పచ్చజొన్న సేను నిండా సరసరా ఆకులను ఊపుకుంటా పచ్చికాపిల్ల వాసనను పంపుతున్నది. నేను ఆ వాసనను పసిగట్టి మెల్లగ జొన్నసేండ్లకు పోయిన. జొన్న ఆకుల మీదున్న జొన్న జిగి ఒక్కొక్క దగ్గర ఒక్కొక్క రకంగా ఉండి నన్ను తన దగ్గరకి పిలుస్తున్నట్లే వెళ్ళి చూసిన. కొన్ని ఆకుల మీద తియ్యగా చక్కెర రాళ్లలాగ, ఇంకొన్ని ఆకుల మీద ఎండపొడుపుకు దగదగ మెరుస్తున్న చక్కెర రాల్లు వజ్రాల్లా తలుక్కుమంటున్నయి. కనిపించినవల్ల ఒదలకుండ తినుడు మొదలుపెట్టిన. నీల్ల లాగున్న జిగి చేతికి అందకపోవడంతో ఆకులకు నాలుక వెట్టినాకిన. అట్ల సాలుసాలుకు మునుం బట్టి వెతికి మరీ తిన్న. అట్లా నాకుతూపోయిన. ఆ రుచిలో ఎంతసేపు అయిందో మర్చేపోయిన. నడినెత్తిపొద్దు కిందికి దిగింది. శామమ్మో... అన్న మయప్ప పిలుపుకి జొన్నసేండ్లకెంచి ఒక్క గంతుల ఒరంమీద నిలవడ్డ 'ఏందేప్ప ఇక్కడున్న' అని సెప్పిన. 'ఏంజేస్తున్నవురా జొన్నజిగి నాకుతున్నావ్ నాలుక పగులుతది. రొట్టెతిన నియ్యది కారమంటితే మండుతది బిడ్డ జొన్నాకులు నాలుకను కోస్తయ్ పైలం' అని జెప్పిండు. ఈ సంగతి నాకు ఎరికే కని కమ్మగున్నదికదా! ఒదలబుద్దికాలే అని మనుసులో అనుకున్న. అంతంట్లనే 'నేను సీకటి పడ్డదాకుండి గుంటుకు గొట్టి మద్దిబిల్ల పొతం జేస్త ఎలుగుండంగనే నీవెల్లుకొడుక' ని మయప్ప కాలైన రొట్టెగిన్నెలు అన్ని ఒక్కదగ్గర సర్ది మూటగట్టి నానెత్తిమీద పెట్టి పైలంగ ఎట్ల పోవాలో ఇగురం జెప్పిండు. ఎడ్లకాడి పిల్లలు సడాక్ నిండ పోతుంటే వాల్లెంబడి ఇంటికి జేరిన. గుత్తల పని ముందే ఒడిసినట్లున్నది. మయమ్మ పొద్దు మూకక ముందే ఇంటి కొచ్చి నా కోసం తొవ్వలకడ్డ మొచ్చింది. నెత్తిమీద కాలి సద్దిమూటను తీసుకొని, ఎట్లెట్ల పోయినవో అడిగింది. 'నిన్ను పంపినందుకు మీ యప్ప నన్ను తిట్టెనా' అని అడిగింది.

'లేదేమ్మ నేను జెప్పిన గదా ఈ పొద్దు ఆఖరి కూలి పనికి పోతవని ఏమి అనలేదు' అన్న. మాయమ్మకు అన్ని మైయమ్మ లెక్కలే అని రెండు సేతులు నా చెంపలనద్దుకొని అక్కెర తీసుకున్నది. మయమ్మ చేతివేల్లన్ని ఫటఫటా సప్పుడొచ్చినయి. మాయమ్మ పానమంత నా మీదనే అని యమ సంబరపడ్డది.

సొమ్మసిల్లి నందుకేమో జెల్దిన నిద్రపోయిన మైయమ్మ లేపి రొట్టెతినవెట్టింది కూడా సరిగ్గా ఎరుకలే.

✣ ✣ ✣

ఇంకాకోడికుయ్యాలేదు మైయమ్మ నన్ను లేపపట్టింది. జెల్దిన్నే లేసిన. బయటికి తీసుకుపోయి బొగ్గును కడిగి సేతికిచ్చింది. 'సటసటా పండ్లు తోము జెడలేస్త' అన్నది. ఎందుకో నాకు ఏం అర్ధంకాలే ఎందుకే ఇప్పుడు లేపినవు అని అడిగితే లాజిగా (గట్టిగా) మాట్లాడకు అన్నది. మైయమ్మ అట్ల చెప్పెటాల్లకు నాకు జెర బుగులై నిద్ర నుండి తేరుకున్న. సటసట మొఖం కడిగి ఇంట్లకొచ్చి చూస్తే మాయప్ప ఎప్పుడో లేసిండు. కొటింట్ల పెట్టెల ఏవో కాయితాలు, బట్టలు సర్దుతున్నడు. నేను ఏం మాట్లాడకుండ పోయికాడున్న మాయమ్మ దగ్గరకు పోయిన. ఒస్తివా మాయమ్మ అని పొయికింద కొరకాసులు లోపలికి ఎగనూకుకుంటనే జెడలిప్పమన్నది. ఎందుకో ఈ హడావిడి అన్నట్లు మల్ల మైయమ్మ మొఖం జూసిన. నన్ను సంజాయిస్తున్నట్లు నెత్తి ఊపింది. అయితాయె అన్నట్లు నేను నెత్తి ఊపిన. రొట్టె సద్ది కట్టుడు అయిపోయినంక నాకు జెడలు

వేయడం మొదలెట్టింది. 'బారెడు బారెడు ఎంటికలు దినాం ఎట్ల దువ్వకుంటదో ఏమో పిల్లకెంత తిప్పలైతదో అని గుణిగింది. వేరే పిల్లలతో కొట్లాడకుండ ఉండు. అందరితో దోస్తాన్ జెయ్యి ఒకరికొకరు జెడలు వేసుకోండి' అని జెప్పింది. అప్పుడు తెలిసింది నేను హాస్టలుకు చదవనీకే తాడూరు పోతున్నానని. 'నేను పోనీకింక రెండు నెల్ల దినముండె గదనే ఇప్పుడే ఎట్లపోవాలె' అని అడిగిన. అప్పుడే మా సంగవ్వ లేపినట్లే నిద్రలేసి మాట్లాడపట్టింది. 'ఆల్లకు గత్తరరాను, ఈల్ల మొలతాల్లు తెగి మోతుకు సెట్టుమీద పడ, ఈల్ల గుద్దనోరిడ. మా మీద కన్నువెట్టింద్రు, ఎవడో ఎనుకటికి వెట్టింద్రంట, అది ఇప్పుడు మేం జెయ్యాల్నంట అది దేవుడే వెట్టిండంట, ఆ దేవునింట్ల ఎత్తి ఏడు దోసిల్ల మన్నుబొయ్య ఆ దేవునికి సాలులేదా, మేం ఏం పాపం జేసినం, నా పిల్ల జిందగిని పాడు జెయ్యనీకె యమినోల్ల తీరుగ ఎగపడ్డరు' అనుకుంట కుమిలి కుమిలి ఏడ్వపట్టింది. మాయమ్మ గప్పున మా సంగవ్వ దగ్గరికి పోయి రెండు భుజాలు గట్టిగ పట్టుకొని 'ఇది ఏడిసె సమెముకాదు. నీవిట్ల గట్టిగ ఏడిస్తె మందింటరు. ఆ నోట ఈ నోట పడి పెద్దోల్లదాక పోతది. ఆల్లకు తెలిసిందంటె తండ్రి బిడ్డ ఊరుదాటుడు కాదు. ఏడ్వకు మైయమ్మగద జెర మనుసు గట్టిగ జేసుకో అన్నది. 'ఎందుకేమ్మ ఏడుస్తవ్! మన దేవుడు మనెంబడే ఎంతదాక శాతనైతే అంతదాక పోదంగాని నా పిల్లను సెరలవెట్టను. అయితాయెనా' అన్నడు మా సంగవ్వ ఒక్కసారి నెత్తి మీదికి లేపి మమ్ముల జూసింది. ఎర్రగా సింతనిపుకలోలే మెరుస్తున్న కండ్లను తూడ్సుకుంట 'గంతెకొడుక నా బొడ్డుకాడి మాటజెప్పితివి. మనకాందాను (మన వంశానికి)కు ఈ పని జెయ్యనీకే కుదురది. మాయమ్మ మా అవ్వ, ముత్తవ్వలు ఎవ్వనితోని ఏలెత్తి సూపెట్టించుకొనలే. ఆల్లు ఎంత బలిమి జేసిన ఈ పనికి ఒప్పుకోకు ఆకర్కి కత్తినీమెడ మీద వెట్టినా నీ మాట మీద నీవుండాలె కాందాన్ ఇజ్జత్ నిలవెట్టాలె కొడుక' అన్నది.



ఈ రస రస ఏందో ఒక్కటీ అర్థంకాకొచ్చె. ఇపుడడుగుదమంటె మనసొప్పకొచ్చింది. మెల్లెగ వాల్లే జెపుతారులే అనుకున్న కని మనసు ఆగకొచ్చింది. ఆల్ల మాట్లను ఇనుకుంట ఉన్న గంతె. కాని నా గురించి ఊర్లో ఏమో అనుకుంటున్నరు. అది పెద్ద పరిక్కంపేనే ఉన్నట్లున్నది. గందుకె మావోల్లు గింతగానం దదుసు కుంటున్నరు. అని మాత్రం అనుకున్న.

'ఇదంత అంగలార్సుకుంట కూసుంటే తెల్లారుతది జెల్ది బయటపడుండి' అన్నది మైయమ్మ. మైయప్ప ఉతికిపెట్టిన తెల్లపంజ, అంగి తొడుక్కున్నడు, పొడుంగీతల రుమాలి, నల్లగొంగడి బుజంమీదేసుకున్నడు. ఒక సేతుల బస్త, ఇంకో సేతులగెంట్లకట్టే పట్టుకున్నడు. మేం పొయ్యేటపుడు మైయప్ప సంగవ్వ కాల్లు మొక్కిండు, నన్ను మొక్కమన్నడు నేను ఒంగి సంగవ్వ కాల్లమీద పడిన 'సల్లగ పొయ్యిరండి కొడుక పొయిన పని నిద్దగావాలె దేవుడా' అని దీవించుకుంట మొక్కింది. మైయమ్మనేమో మాతమ్మున్ని, మాయన్నను నిద్రలేపి 'సెల్లెలు హాస్టలుకు పోతున్నది సాగనంపుదురులేవుండి కొడుక' అని వాల్లతో నాకాల్లు మొక్కిచ్చింది. మాకు 'జతునం' (జాగ్రత్త) అని చెప్పింది.

ఇక సలి సప్పుదు లేకుండా ఊర్లకెంచి బయటపడినం. అప్పుడు మూడు జాముల పొద్దు అయింది మొగులుమీద సుక్కపొదువలేదు, గొర్తికొయ్యలు సెక్కుజెదరలేదు. పండోలె వెన్నెల కాస్తున్నందున తొవ్వబాగానే కనిపిస్తున్నది. మైయప్పముందల నేను వెంట నడుస్తున్నలేదు. మాయప్ప నడుస్తున్నడు నేను ఉరుకుతున్న. అవిదారులు కావు ఒరిసేన్లల్ల ఒరాలు పచ్చిపచ్చిగ బురుద బురుద ఉన్నాయి. సేంద్లల్ల కప్పలు బెక బెకమంటున్నయి. మేం నడుస్తుంటె ఒరాల మీదున్న కప్పలు నీరు కట్టెపాములు సేంద్లకు దుంకుతున్నయి. తెల్లారెటాల్లకు ఊరి పొలిమెరను దాటాలె, మంకునూరు తామర పూల చెరువును దాటి మైలు పోవాలె. గప్పుడు తాడూరుకు పొయ్యే బస్సును అందుకుంటం. బడ బడా నడుస్తూనే ఉన్నం మధ్య మధ్యన తగిలే నీల్ల కాలువలను మైయప్ప ముందు బారెడు అంజతోదుంకుతున్నడు. ఎంటకెల్లి నా చేయిని పట్టుకొని దాటించుకుంట పైలం కొడుక, బద్రంకొడుక అని జెపుతున్నడు. మొత్తానికి బసొచ్చె సమయానికి రోడ్డున్నంచేరుకున్నం.

పొద్దుగాల (ఉదయం) పూట నాష్ట తిననీకె గిన్నెలు పట్టుకొని సాలుకట్టి పిల్లలందురు నిలబడ్డరు వార్డెనమ్మ రానీకె ఇంక సమయం పడుతదన్న సంగతిని పిల్లలనడిగి తెలుసుకున్నడు మైయప్ప. యాపసెట్టు కింద కూసొని తెచ్చుకున్న సద్దివిప్పి తిన్నం. అంతట్లనే వార్డనమ్మ ఒచ్చింది. మైయప్ప ఆమె కూర్చున్న కుర్చీ దగ్గరికెల్లి ఒంగి రెండుకాల్ల మీదపడి మొక్కపట్టిండు. 'అయ్యయ్యో ఎందుకిట్ల మొక్కుతున్నవయ్యా ఏమిటో చెప్పు' అని అడిగింది.

'అమ్మా మా బిడ్డకు తల్లివి తండ్రివి నీవే గిప్పుడు నా బిడ్డను నీవ్వే ఆదుకోవాలె మేం ఆమెను కన్నంగాని ఆమె నశీబును కనలేదమ్మా ఇపుడుగాని నీవు కనికరించినట్లయితే నా బిడ్డ రదంల పడకుంట ఉంటది. అంతా నీ సేతులనే ఉన్నదమ్మ. ఇంతకుముందు పై నుండి పేరు రానీకె రెండునెల్ల సమయం పడుతది అన్నరు. కాని ఇప్పుడు ఊర్ల ఉండి పేరొచ్చినపుడు రానీకె సందులేదు. మేం ఉందమనే ఉన్నం గదమ్మ కాని మావూర్ల పెద్దకులపు పటేండ్లు అంతకూడి నా బిడ్డను జోగిన్ని చేయాలనే పాపపు నిర్ణయం చేసింద్రు. నేను నా బిడ్డను చదువుకు పంపుతున్నన్న సంగతి తెలిసి నన్ను పిలిసింద్రమ్మా' అని అక్కడ జరిగింది జరిగినట్లు పూసగుచ్చినట్లు సెప్పపట్టిండు మయప్ప. 'ఓరి సెంద్రిగా నీ బిడ్డను చదువుకెందుకేస్తున్నవురా ఊరి పద్ధతి నీకు తెలవదారా రేపటినాటికి ఊరికి ఏమన్న కీడు అయితె ఎట్లరా? ఎనుకటి నుండి నడుస్తున్న 'సిరాస్త' (ఆచారం)ను నడుమంత్రాన ఆపితె ఎట్లరా అన్నడు పటేలు. పటేల మీకు తెలవందేమున్నది నాకున్న ఒక్క బిడ్డ జోగిని అయితే జిందగి నిలవడది. మన సుట్టుపక్క ఊర్ల మాల మాదిగ పోరగాల్లనందర్ని (సాలె) బడికి పంపుతున్నరు. పెద్దోల్లనిద్దర్ని జీతంలనే ఉంచితి. గీమెనన్న సదువుకు పంపుదమని సోచాయిస్తున్న' అన్నడు మైయప్ప. అంతే దొర మొఖం కండ్లు ఎర్రగ జేసుకొని 'మేం చెప్పేది నీతో ఇవన్ని సంగతులు వినదానికారా? ముందు నీ బిడ్డను జోగిన్ని జేస్తవా లేదా అదొక్కటి చెప్పు చాలు. ఈ ఊర్ల మేం చెప్పినమంటేనే ఇది ఊరుమాట. ఊరు మంచి కోసం చెవుతున్నం. రేపటి నాటికి మనూర్ల సావులు జరగొచ్చు. రోగాలు రావచ్చు, పంటలు పండకపోవచ్చు, కరువు రావచ్చు. అప్పుడు ఏం శాంతిజేస్తేమున్నది. ముందు మనం సరిగ్గా వుంటే దేవుడు మనల సక్కగ జూస్తడు. రేపటి ఊరడమ్మ పండగకు రంగమెవ్వరెక్కుతరు? పోలెపల్లిలో 'సిడె' ఎవరు కద్తరు? మనూర్ల జోగుకిడిసిన లస్మి (లచ్చి) ముసల్దయింది. దానికి కొలుపుజెప్ప నుడుగులు దొల్లకొచ్చినయి. ఊర్ల

శానామందికి అమ్మవారు పోసినపుడు ఊరడమ్మకు జీవులను, దున్నపోతులను కోసి పెద్ద పచ్చితునకను జోగిని నోట్ల వేలాడదీసి ఊరుసుట్టు దీపాలంటే ఏడ వషవద్దది. ఈ ముసల్దాని కాల్లు సుట్టుకపోయి వరిబందాలల్ల సుట్టుకోని దిమ్మరపోయిపడ్డది. రంగమెక్కడానికి ముందు దినం నుండే ఉపవాసముండి ఊరడమ్మకాడ కుండమీదెక్కి నిలవడి రంగమెక్కి కొలుపు చెప్పాలంటే అట్లట్లనే ఆయె. ఇంగ 'శిడ' ఎక్కాలంటె దీనితరమయితదా? యాడయితది. పడుసుపోరీలె ఆగం గాపట్టిరి. ఇదంత గాదురా ఇంకో పిల్లను జోగుకిద్వాలె. ఇప్పుడే జోగు లస్మి బతికుండంగనే కొలుపు, పాటలు, పద్యాలు, పద్దతంత జెప్పియ్యాలె. ఈ కార్యం ఎంతజెల్డి జర్గితె అంత మంచిదిరా. ఊరికి రేపటినాటికి కీడు జరిగితే ఎట్లాకీడు జరగకుండా మీరు మేము జూడాలే. అట్ల చూడకుంట సదువుకు పంపుత అంటే ఎట్లరా? నీవు జెయ్యాల్సిన పని నీవు జెయ్యకుంటె, నేను జెయ్యాల్సినపని నేను జెయ్యకుంటె పాపం తగుల్తది. ఎవని నొసట ఏది రాసి వుంటె అది అయితది. మద్యల మన మెవరంరా మార్చనీకె. చేతివేళ్ళన్ని ఒక్కంతకులేని సంగతి ఎరుకెకదరా!' అన్నదమ్మా అని కండ్లకు గట్టినట్లు చెప్పిండు మయప్ప. మల్ల వార్డనమ్మతో 'అమ్మా. ఈమె చదువి పెద్దగయితె ఏమయితదో ఎవరికెరుక ఏమన్నగానీ చదువుకున్నంక తన తెలివి, తనమాట, తన జిందగీ ఏమన్న గాని గిప్పుడైతే హాస్టల్ల జేర్చుకో' అని మల్ల కాల్లు మొక్కిండు. వార్డనమ్మ అంత విన్న తర్వాత 'గవర్న మెంటు జోగిని పద్ధతిని నిషేధించి ఎంతో కాల మైంది వీరికి తెలియదా! మూర్ఖుల్లా ప్రవర్తిస్తున్నా రెందుకు? సరె చెంద్రయ్య అమ్మాయిని హాస్టల్లో ఉంచుకుంటాను, స్కూలుకు పంపుతాను నీవు వెల్లి నిచ్చింతగా ఉండు వాల్లు మల్లి నీ బిడ్డను ఆస్టలుకెల్లి తీసుకురా జోగినికేద్దాం అన్నరనుకో నీవు సక్కగా ఇక్కడికొచ్చెయ్ వాల్లమీద పోలీసు కంప్లేంటు ఇత్తం. నీవొచ్చెయ్ సరేనా' అంటు సలహా ఇచ్చింది వార్డెనమ్మ.



'అయితాయెనమ్మ నిశావ (నీసహాయం) ఉంచుకోనమ్మ మీ యింటి ముందు జీతముండయినా తీర్చుకుంట. జీతగాల్లు గావాలంటే చెప్పమ్మ, లేకుంటే తోడెం (కొన్ని) దినాలుండి మీ భూమి దున్ని పోత. ఇంతట్లయితేరెండుకట్ల సొప్ప తీసుకొస్త బర్లు పాలిచ్చేవున్నయి గదమ్మ మీ దగ్గర ఎంత మేత ఉన్నా సాలది.' అన్నడు ఆ... సరే సొప్పయితే తీసుకురా అన్నది వార్డనమ్మ. మల్లోసారి నడుం మొత్తం వంచి దండం పెట్టి బయటి కొచ్చిండు. నేను ఎంబడే వచ్చిన. నా నెత్తి మీద చెయ్యిపెట్టి 'మాయమ్మ నసీవుమంతురాలు' అనుకుంట మంచిగ సదువుకో బేట జతునం అని చెప్పి నేను వోత మల్లనేను ఆల్ల కంట్లెపడాలె' అని గొంగడి భుజం మీదేసుకొని నెత్తికి రుమాలి కట్టుకొని బిరా బిరా మైయప్ప వోతుంటె అట్లనే చూసుకుంట నిలవడిన.

నాతో ఎప్పుడెప్పుడు మాటకలుపాలని ఎదురు చూసుకుంట కొద్ది దూరంలో నిలబడ్డ ముగ్గురమ్మాయిలు దగ్గరకొచ్చింద్రు. నేను వాల్లతో కలిసిపోయిన. పగలంత ఆటపాటలతో చదువుతో గడిచిపోయేది. రాత్రికి రాత్రికి అమ్మ, తమ్ముడు, అవ్వ అన్న యాదికొచ్చేది. ఒంటరిగ నిద్రబోయే అలవాటు లేదు. మయమ్మ కదుపుల ఎచ్చగ పండుకొనేది. ఒంటికొస్తె మైయమ్మ లేచేది. సంగవ్వ, లస్మవ్వనేమో పుల్ కథలు చెప్పేది. బయట పండుకున్నప్పుడు మొగులు మీద సుక్కలు లెక్కవెట్టేది. సుక్కల్లో గొర్తికొయ్యలు, పట్టెమంచం పిల్లలకోడి, తేలు కథలు జోరుగానే నడిచేవి.

హాస్టల్లో సాయంత్రం అన్నాలు తిన్నాక ఎవ్వరికొచ్చే కథలు వాళ్ళు చెప్పేది. మాయవ్వోల్లు చెప్పిన కథలన్ని నేను పిల్లలకు చెప్పేది. కొంతసేపు చదువుకొని, బిస్తర్లు పరుసుకొని ఆడికీడికీ సాలు (వరుస)గా పండుకొనేది. వాచ్‌మెన్ "అందరు నిద్రపోండి" అన్నవెంటనే నిండ దుప్పటి కప్పుకునేది ఇంటికాడి సంగతులన్ని మనుసులకు వచ్చేవి. ఒక్కసారే వీపుల జర్నుకుంట కడుపుల బుగులు జొచ్చేది. అది ఊర్ల మాయప్పను పటేండ్లు ఏమంద్రో, కొట్టిరో తిట్టిరో ఏమవస్తవెడుతున్నరో మైయమ్మ, సంగవ్వ, తమ్ముడు, అన్న ఎంతేడుస్తున్నరో అనుకుంట ఎప్పుడు నిద్రపోయేదాన్నో నాకే తెలువదు. నిద్రలో కూడా పీడకలలొచ్చి దిగ్గున లేసి కూసునేది. మావోల్లమీద పానంబద్దది. ఒక్కసారి సూదాలని పిస్తున్నది. 'ఏంటమ్మాయి జ్వరమేమన్న ఒచ్చిందా ముఖం అంతా నీరసంగ ఉంది. కండ్లు ఎర్రగయినయి.' అని పనిమనిషి అడిగింది. నేనే బదులు చెప్పలేదు. ఏం చెప్పాలో తెలువక ఏంకాలేదని నెత్తి ఊపిన. కాని కదుపులకెల్లి ఏడుపు తన్నుకొస్తున్నది. ఏడిస్తే ఇంటికాడ పానం పెట్టినని ఇంటికి పంపియ్యగల్ల అనే బుగులుతో దుఃఖాన్ని దిగమింగు కున్న. అంతట్లనే 'అమ్మనాయిన యాదికొస్తున్నరా? ఇంక రొండు దినాలైతె నాలుగు దినాల సెలవులు ఒస్తున్నయి అందరూ ఇండ్లల్లకు పొయ్యొస్తరు నీవు పొదుపు రందెందుకు పిల్లా' అన్నది. ఈ ఇగురం బాగనే ఉన్నదని పించింది. ఇగ మా ఇంటికి పొయ్యేరోజున నిన్న వేసుకున్న జడలను రిబ్బన్లు మాత్రమే ఇప్పి మీద మీద దువ్వి ఇడిసిన పాతజడలనే మడిసి కట్టుకున్న. అన్ని పనులు బరబరా చేసుకొని పిల్లలతోపాటు బడికెల్లిన. పొద్దుమూకి బడిగంట కొట్టినంక మా అన్న గోటీలాడి గెల్చుకొని దానుకొమ్మని నాకిచ్చిన చిల్లర పైసలు లంగజేబిలేసుకున్న బస్సు కిరాయికని. హాస్టల్లిచ్చిన కొత్త పుస్తకాలన్ని బస్తల సర్దుకని మైయప్పకు జూపియ్యనీకే అని మెడసుట్టు వేసుకొని ఇంటికి బైలెల్లిన.

✤ ✤ ✤

"మాగమాసం జొన్నసేన్లు పొట్టకొచ్చినయి. కంకులు పొట్టలు విప్పుకొని ఎప్పుడు బయటికొస్తయా పొడుసుకొని తిందం అన్నట్లు సేన్ల మద్యలకేంచి దంట్లసుట్టు చేనుసుట్టు పిట్టలు గింగుర్లు తిరుగుతున్నయి. ఇప్పుడు కాదులే జొన్నదంట్లు ఈననీకె ఇంక సమయం ఉన్నదన్నట్లు దీమాగా కాకులు గుంపులు గుంపులుగా వెల్లిపోతున్నయి. కాని పిట్టల్లా గిరికీలు కొట్టట్లే. "సేను ఈని జొన్న కంకులు బయట పడ్డంక ఉన్నది అసలు తిప్పలు ఈ రొండు దినాలల్లనే సేను నడుమ మంచెయాలె. ముందే సడాక్ పక్కపొంటి సేనున్నది. సేండ్లనేమో దోస తీగెలు దండిగ పడ్డయి. దూల్లకాడి పోరలు పుట్ట పండ్లకెగపడుతరు. జొన్న దంట్లు ఇరిగెటట్లు ఉరుకుతరు అట్టిట్లపడి మంది కాపిల్లకోసం జూస్తరు. ఓ మనిషి కనిపెట్టుకొని సేనొంకలనే ఉండాలె ఇగ మాసంగవ్వకు రొండు నెలలదాక పెద్దకొలువు సేనుకాడనే ఉండాలె ఇంటి నుండి ఎవరో ఒగరు రొట్టె సద్ది తీస్కపోవాలె.

'పొద్దెక్కుతనే ఉన్నది. జెల్దినవొయ్యి ఎలుగుండంగనే మంచెకు కట్టెలు సుదురాయించు కొడుక సెంద్రప్ప' అని మయవ్వ చెప్పుకుంట శాటకొయ్యలు తీసుకొని పోవట్టింది. 'అయితాయెనేమ్మ మంచెకు అడ్డం వర్సె వాసాలున్నయి గాని భూమిల పాతే నాలుగు గుంజలు లేవు. వాటిన్నెంకులాడాలె సిన్నాడ్క సేను ఒరంపొంటి తుమ్మసెట్లున్నయి గద

అందుట్ల రెండుంటిని కొడుత ఇంకేంది' అనుకుంట గొడ్డలి నిప్ప భుజం మీద వెట్టుకొని రుమాలి కొంగుల మయమ్మ కట్టిచ్చిన రొట్టెసద్ది కట్టుకొని ఎల్లిండు. ఊరు ఇంకా దాటనే లేదు. పటేల్ జీతగాడొచ్చి 'పెద్దప్ప నిన్ను పటేల్ రమ్మనెనే' అన్నడు మాయప్ప గుండెలు ఒక్కసారి జల్లుమన్నయ్. శామమ్మ కొరకే అన్నది మేల్తమయింది. ఊర్లది ఊర్ల ఎంతకని దాసుకుంటం! ఎన్నటికైనా ఎరకయ్యేదేగదా. ఏం జేస్త యాడికయితే ఆడికి గాని అనుకొనే సాలెకని హాస్టలుకు తోలిన అని పరిపరి విధాల సోచాయించుకుంటనే కొంతసేపటికి 'ఎందుకు కొడుకా' అన్నడు మయప్ప. జీతగాడు దిగులుగా మొఖం పెట్టి 'ఇంకెందుకే శామమ్మ సాలెగురించె' అని చెప్పి నా పని అయిపోయింది అన్నట్లు వెల్లి వోయిండు. మాయప్పకు ఏం జేయాల్నో పాలుపోకొచ్చింది. ఎంటకు మల్లి దారి పట్టిండు. తలారి పెంటప్ప అడ్డమొస్తె 'నన్ను పటేల్ రమ్మన్నడంట నేనువోతున్న మాయమ్మకు, నీ సెల్లలికి జెప్పే భావ' అని జెప్పి పటేలింటికి బాటపట్టిండు. దారిల ఎదురువడ్డోల్లు మైయప్పను దిగులుగా జూసుడువెట్టింద్రు అంతా ఆపరమాత్ముడి దయ అని రెండు సేతులతో ఆకాశానికి చూస్తూ మొక్కుతున్నడు. అందరిని కండ్లతోనే పలుకరిస్తు దీనంగా వోవట్టిండు. మొదట మాదిగకేరి దాటి, మాలకేరి దాటి తెలుగోల్ల బజార్లకేంచి నడి ఊర్ల ఉన్న పటేలింటికి వోయిండు. అక్కడ పటేలు ఒక్కడే ఉన్నడనుకున్నడు మాయప్ప. కానీ ఎస్.ఐ., సర్పంచు, అనంత్‌రెడ్డి, మాజీ సర్పంచు, చంద్రారెడ్డి, ముకుందం సావుకారి, బద్రప్పసేటు శ్రీరామ్ శర్మ పంతులు వీల్లంత ఏదో మీటింగ్ పెట్టుకొని కనిపించింద్రు. మాయప్పను చూసిన గెటుకాడి వాచ్‌మెన్ 'ఆగు చంద్రప్ప అయ్యలు మీటింగులన్నరు' అని ఆపేసిండు. 'దొరనన్ను పిలిపించిండు ఒక్కసారి ఆతనికంట్ల పడనియ్యి మాయప్పగద, మల్లనేను రాలేదనుకోగల్ల' అని బతిమాలి చెప్పిండు నీవు కూర్చో నేను చెప్పుత మద్యులవోతే కోపానికొస్తరు అన్నడు. ఆ మాటతో ఓ బందుకు కూసున్నడు. కూసున్న రెండు గంటల తర్వాత ఒక్కరొక్కరు కొందరు వెల్లిపోయింద్రు. పటేలు చంద్రరెడ్డి అనంతరెడ్డి శ్రీరామ్ శర్మ పంతులు మాత్రమే ఉన్నరు. వారు మీటింగ్ గది నుండి పటేలు రోజు కూర్చునే గద్దెమీదకొచ్చి కూసున్నరు. అప్పుడు వాచ్‌మెన్ వచ్చి 'సెంద్రప్ప పటేలు నిన్ను పిలుస్తున్నడు' అన్నడు సటుక్కునలేసి నెత్తి రుమాలు తీసి సేతుల పట్టుకొని సెప్పులు బైటనే బెట్టి లోపలకు వోయి 'దండం పటేల' అన్నడు. వాల్లంత చూసి చూడనట్లే అనిపించి ఏదో మాట్లాడుకుంటున్నారు. మైయప్ప సేతులు కట్టుకొని భుజాలు అన్ని బిగపట్టుకొని నిలబడ్డడు. పటేలు మైయప్పను కిందికి మీదికి ఒక్కసారి తేరిపార జూసి 'ఎక్కడ వోయినవు రా సెంద్రిగా అని అడిగిండు' ఎక్కడ లేదు పటేల జొన్నసేను పిట్టలకొచ్చింది కదా మంచేతమని గుంజలకోసం తుమ్మసెట్లు కొట్టవోతున్నా' అన్నడు మయప్ప. 'అరే నీకు తెలివి సానబెరుగుతున్నదిరా సెంద్రిగా నేను ఈ వొద్దుటి సంగతి గాదురా నీ బిడ్డను ఏడవెట్టొచ్చినవురా అని గదమాయించి అడిగిండు 'పటేలా నా బిడ్డను' అని చెప్పబోయిండో లేదో మాటకు మాట సమాధానం జెప్పనేర్చినావురా? మేం జెప్పింది నీ సెవుమీద పేనువారలేదురా ఏమనుకుంటున్నవ్ నీ మనసుల ఊర్ల మంచిగ బతుకాలని లేదా మేం సిలకకు సెప్పినట్లు జెప్పినా, అంత జెప్పంగా సదువుకు పంపినవ్ యాడ చదువుతదిరా సాకలిండ్లల్లా నీ బిడ్డను సదువుకు పంపినావంటెనే నీవు ఊరుమాట కాదన్నవ్. ఎంతధైర్యరానీకు' అని పటేలన్నడు. పటేలా పక్కూర్ల మాలమాదిగోల్ల పిల్లలు చదువబోతున్నరని తన చెల్లెండ్ల పిల్లలను సాలెకు పంపుతున్నరని మాయింటిది పట్టుపట్టి పంపింది దొర' అంటుండగనే నీకు నోరు ధైర్యం ఇచ్చినోడు ఎవ్వడురా? అని అనుకుంట ఉగ్రుడై అటు ఇటు ఏందొర్కుతదా అని చూస్తున్నాడు. పటేలుకు ఏది దొరకక వోయేటాల్లకు తన టేబుల్ మీదున్నపేపర్ వెయిట్‌ను తీసి మయప్ప మొఖానికి విసిరి కొట్టిండు అది సరిగ్గ వోయి మయప్ప పనకు (నుదురు) తాకింది. బలబలానెత్తు కారపట్టింది. అయినా మయప్ప అట్లనే నిలవడ్డడు. పటేలు కోపం ఇంకా చల్లారనేలేదు. మీ జాతికి ఎంతకొట్టినా భయం లేదురా ఎంత తిట్టినా సిగ్గుఎగ్గులేదురా అనుకుంట కట్టకింద నిలబడ్డ మైప్పనుకట్ట మీదికేంచె ఎదల తన్నిండు. మయప్ప ఎంట వున్న కట్టకు సాగిలపడ్డడు. వాన్నేంగొడుతవ్ ముందు జరగబోయే పని చూడు పటేల అని శ్రీరాంశర్మ గుర్తు చేస్తున్నట్లు చెప్పిండు. అయినా వీల్లననేం లాభం ముందు ప్రభుత్వానికి సిగ్గులేదు అందరికి సదువంట. అందరు చదివి ఊల్లేలితె పనెవ్వరు జెయ్యాలనో ఎవని వృత్తి వానికి ఉండనే ఉండె. మనది గ్రామ రాజ్యం అందుట్ల మంగలోడు, ఒడ్లోడు, సాకలోడు, మాదిగోడు మాలోడు ఎవరి కాయికం (వృత్తి) వారు చేయ్యాలె. ఈ జోగినిపని ఈ సెంద్రిగాని బిడ్డనే జెయ్యాలె ఈ సంగతి ముందే జెప్పినం. విన్నావురా? నీ మొండి పట్టు నీదేరా అయినా మీకేమయిందిరా పాపం పటేలు ఎంత ఓపికపట్టెగదరా... అని శ్రీరామ్ శర్మ బోదజేసిండు.



'పటేల వాడి నుండి రక్తశ్రావం బాగా జరుగుతుంది. ఎక్కువసేపు ఇక్కడుంటె ఈ జాగ అంత కంగాలయి (అపవిత్రమై)తది. వాడి పానం బోతె ఎట్ల ఇక్కడి నుండి తీపించెయ్యి మొదలు' అన్నడు శ్రీరాంశర్మ. ఈ సంగతి ఊర్ల గుప్పుమన్నది. పటేలు జీతగాల్లు ఇద్దరు నెత్తురునెత్తురయిన మైయప్పను కాళ్ళొంక ఒకరు, నెత్తొంక ఒకరు పట్టుకొని మోసుకొచ్చి బయిటేసింద్రు. ఆనోట ఈ నోట పడి మైయమ్మ, మైయవ్వ సెవుల్లవడ్డది. మా సంగవ్వ సెంచెత మాదిరిగా హాహా అని నెత్తినోరు మొత్తుకుంట ఉర్కొచ్చి ఆఖరికి మైయప్పను పట్టుకోని లబోదిబో మొత్తుకున్నది. ఎన్నో దేవర్లకు మొక్కంగ నీవు పుట్టినవు కొడుకా నిన్ను కొట్టసేతులెట్ల ఒచ్చెరా? చీమకు కూడా హానీ చెయ్యని తండ్రివి నిన్నుకొట్టనీకే సేతులెట్లఒచ్చెరా యా దొంగలు కొట్టిర్రా, ఆల్లసేతులకు కుష్టురోగం రాని ఆల్లని దొంగలు నరుక' అనుకుంటూనే ఏడుసుకుంట సుట్టపక్కల ఎందుకో నెంకుతున్నది. మైయప్ప నెత్తి ఒల్లోబెట్టుకొని చీరకొంగుతో నెత్తికి వడ్డపొక్కను ఒత్తిపట్టింది. అయినా నెత్తురుకారడం ఆగకొచ్చింది. మాయమ్మనేమో ఇదేం అన్యాలం దేవుడా మేమేం పాపం జేస్తిమి మేం బతుకగూడదా దునియల అనుకుంట పటేల్ ఎడ్లకొట్టం ఎనుకంగ ఉన్న నల్లగాయి పాకును బరుక్కొచ్చి గట్టిగ నల్సి నెత్తురొచ్చెగాయంల పిండింది. అయినా నెత్తురు ఆగకొచ్చింది పసరు పిండి పిండి పిప్పిని గూడా రంద్రంలనే పెట్టింది. సంగవ్వ గట్టిగ పట్టుకున్నది. మైయమ్మ మల్లుర్కిపటేల్ దిడ్డమూతొంక వోయి 'పటేలమ్మా తోడం నీల్లియ్యి ఇతనికి తాపుత నెత్తురాగకొచ్చింది' అన్నదో లేదో 'ఇక్కడొచ్చినవేమే నీ మొఖం మండ పటేల్ జూస్తే నన్ను జంపేస్తడు వో...వో...' అని దర్వాజ దన్‌మని మూసుకున్నది. ఒక్కసారి ఎంటకు మల్లి పటేలు ఉన్న పార్టీకి అపోజీషన్ పార్టీలో ఉన్న రామ్‌రెడ్డి పటేలింటికెల్లి

దిడ్డిమూత దగ్గర నిలవడి 'అమ్మా నీకాల్లు మొక్కుత తోడెం నీల్లియ్యి నోరెండిపోయి నాలుక ఎండిపోయి పిడ్సగట్టి మాట్లాడకొచ్చె నెత్తురంత కాల్వలాగ పోతున్నది. నీల్లియ్యమ్మా' అని బతిమిలాడింది మైయమ్మ. 'పటేలు పటేలు అని నెత్తికెక్కించుకుంటిరి గదనే అందరు ఓట్లేసి మా పటేల్ కెయ్యకపోతిరి అప్పుడు లేదాయే బుద్ధి గిప్పుడు నీల్లియ్యమనొచ్చినవు ఓట్లప్పుడు మీ మాల మాదిగిండ్లల్ల ఒక్కఇల్లు కూడా వదులకుండ తిరిగి సెపితి అందరు ఏస్తమేస్తమన్నరు ఎవ్వరెయ్యలే. గిట్ల కాలం అన్యాయానికి నడుస్తున్నది ఏంజేస్తం' అని బాదనంత ఎల్లవోస్తున్నది. 'అమ్మా తోడెం నీల్లియ్యమ్మా'ని మల్ల గుర్తుజేసింది మయమ్మ. 'నీల్లు నీల్లు అని అరుస్తవేందే నీల్ల పట్కనేపడేతు. యాడవొయ్యమంటూన్నవే నీల్ల సెంబు తీసుకురాకపోయినావు పొద్దు అన్నది. 'అమ్మా సెంబాడ తెత్తుదూరం ఇల్లు నేను ఇంటికి పోయేటాల్లకు అతని పానం పోతది నీ కాల్లు మొక్కుత నీ గులాపుదాన్ని నీవే ఏందుట్లనన్నవొయ్యి' అన్నది మయమ్మ. ఆడ సెంబట్క (దొడ్డికి)పోయే లోట ఉన్నది కొట్టం గూల్లె అందుకో పోస్తం అన్నది. మైయమ్మ గుండెలు పగిలినంత పని అయి పటేలమ్మ మొఖం జూసింది. అయినా మనది సమయం కాదని ఉరికిపోయి లోట అందుకున్నది నీల్లుపోసింది.



కారుతున్న లోటల నీల్లు పట్టుకొని ఉరికొచ్చేటాల్లకు నీల్లన్ని కారిపోయినయి లోటను భూమికిసిరి కొట్టి అటూఇటూ జూసింది మాయమ్మ అన్ని ఇండ్లు తలుపులు బెట్టి ఉన్నయి రెడ్డి, కోమటి వాడలు నిర్మానుష్యమైనయి. నీల్లు దొరికే జాడ ఎక్కడా లేదు. అప్పుడు మాలోల్ల కాశమ్మ కూలికిబోయి పగటిపూట పిల్లకు సన్నియ్యపోవట్టింది. మయమ్మను జూసి ఏమైందిసిన్నమ్మ ఏడుస్తున్నవ్ అని అడిగింది. మీ సిన్నప్ప నీల్లులేక సావు బత్కులల్ల వున్నడన్న సంగతి జెప్పింది. అయ్యో ఇన్ని సన్నుబాలన్న పిండుదాంపా... ఉరుకురుకు... అని ఒకర్నిబట్టక ఒకరు ఉర్కొచ్చింద్రు. మాయమ్మ చేతిని షారబడితే (అరచెయ్యి) కాశమ్మ తన పాలు పిండింది షార నిండింది నిండినట్లు మాయప్పనోట్లె బోసింది. అట్లా ఏడెనిమిది షారలు పోసింది. ఇన్ని పాలు గాయంల పిండింది. ఇగ ఆపు కొడుకా సంటిదానికి గావాలె అని మాయమ్మ జెప్పితే మల్ల 'షేపులొస్తయ్ ఇప్పుడైతే మా సిన్నప్పకుగానియ్యి' అని అన్నది. యమినోల్ల కంట్లబడ్తే ఇగ వున్నది నా కత అనుకుంట గోడ సందుల్లకేంచి ఉర్కింది కాశమ్మ. మెల్లగ నెత్తురు గడ్డగట్టింది. మాయప్ప కండ్లు దెరువకుండ దిమ్మరపోయి అట్లనే పడ్డడు.

లోపల టెలిఫోన్‌లో మాట్లాడి బయటికొచ్చిన పటేలు మావోల్లను జూసి 'ఏమో నీల్లు యాడ సంపాదిస్తిరే మీరెంత చాలు బాజీ ముండలే అందరీన్నే జమయి దండుగట్టింద్రేమే కొంపలన్ని మునిగినట్లు ఇవిటిని ఎందుకురా లోపలికి రానిచ్చింద్రు 'మీ మాల మాదిగోల్లను జీతం బెట్కున్నందుకు మీకు గేటు తెరుస్తరే. ఉండుండి మీ పని సక్కగ జేస్త' అని 'అరేయి మాదిగ లంజకొడుక వాని ఆడోల్లని పిల్లలను ఎందుకురా ఉండనిచ్చింద్రు మీ కులమాని ప్రేమ పుట్టినాదిరా ముందు ఇక్కన్నుంచి ఆల్లను సొప్పకుప్పల దొడ్లకు తీసుకపోండి. అల్లని ఆన్నే ఒదిలి మీరు బాయికాడికి పోండి' అని గదమాయించిండు పటేలు. అయితామె పటేల అని ఇద్దరు జీతగాల్లు మయప్పను మోసుకొని పోపట్టింద్రు. ఎంబడెంబడే మేం పోయినం మయప్పను సొప్పదొడ్డిల పండవెట్టింద్రు మయవ్వ మయప్ప దగ్గరకూసోని గట్టిగట్టిగ పిలిసింది. మయప్ప మెల్లెగ మూలిగిండు. మేమంతా సుట్టుకూసోని మయప్ప మొకంలకు జూస్తున్నం మయమ్మ తన కొంగుతో మొఖానికంటిన నెత్తురు మరకలను నోటితో తడి చేసి తూడుస్తున్నది. మేం అటొక్కరం ఇటొక్కరం కూసున్నం జీతగాల్లు పటేల్లొచ్చి ఏమో మాట్లాడెటట్లున్నడు యా యాల్ల అయితదో ఇప్పటికే నడిపొద్దు అయింది. 'మీరింటికి పోయేటాల్లకు యా పొద్దు అయితదో ఇదుంచుండి అని వాల్ల రుమాలి కొంగుల కట్టిన రొట్టె సద్దిని ఇడిసి మీ దగ్గర ఉంచింద్రి. పటేల్ జూస్తె మమ్ముల తిడుతడు.ఆ సొప్పుమొద కింద పెట్టుకోండి అని పొయింద్రు. మయప్ప మెల్లెగ కండ్లు తెరిసిండు. మమ్ముల సుట్టు మమ్ముల జూస్తున్నడు. నన్ను జూసి దిగ్గున లెవ్వబోయిండు. పెయిల కలుక్కుమని అమ్మా అని మల్ల పండుకొన్నడు. నన్ను దగ్గరకు రమ్మన్నట్టు చేతి ఊపిండు. 'నీవెందుకొచ్చినవురా నీ కోసమె ఈసెర' అని బిల బిల ఏడ్వపట్టిండు. మయమ్మ మయవ్వ కూడా కుమిలికుమిలి ఏడుస్తున్నరు. ఇంత గొట్టి ఇంటికి పంపియ్యకుంట ఈసొప్పదొడ్ల ఎందుకేసినట్లు ఎవరికి సమజి కాకొచ్చె ఏమైతేనేం మయప్పకు నెత్తురుకారుడు ఆగింది. కండ్లు తెరిసి మాట్లాడుతున్నడు. మా అందరికి కొంత నిమ్మలమైంది. ఇంక పటేల్ ఏంజెప్పబోతున్నడో అని దిగులుతో ఎదురు చూసుడే మేం చేయగల్గినవని. ఐదారుమంది గుంపుల్లాగ వస్తున్నరు. ఆ గుంపులో ఎస్.ఐ.తోపాటు ఊరి పెద్దలంత ఉన్నరు. ఆల్లందర్ని జూసి మయప్ప ప్రాణం జల్లుల వడ్డది. ఎస్ఐని జూసేటాల్లకు హాస్టల్ వార్డనమ్మ జెప్పిన మాటలు యాదికొచ్చి జెర్ర ధైర్య మొచ్చింది. పటేల్ మొఖంల గూడా మను పటంత కోపం లేదు. వాల్లు ఏవో కాగితాలు సేతుల పట్టుకొనొస్తున్నరు. మేమంత ఆల్లను జూసిన వెంటనే లేసి నిలపడ్డం. మయప్ప ముదురుకోని లేవనీకె జూస్తున్నడు. అమ్మా అమ్మా అనుకుంట నోటి పండ్లుగట్టిగా కొరికి పట్టి నొప్పిని ఆపుకోజూస్తున్నడు. పటేలు ఒస్తు ఒస్తునే 'సెంద్రిగా మేం చెప్పిన మాట్లు వినకుండ నా చేత దెబ్బలు తిన్నవ్ నువ్వు ఎంత మంచోనివో మాకు ఊరికి దెల్వదా! ఒకసారి నా ప్రాణం నీవే దక్కిచ్చినవ్. ఆ దినం సేనుకాడ నేను నీవు ఇంకా గాకుర్వ మల్లిగాదుండె. మల్లిగాదు దుల్లగట్టేసి నాకు క్యారేజీ తీసుకరానీకె ఇంటికొయ్యిండు. అదే సమయంల నలుగురు దారిదోపిడీ దొంగలు కందిరాసిమీదపడ్డరు. నేనడ్డంబోతే నామీదికి గొడ్డలి లేపింద్రు. అమాంతం బొయ్యి గొడ్డలి తీసుకొని అవతల్కి పడేసి నా ప్రాణం బచాయించినవ్. నీవు ఆల్ల సేతులకెల్లిగొడ్డలి దుసు కున్నది తడువేలేదు నాకు పారిపోనీకే సందుదొరికింది. ఎండిన కంది కట్టెల జొచ్చిన ఆల్లకు దొరకకుండ. ఇక నీ గెంట్లకట్టెతోటి ఒక్కొక్కన్ని సెదుగుదులాడిస్తివి. ఆ దొంగలు పత్తాలేకుండా పారిపోయింద్రు వెయిల నకంది రాసిని, నాప్రాణంను దక్కిచ్చినవ్. నేను ఊరందర్కి అప్పుడే జెప్పిన సెంద్రడు మొనగాడని. గిప్పుడు మాత్రం నీవు మొండికేస్తున్నవు ఎవరి మాటినకుండ కాట్కుడవైతున్నవ్. నీ మంచికే జెవుతున్న. భూమ్మీ దున్నన్ని దినాలు ఊర్ల అందరితో మంచిగుండాలే. నీవు ఊరుమాట మరవగూడది. ఇవన్ని సోచాయించకుండ నీబిడ్డని సదువుకేస్తనంటవ్, అయినా సదువు జదివితె ఏమొస్తున్నది. ఊరుగాని ఊర్ల నీ బిడ్డ ఎట్ల సదువ పోతది? ముందే దినాలుబాగలేవు ఊర్ల ఏర్పులకేస్తె మనందరి

కండ్లముందుంటది. సదివితే ఏమున్నదిరా సెంద్ర. జెర్రపెద్దగయితె ఎవ్వనెంబడన్న పోదని ఏం నమ్మకం, యా చాయకప్పులు కడిగెటోనెంబడోపోదని ఏం గ్యారంటి? అన్నడు.

మేం చెప్పినట్లు వినకుండా చేస్తెనీ యిష్టం ఇంత జరిగినాక నీవు మాత్రం ఈ ఊర్ల ఉండనీకె వీల్లేదు.' అన్నడు పటేలు. మయప్ప పులికి బెదిరిన సాదు జంతువోలే అదిరిపోయి మిగిలిన వారి ముఖాలు జూసిండు. అందరు ఔనన్నట్లు తలలూపింద్రు. మా సంఘవ్వ ఒక్కసారి హా...హా... అన్నది. సొప్ప పక్కకు నతికిన మయమ్మ 'మా ఇల్లు అరిపాయె దేవుడో' అని బోరున ఏడ్చింది. దొరలకు అందరికీ కోపం వచ్చింది. 'ఇవే ప్రతిదానికి లొల్లివెడుతున్నయిరా వీటిని నడుముల మీద దన్నుండి లెవ్వకుంట అడ్డం బడుతరు. కంత మీద కొడితే దెబ్బకు జస్తరు' అనేటాల్లకు గప్పున ఆగిపోయింద్రు. సెప్పేది జెర బాగ వినుండి మీ కోసం జెపుతున్నడు అని శ్రీరాంశర్మ మావోల్లకు బుద్ధి జెప్పపట్టిండు.



'చూడండి మీరేమనుకుంటున్నరో మాకుతెలువది. మేం ఒకటి జెప్పితే మీరు ఇంకోటి జేస్తున్నరు. మీ మంచికోసం జెప్తె మీకు నెత్తికెక్కకొచ్చింది. నేజెప్పేది సెప్పుత తరువాత మీ యిష్టం మీ బిడ్డను జోగినీకి వేయమన్నది నా కోసం కాదు ఊరుకోసం. ఊరు బాగుకోసం అంటే మీ మొద్దు మెదల్లకు అర్థం కావడంలేదు. ఇంక మీతో మాట్లాడే ఓపిక నాకు లేదు. మీ పోరిని వేస్తే జోగుకు వేయండి లేదా ఊరిడిసి పోండి. ఆ పని జెయ్యకుండ ఊర్ల ఉండనీకె వీల్లేదు. మొండికేసి ఉంట మంటిరా నిరుడు మాల జంగనికి పట్టిన గతే మీకు పడుతది. చూస్కొండి.' అనేటాల్లకు గుద్దేలుగు వద్ద మేకల మందలాగ గడగడా పనికిపోయింద్రు మావోల్లు. సూస్త సూస్త చెట్టంత మనిషిని ఒర్రంగ ప్రానం బోయిన జంగయ్య సజీవ దహనం కండ్ల ముందు కదిలింది. జంగయ్యను జంపినందుకు మాల, మాదిగోల్లకందిరికి దుక్కమొచ్చింది. కని ఎవ్వరు ఏడ్వలేదు. మంత్రాలు జేస్తున్నడని పసుపు, కుంకుమ, నిమ్మకాయలు వానింట్ల దొరికినవని గాంచుసూనెపోసి, రబ్బరు టైర్లు ఏసి కాల్చి చంపింద్రు. ఎవ్వరన్న ఏడిస్తే ఆల్లను కూడా మంత్రగాల్లంటరని దుఃఖాన్ని కడుపుల్ల దిగమింగింద్రు. బుగులు పట్టి సుట్టాలు, కడుపులపుట్టినోల్లు తోడ పుట్టినోల్లు కూడా రాలేదు. జంగయ్య సావు తర్వాత ఇట్లాంటి ఆగసావు ఎవ్వరికి రావొద్దని ప్రతి ఒక్కరు అనుకున్నరు. ఆడు బోలగాడు ఎవ్వరితో గింత మాట తెచ్చుకోలేదు. అని మైయప్ప ఎన్నోమార్లు అన్నడు. ఉపాసం ఉప్పిడి ఉండి కాయకష్టం జేసి జానెడు భూమి సంపాదిండు. ఆ భూమి మీద పటేలుకన్ను పడ్డది. జంగన్ని కడతేర్చిండు అన్న సంగతి అందరికడుపుల్ల ఇంకింది. కాని మంత్రగాడనేటాల్లకు ఎవ్వరికి నోరు రాలేదు. అదే గతి నీకు పడ్తది అంటె మా వోల్లకు ఒసుకుదు పుట్టింది. కండ్లు త్యాలేసింద్రు. అందుకే శానతనం జెయ్యకుండ ఈ కాయితాల మీద ఏలు ముద్ర ఎయిరా సెంద్రిగా అన్నడు. నిజానికి మైయప్ప మంచిగ రాస్తాడు, సదువుతాడు నాకు ముందు ఓనమాలు నేర్పింది మయప్పనే అంతే గాదు మా మాల మాదిగోల్లకు పోతులూరి వీరబ్రహ్మంగారి ఆటలు నేర్పే ఆటపంతులూ మయప్పనే. కాని పేరురాస్త అనలేదు. నా భూమిని గుంజుకోనీకే ఏలు ముద్ర వేయమన్నడు అన్న సంగతి మేల్లమయి. దిక్కుతోచకుండ అయ్యింది. ఇప్పుడు ఇది కాదు అంటే నా బిడ్డను జోగినికిద్వాలె అది కాదు అంటే భూమిని ఇద్వాలే. ఇప్పుడు మయప్ప పంగల నడుమ మేడికాయ అయిండు. ఏ ఆలోచనలు లేకుండా మావోల్లందరు నిర్వీర్యమయింద్రు. 'కానీయండి అవతల పనులున్నయి మీ కోసం ఎంతసేపు కూసోవాలె' అని నలుగురు పటేండ్లు ఒకసారే అన్నరు. వాల్లే మా నంగవ్వ, మయప్ప దగ్గరకొచ్చి వేలుముద్రలు ఒత్తిచ్చుకున్నరు. ఇగోబస్సు కిరాయిలు దీసుకొని పోండని పటేల్ మయప్పకు నాలుగైదు పచ్చనోట్లు ఇచ్చిండు. ఇప్పటి నుండి సడాక్ పక్కనున్న ఎర్రమడి బిల్ల మాదిగాదు. అద్క పక్కనున్న రాగడి మడి మాది కాదు. మాయి ముంతలు పాతిన మా ఇంటి వాకిలి మాదికాదు. గందు సున్నంబోసికట్టిన మంటిఇల్లు మాదిగాదు. కేరీలు మాదికాదు ఊరు మాదికాదు. గూడులేని పిట్టలమైతిమి' అని మాయవ్వ, మయమ్మ బజార్ల పొర్లాడి ఏడుస్తున్నరు. అయినా లాభం లేదు పెయిమీదున్న బట్టలతోనే కొత్తపేట బాటవట్నం. 'నిన్ను సదువుకేస్తనన్నందుకే గీగతి పట్టింది కొడుక మేం మా రెక్కలు గట్టిగున్నన్ని దినాలు కూలీనాలీ జేసి నీకు వెడుతం, నీవు మామీద రంది పెట్టకోకు. నీవు బాగ చదివి పెద్ద ఆఫీసరమ్మవుగావాలె అన్న మా వోల్ల ధైర్యం నాకు సదువు నేర్పింది. జోగినిని కానన్నందుకు భూమిని వొదులుకున్న నా బాల్యం మాయింటికి, కులానికి, నాకు రడమై నేటికీ సల్పుతుంటది.



# తస్మాత్ జాగ్రత్త!

సూరేపల్లి మనోహర్



వాడు
చూపుల్లో విషాన్ని కురిపిస్తాడు
మన కలల్ని బుగ్గి చేస్తాడు
అందుకే తస్మాత్ జాగ్రత్త!

వాడు
మాటల్లో ద్వేషాన్ని రగిలిస్తాడు
మనకాంక్షాసుమాల్ని మసి చేస్తాడు
అందుకే తస్మాత్ జాగ్రత్త!

వాడు
నవ్వుల్లో క్రూరరేఖల్ని దూస్తాడు
పచ్చని కోరికల్ని అగ్గిపాలు చేస్తాడు
అందుకే
తస్మాత్ జాగ్రత్త

55

# మట్టికి చేసిన మోసం

చందలూరి నారాయణరావు

చెట్టును
మనిషి కరిస్తే
కట్టెలు

మేఘం
మట్టికి చేసిన మోసం
ఎడారి



కష్టాల నష్టాల
కవలలు
కన్నీళ్ళు

నాలుక నటిస్తే
ఆస్కార్
అబద్ధానికే

అందం ముద్దాయి
శిక్ష
మకరందానికి

నాగరికత కాటుకి
నురుగులు కక్కేది
ఫ్యాషన్

ఎసట్లో
గింజల త్యాగం
ఆకలిపై విజయం

నేల స్నానానికి
మురిసిపోయేది
వానపాము

సూర్యుడి
వేసవి విడిది
భూగర్భం
అలుపెరగని
గెలుపు గుర్రం
భూగోళం

# విద్యుద్దహన వాటిక

లకుమ

'సంబంధాల్ని' నిర్దేశించేది
ఆర్థిక కారణాలేనా?
కేబుల్ ఊలూళ్ళూ!?

సీతా'కోక' చిలుకలు
ఎప్పుడూ దారిద్ర్యరేఖకు
దిగువనే!?

గౌరవం బరువు ముందు
రైతు ప్రాణమెప్పుడూ
'దూదిపింజే!?

చిన్నప్పుడు తినేందుకూ
పెద్దయ్యాక పెట్టేందుకూ
ఒకటే ఏడుపు!?

అప్పుడప్పుడూ
మా వంట పాత్రలకూ
తప్పని పస్తులు!?

ఇవాళకంటె
చేను మేయటానికీ లేదు?
కరువు!?

రచ్చబండలమీద
పులీ మేకల్లేవు!
ఒంటరిగా ఓ ఉరితాడు!?

కళ్ళాపికీ లేవు?
గొబ్బెమ్మలకంట
నీళ్ళు!?

'వివేకా'నికీ
'ఆనందా'నికీ దూరమయ్యాం!?
ఒక స్వయంకృతం!

పాలువెంట నీళ్ళూ
నగరానికీ దారి తీస్తాయి!
కృష్ణమ్మసాక్షిగా!?

ఏరాటబల్లా
ఆవూరెళ్ళదు
మన 'రాజ్యాంగం' లాగే!?

అయోధ్య అంతటా
త్రవ్వకాలు!
రాముడికీ 'దారి' లేదు!?

'విశాలాంధ్ర'లో 'ప్రజారాజ్యం'
వాక్యనిర్మాణం
ఎక్కడోతప్పినట్టుంది!?

భారత్
వెలిగిపోతుంది!
ఓ విద్యుద్దహనవాటికలా!?

# ఉడుకుతున్న ఆకలి

అంకే శ్రీనివాస్

ఎండిన వాగులో
బరువైన బాల్యాన్ని
మోస్తున్నాయి కాగితప్పడవలు

గుప్పెడు
వసంతం కోసం
తట్టెడు
శిశిరాల్ని రాల్చుకుంది చెట్టు



కయ్యిమీద
నలుగుతోంది నాగలి
పొయ్యిమీద
ఉడుకుతోంది ఆకలి

కళ్ళు ఎంత దుర్మార్గమైనవి
కన్నీటిని
నిర్దాక్షిణ్యంగా బయటకు నెట్టేస్తున్నాయి

నగ్నంగా దేశం
ఉద్విగ్నంగా
చేన్లో శవం

# స్వీకారం




ఆంధ్రజాతి అక్షర సంపద
తెలుగు పత్రికలు
పొత్తూరి వెంకటేశ్వరరావు
వెల : రు. 250/-
ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమీ

ఢాకన్
మహమ్మద్ ఖదీర్‌బాబు
వెల : రు. 10/-
ప్రచురణ : ప్రజాశక్తి బుక్‌హౌస్




పునర్యానం
చినవీరభద్రుడు
వెల : రు. 100/-
ప్రచురణ : ఎమెస్కో







వతన్
ముస్లిం కథలు
స్కైబాబ
వెల : రు. 100/-
ప్రచుతణ : నసల్ కితాబ్ ఘర్




ఒక తడి అనేక సందర్భాలు
టి. వెంకటేష్
వెల : రు. 30/-
ప్రచురణ : వైండింగ్ ప్రచురణలు

బా
రహమతుల్లా కథలు
వెల : రు. 20/-
ప్రచురణ : జంగ్లి పబ్లికేషన్స్




బడికథలు
(కథా సంకలనం)
వెల : రు. 25/-
ప్రచురణ : స్నేహ కళాసాహితి







ముల్కి
కొలుపుల దస్తర్
వెల : రు. 25/-
ప్రచురణ : గోల్కొండ ముద్దెర




నాగలకట్ట సుద్దులు
డాక్టర్ శాంతినారాయణ
వెల : రు. 100/-
ప్రచురణ : విమలశాంతి

నమ్ముకున్న రాజ్యం
శాంతి నారాయణ
వెల : రు. 50/-
ప్రచురణ : విమలశాంతి



# బొండ్రాయి తీర్పు



"ఆని మొల్తాదుదెంచ. ఆనింట్ల
పీనిగెల్ల. ఇంత ఉక్కుష్ట మానల్ల..."
'ఏందే పెద్దమ్మ'
"అన్నాలం పాడగాను. శల్క ఆని
పాడెకొమ్ముననొట్ట.
ఆ పెద్ద పటేలు కొడ్కు బక్కని
తల్కాయ పలగ్గొడ్తాదె"

**నోముల ఎస్. అరుణ**

బక్కడు పిల్లిసైదులు కొడుకు. పిల్లి సైదులుకు తాతల దగ్గర్నుంచి గొర్లమంద ఉంది. మందైతె ఉందికని గొర్రె పిల్ల మేస్తందుకు గుంటజాగలేదు. ఈ అల్సు దొరికిచ్చుకొని ఊల్లె ఆసాములంత ఆడిస్తుంటరు. ఎవల మాటకాదన్నా కష్టమే. ఎవలు చెప్పినా ఊ కొట్టాల్సిందే. ఏడదప్పుమోగినా గొర్రెపిల్ల త్యాగం కింద పోవల్సిందే.

"ఇంతంత పతేర ఉండెగని మందమేతకు మంది కాళ్ళు పట్టాల్సొస్తుండె. మేనెమ్మటో, వాగెమ్మటో ఎకరముంటె ఈ ఎతలు తప్పేయి" అని పిల్లి సైదులు పిసక్క సస్తుండు.

గొర్లమందంటు ఉన్నంక ఎప్పుడో బాగోతముంటది. ఎండ కాలం వోబాధైతె వానాకాలం ఇంకో బాధ. వానాకాలం ఆసాములు పంటలేస్కొని సందులేకుంట ఎన్గు బెడ్తరు. యేడ్నన్న గొర్రెపిల్ల మూతిపెట్టంగనే కంచాడొస్తడు. కంగాళీ కూతలు కూస్కుంట కర్ర తీస్కుంటడు. మందున్నోడు మారు మాట్లాడొద్దని తలనేలకేస్కొని తప్పుకుంటరు. ఆసాముల తిట్లు తినుకుంట కాలం గడుపుతరు. వానాకాలం వాసన కూడా పడనోడు ఎండకాలమొచ్చిందంటే 'ఏవయా సైదుల' అనుకుంట యవారం మొదలుబెడ్తరు. 'గా మడి బిల్లల వోమాపు మందబెట్టవైతివి' అనుకుంట ఎమ్మటిబడ్తరు. మందను ఎవలకు ముందు బెట్టినా కష్టమే. యెన్క బెట్టినా కష్టమే. ఒక మాపు పెడ్తె ఇంకో మాపెందుకు పెట్టలేదని కారెడ్డమాయె.

సైదులు వొయిసు మొత్తం గొర్ల మందతోటే గడిసింది 'తల్లి గొర్లకునా చెప్పు అడ్డమైనోని తోటి మాట పడాల్సొస్తుండె, అమ్ముకుంటే అయిపోతది. అటెంక కూలినాలి చేస్కొని అయినా బత్కొచ్చు' అని ఒక్కోసారి అనుకుంటడు కాని కూలినాలోల్ల కష్టాలు యాదికొచ్చి దిగమింగుతాడు.

కొడుకు ఒక్కడు ఎదిగినంక గొర్లెంట పోతుండు. ఆయం తక్కువ పోరడు ఏమరుపాటున యాడ కూసుండో ఎనుగు ఇర్గతొక్కిన గొర్లు ఆసామిశేల్లబడ్డె. అంకెదప్పిన ఆసామి నోటికొచ్చింది తిట్టి గుండ్రాయి తీస్కొని యేసిండు. సక్కదనాల పొటేలు గుదుములు ఇరిగినై. 'ఆసాము లంటరు గని దులిపేసుకొని పోవాల్రా అయ్యా' అని అయ్య చెప్పిన మాటకు ఇంతసేపు ఊకున్న బక్కడు పొటేలు కూలబడేసరికి గోడుగోడున ఏడ్సిండు. 'శేను మేస్తే పాయమాలు కట్టిచ్చుకోవాలెగని అనాత్కం పని జేస్తావయా' అని తట్టుకోలేక అసామిని అడిగిండు. ఆసామికి అంతులేని కోపమొచ్చింది. 'శేను మేపింది కాక శాంతనం జేస్తున్నావుర' గొర్రెను కాదు కొడ్క నీ ఈపు పల్గుతది' అని ఈదర బాదర బాదిండు. బక్కడు తప్పిచ్చుకుంటందుకని తొక్కులాడతుంటే చేతుల ఉన్న శిప్పగొడ్డలి ఆసామి జబ్బకు తాకింది. మందకు మండకొట్టే గొడ్డలాయె మెత్తగుండి 'జప్పు' మన్నది. ఆసాములంత ఒకటై ఊల్లె పంచాతిపెట్టిండ్రు. అనరాని మాటలన్నరు. 'మంది శేల్లల్ల మేపి మందను పెంచుతుండ్రు. మూట కడుతుండ్రు. మూటను చూసేసరికి ఒక్కొక్కనికి కండ్లకావురం బెరిగింది. అసుంట అల్లియ్యి అంటె గొడ్డండ్లతో నరుకుతుండ్రు. ఇట్లనే ఉంటె ఆసాములంత యావుసాయాలు వొదిలి పెట్టి అడక్కతినాలె' అని తలావో మాటంటుంటె సైదులు తల్కాయెంచుకొని నిలబడ్డడు. 'అయ్యా చిన్న పిల్లగాడు. తెల్వక పొరపాటు చేసిండు తమరు ఏ శిచ్చ యేసినా నేను భరిస్తయ్యా' అని పిల్లి సైదులు చేతులు జోడించిండు.

ఆసాములంత అట్లెట్ల అయితదన్నరు. ఆసామి చేతులు పట్కొని ఆసుపత్రి కర్సులియ్యన్నరు. అయినా మేత లేనొన్కి మందెందుకు? మంది మీద పడి ఎన్నాల్లు బత్కుతరు' అని తలావొతీర్గ మాట్లాడెంద్రు. 'ఇగ మీ ఆటలు సాగవు. మా దాంట్ల కాళ్ళు పెడితే ఇరగ్గొడ్తం అని' బెదిరిచ్చింద్రు.

పానం ఇసక్కుమని ఎకరమన్న కొందామనుకున్న సైదులుకు పెద్ద పటేలు బేరానికి పెట్టిండని తెల్సింది. ఉల్లె పెద్ద పటేలు పెద్దాసాయే. ఇంత జాయిజాదుండె యవుసాయం జేస్తందుకు జీతగాండ్లు కరువాయె. ఎవడన్నా కొంటె బాగుండు అని ఎప్పటి నుంచో అనుకుంటుండు. 'పుల్లసాల్లు అయితెమనె గని బేరం జెప్పురి' అని సైదులు పెద్ద పటేలు కాడికి పోయిండు. 'ఐదెకరాల కిత్తా ఉంది అంత వరకైతె ఇస్త' అని పెద్ద పటేలన్నడు. 'రొండెకరాలైతె పైకం సదురు బాటైతదిగని అయిదెకరాలైతె ఆయితికాదు నాయన' అని లెక్కలేస్కొని సైదులు చెప్పిండు.

'సైదులూ ఓ మాట చెప్పుత ఇను. రొండెకరాల పైసలు ఇప్పుడు గట్టు. తతిమ్మ పైసలు యాడాదికింత జమకట్టు. ఒక్కదగ్గరుంటది. మల్ల నీకు కొనాలన్నా దొరకదు. ఏమంటవ్' పెద్ద పటేలు ఉసులు బాటు సూపిచ్చుకుంట సలహా చెప్పిండు.

సైదులు ఆలోచించాడు. అంతో ఇంతో కష్టపడ్తే ఐదెకరాలు మిగుల్తదని ధైర్యం జేసిండు. ఉన్న రొక్కం కట్టిండు. 'ఇగో సైదులూ కబ్జా తీస్కో. పూర పైసలు కట్టి పట్టజేయించుకో' అని పెద్ద పటేలు కాయితం రాసిచ్చిండు.



యాడాదికింత పైకం చొప్పున రొండేండ్లల్ల చెల్లగట్టిండు. పట్ట చేస్కుందామంటే చేతుల పైస మిగల్లేదు. 'శల్క కొన్నంక మందతగ్గింది. ఎదిగిన దాన్ని ఎదిగినట్టు అమ్మితెనే ఇంత కాడికొచ్చింది. పట్టేడికి పోతది పటేలు మనొడేనాయె' అనుకున్న సైదులు 'నిమ్మలంగ పైసలున్నపుడు పట్టచేయించుకుంట పటేలా' అని చెప్పిండు. 'సరె నీ ఇష్టం' అని ఊకుండు పెద్ద పటేలు.

ఏండ్లు గడుస్తున్నా పట్టాకు పైసలు పెట్టాలంటే పిల్లి సైదులుకు దరిస్తలేదు. పట్టాకోసం పట్వారిగాన్ని మేపాలె అనుకుంట నెట్టుకొస్తుండు. 'ఏంతొందరొచ్చిందని గొర్రె పిల్లలమ్మి పట్టచేయించు కోవాలె. ఇట్ల ఉన్నా మంద పెరుగుతది' అని నడుపు తుండు.

ఇంతల్లనే పటేలుకు బీమారొచ్చి మంచానబడ్డడు. 'మంచాన బడ్డొన్ని ఇప్పుడేం అడుగ' అని ఆగిండు. మంచం మీద నవుసి నవుసి పటేలు పొడెక్కిండు.

'నీయమ్మ గాశారముల్లనా చెప్పు. పట్ట చేయకుండనే పటేలుపాయె'ని బాధపడ్డడు. 'అయినా పటేలు కొడుకుండె పాబంది తప్పుతాడు' అని నిమ్మల పడ్డడు.

దినాలు గినాలై నిమ్మల పడ్డంక ఓనాడు పెద్ద పటేలు కొడ్కుసు కదిలిచ్చిండు. 'అయ్యా! నాయిన కాడ ఐదెకరాలు పుల్లసాల్లుకొన్న. ఆయిన ఉన్నప్పుడు పట్టచేయించుకోలే. ఇప్పుడు చేయించుకోవాలనుకుంటున్నా' అని అడిగిండు.

'ఓహో! పుల్లసాల్లు నీకమ్మినాడు. కాయితం పట్కరా సూద్దాం' అని అదోతీర్గ అన్నడు పెద్ద పటేలు కొడ్కు. పిల్లి సైదులుకు కాళ్ళు సేతులు కదుపుల పడ్డె. 'పటేలు కొడ్కేంది. ఏం తెల్వనట్టు మాట్లాడుతుండని గుబులు పడ్డడు. ఆదలబాదల బోయి సంద్కలున్న కాయితం బట్కొని పటేలు కొడ్కుకాడికొచ్చిండు. 'ఏందే అయ్యా! నారాజైతవు' అనుకుంట బక్కడు యెంట బడ్డడు.

'పైసలేకుంట శల్లకట్టినయ్యా! పెద్ద పటేలు ఆ ముక్క రాసిండు సూడరాదురి' అని గజగజ వొనుక్కుంట పటేలు కొడ్కు చేతుల కాయితం పెట్టిండు పిల్లి సైదులు. కాయితాన్ని పట్కొని కిందికి మీదికి చూసిండు పటేలుకొడ్కు "ఇగో సైదులూ? కాయితమైతె ఉందికని తెల్లకాయితం ఎందుకు పనికొస్తది చెప్పు. అదంత కాదుకని ఓ మాట చెపుత ఇనుకో. అయ్యాల నాయిన ఆ ధరకు మాట్లాడిండు. అయ్యాలైతే నువ్వన్నట్టే పట్టజేద్దును. మరి ఇయ్యాల కాలం మారె. ధర పెరిగె. ఇయ్యాల పట్టెట్ల అయితది చెప్పు" అని మెల్కబెట్టిండు.

"అయ్యా! అట్లనకురి అన్నాలం జెయ్యకురి పిల్లలు గల్లోన్ని కాల్మొక్త" అని రొండు చేతులు పబ్బంబట్టిండు. సైదులు కండ్లల్ల నీల్లు తిర్గుతున్నయ్. "ఇగో ఈ లొల్లింత పెట్టకుగని ఇయ్యాల ధరకట్టియ్యి గురె నువు ఇంతకు ముందిన్ని పైసలిచ్చినంటున్నవ్ కాబట్టి అంతో ఇంతో తక్కువజేద్దాం. అంతే గని అప్పటి మాటంటె మాత్రం కుదర్దు" అని పటేలు కొడ్కు తెగేసి చెప్పిండు.

పిల్లి సైదులుకు సల్లజెమటలు పట్టినై. "గాశారం పాడుగాను ఇట్లాయె. పెద్ద పటేలున్నపుడు రొండు గొర్రె పిల్లలమ్మి పట్టజేయించుకున్నా బావుండేది. కర్మగాలి ఆడుసచ్చె. కొడుకు కొరకాసాయె బండకింద చెయ్యిర్కినట్టాయె. ఈని ఇసం పాడుగాను కదుపులున్నది కానస్తైతి" అని తల కొట్టుకొండు.

"అయ్యా! అట్లెట్ల ఉంటది. అయ్యాల మాట్లాడినట్టు పూడకర్తి. బర్రెనైతె కొంటిగని బుద్దిగడ్డితిని పల్పుకాడ ఎన్కముందాడ్తి. తిప్పలు బెట్టకురి సచ్చి మీ కడ్పులపుడ్త' అని పటేలు కొడ్కు రొండుకాళ్ళు దొర్కిచ్చుకుండు సైదులు.

"ఓర్రె యీడు నా కాళ్ళు పట్టుకుంటడు. పైసలు కట్టి పట్టజేస్కో. అంతేగని పటేల గిటేలంటే కుదర్దు' అని కనికరం లేకుంట కాళ్ళు జాడిచ్చిండు.

"అయ్యా పటేల! బుద్ది గడ్డితిన్నది. ఇంత జుల్మానెయ్యిరి. ఉల్లె నడ్సినట్టే పావులో పర్కొ చెప్పజెపుతకాని నోటికాడి బువ్వల మన్నుబొయ్యకురి" అని సైదులు కండ్ల నీల్లు తీస్కుంట కాళ్ళ వేళ్ళబడ్డడు.

ఇదంతా చూస్కున్న బక్కనికి కోపం తనుకొచ్చింది. పటేలు కొడుకు ఇంత పాబంది తప్పుతాడు అని పండ్లు పటపట కొరుక్కుండ.

'...లా పాపం పనులు చెయ్యకుని కడుపుకింత అన్నం తింటోనివి అన్నాలం చెయ్యకురి' అని బక్కడు కదుపుల బాధను మింగుకుంట ఓ మాటన్నడు.

'తల్లి గొర్లకాసుకునే నా కొడక. నా ముందల నిలబడి నాకే సుద్దులు చెపుతావుర' రోషం పొడుచుకొచ్చిన పటేలు కొడుకు అమ్మనా బూతులు తిట్టిండు.

'పాటి తప్పినంక పటేలైతేంది? ఎవడైతేంది?'

ఉడికిపోయిన బక్కడు వొక్క ఉదుటున లేసిండు.

'నువ్వెట్ల పట్టజెయ్యవోసూస్త. పట్టజెయ్యకుంట నువ్వు పటేలమ్మతోటి సంసారం చేసేది సూస్త' అని ఆవేశంగ మాట్లాడిండు.

'అదునా ఏలు ముద్దెరగానివి. గొర్రెలెక్క బత్కెటోనివి. నాకెదురు మాట్లాడ్తావుర' పటేలు కొడ్కు దిగ్గను లేసి కర్రందుకొని దబీదబీమని బాదిండు సైదులు బిత్తరబోయిండు. బక్కడు గొల్లుమన్నడు. 'నియతి తప్పిన కొడ్కు' అని బక్కడు కలెబడ్డడు. అజంగ ఉన్న పటేలు కొడ్కు జాడిచ్చి కొట్టిండు. బక్కని తల మీద ఆటమైన దెబ్బపడ్డది. అమ్మో అని బక్కడు కూలబడ్డడు. తల్కాయపల్గి నెత్తురు చిమ్మింది. చూస్తుండగనే బక్కని వొల్లంత నెత్తురు నెత్తురైంది. సైదులు గుండెలు బాదుకుంట కొడుకు మీద పడి బోరుమన్నడు. పటేలు కొడ్కును శాపనార్థాలు పెట్టిండు. లబోదిబోమంటుంటే ఊరంత జమయ్యింది. అన్నాలం పాడుగాను అమ్మిన దానికి ఆశ పడ్తాడర అన్నరు. ఊశిన దానికి ఆశ పడి ఊపరితీసే

## 'జీవన లిపి' ఆవిష్కరణ

ఎస్. రఘు రచించిన జీవన లిపి (నానీలు) కవితా సంపుటి ఆవిష్కరణ సభ ఉత్తమ్ ఆర్ట్స్ అకాడమీ ఆధ్వర్యంలో ఆగస్టు 8న హైదరాబాద్ నగర కేంద్ర గ్రంథాలయంలో జరిగింది. సీనియర్ పాత్రికేయులు ఎ.బి.కె. ప్రసాద్ ముఖ్యఅతిథిగా విచ్చేసి పుస్తకాన్ని ఆవిష్కరించారు. ప్రసంగిస్తూ 'రేఖాగణిత శాస్త్రజ్ఞులారా దారిద్ర్యరేఖను దాటడం నేర్పరాదూ' అంటూ కవి రఘు తన నానీల్లో దారిద్ర్యరేఖకు దిగువ ఉన్నవారి ఆర్థిక స్థితిగతులను వ్యాఖ్యానించడం అభినందనీయమని అన్నారు. అంతేగాక గ్లోబలైజేషన్ విష సంస్కృతిని గొప్పగా కవిత్వీకరించాడని అన్నారు. సమీక్షకులు గుడిపాటి మాట్లాడుతూ సామాజిక విశ్లేషణకు, మంచి కవితా అభివ్యక్తికి రఘు రాసిన 'జీవన లిపి'లోని నానీలు చక్కని ఉదాహరణలుగా నిలబడుతాయన్నారు. నిత్య జీవితంలో జరిగే ప్రతి సంఘటన రఘు నానీలలో కనిపిస్తాయన్నారు. మరో సమీక్షకులు వేణు సంకోజు 'జీవన లిపి'ని సమగ్రంగా విశ్లేషిస్తూ "పుస్తకాలకు రెక్కలుండవు. చదివితే మనకు పుట్టుకొస్తాయి.' అన్న కవి మాటలు ఈ పుస్తకానికి కూడా వర్తిస్తాయని ప్రశంసించారు. రఘు తన




ఎస్. రఘు కవితా సంపుటి (నానీలు) ఆవిష్కరణ సభలో ఎబికె ప్రసాద్, డా.ఎన్.గోపి, ఎస్. రఘు, జింబో, గుడిపాటి వేణు సంకోజు

నానీల కోసం ఎంచుకున్న వస్తువుల విస్తృతిని చూస్తే ఆశ్చర్యం వేస్తుందని, సామాజిక జీవితంలోని, ఆంతరంగిక ఉద్వేగాలలోని దాదాపు ప్రతి విషయాన్ని నానీలలో చెప్పడానికి రఘు ప్రయత్నించారన్నారు. ఈ సభకు కవి శ్రీ జింబో అధ్యక్షత వహించగా, ఆత్మీయ అతిథిగా నానీల సృష్టికర్త డా.ఎన్. గోపి విచ్చేసారు. అతిథులకు శ్రీమతి జె.నీరజ స్వాగతం పలకగా, తిరునగరి శ్రీనివాస్ వందన సమర్పణ చేశారు. ⟶

పని జేసేనేమ్రా అన్నరు. అటు ఇటు మాట్లాడినంక అమీన్ కచ్చేర్ల పెట్టాలన్నారు.

నెత్తురు ముద్దోలిగున్న బక్కన్ని బండ్లేసుకొని కచ్చేరికి బోయింద్రు. ఊళ్లోల్లు చెప్పిందంత ఇన్న అమీన్ సాబ్ దరఖాస్తు ఇయ్యమన్నడు. తీస్కపోయి దవఖానాల శేరీక చేయమన్నడు.

వారం పది దినాలు దవఖాన సుట్టు తిరిగిన సైదులు ఇంత వొడిపిచ్చుకొని, బక్కన్ని తీస్కొని ఇల్లు జేరిండు. 'బతుకు బజారుపాలాయె. అమీన్‌సాబ్ కాళ్ళమీద పడన్న శల్క పట్టచేయించుకుందామ'ని సైదులు కచ్చేరికి తిర్గడం మొదలుబెట్టిండు. కచ్చేర్ల అమీన్‌సాబ్‌ఉండడు. ఉన్నా పెద్ద పెద్దోల్లతో మాట్లాడకుంట ఉంటడు. పొద్దూకంతలపిల్సి 'పొద్దున్నే రా' మాట్లాడ్తామంటడు. బాటబడి చెప్పలరిగిన్నై. ఆస్పత్రికి, అమీన్‌సాబ్ కాడికి సైదులు తిరుగుతుంటె గొర్లమంద తరుగుతుంది. 'దోపకం పాడుగాను ఎవనికాడికి పోయినా చెయ్యి జాపుడేనాయె. ఇంట్ల ఉన్నా దొడ్డి మిగుల్తదని' గోడుగోడున ఏడ్సుకుంట ఆశ వొదులుకుని సైదులు ఇల్లు చేరిండు.

మంచం పట్టిన బక్కడు అప్పుడప్పుడే లేసి తిరగాడుతుండు. సగానికి సగమైన కొడుకును, మందను చూస్కున్న సైదులు మనాదిల పడ్డడు. మూల్గేనక్క మీద తాటిపండుపడ్డట్టు ఉల్లెకు పోలీసు జీపొచ్చింది. ఊరంత గెబరాయించింది. మాట ముచ్చట లేకుండ మూల్లే బక్కన్ని జీపుల ఏస్కుంద్రు. తుమ్మ మండలలు కొట్టుకొని బత్కెటోనివి తుపాకులోల్లకు బువ్వలు పెడ్తావుర అని గొర్రెపిల్లను తోడేలు ఏస్క పోయినట్టు ఏస్కపోయింద్రు.

ఎందుకు తీస్కపోయింద్రో, ఏడికి తీస్కపోయింద్రో సైదులుకు తెల్వలే. కచ్చేరికాడికి పోతేనే అమీన్‌సాబ్ కరుస్తుండు. పిల్లనెత్కపోయిన గద్దను తల్లికోడి చూసినట్టు వారం దినాలు కచ్చేరి చుట్టు చూసిండు. చూసి చూసి కండ్లు పీక్కపోయిన్నై. కంటిమీద కున్కుకరువైంది. "ఓరిదేవుడా ఉన్న ఫలంగ ఊపిరి దియ్యరాదుర ఏం పాపం జేసినంర ఇంత గోసబెడ్తున్నవని' దేవుని తిట్టుకుంట వేడుకుండు. ఈనగాసి నక్కలపాలు జేసినట్టు ఎదిగిన కొడుకును ఎయినోళ్ళ కప్పజెప్పితి అని ఏడ్సి ఏడ్సి మంచం పట్టిండు.

ఓ నాడు పీనిగొలిగైన బక్కడు ఊరపొద్దు కంతల ఇల్లుజేరిండు. మాట ముచ్చటలేదు. ఒక్కటే మూల్గుడు. వొల్లంత పచ్చి పుండైంది. ఏం జరిగింది కొడకా అంటే యెర్రిసూపులు సూస్తుండు.

కొడుకుని బట్కొని సైదులు గుండెలవిసేలా ఏడ్సిండు మాట పడకుండ బతుకదామని పటేలు చేతుల మసైతిమి కొడ్కా అని తల బాదుకుండు. ఏడ్సి ఏడ్సి కండ్లెండిపోయిన్నై. ఎండకప్పొలిగ వొరుగైండు. పానం ఉండంగనే పీనిగొలిగైండు.

చేతుల కచ్చేరి పట్టుకున్న పటేలు కొడ్కు పుల్లసొల్లకు పోయిండు. చెట్టు చేమకొట్టిచ్చి అరక కట్టిచ్చిండు. సైదులుకు తెల్సి పడుకుంట లేస్కుంట సొల్లల్ల కొచ్చిండు. అర్కకు అడ్డంపడి శల్క నాదన్నడు. కశబిషఅయ్యింది. 'చెప్పులు పట్టుకోవాల్సిన కొడుకువు చేతులు లేపుతావుర' అని పెద్ద పటేలు కొడ్కు కాలులేపి ఎదుర్రొమ్మున గబుక్కున తన్నిండు. గిద్దెడు నెత్తురు గక్కి ఊపిరిడిసిండు సైదులు.

బక్కనికి కాళ్ళు సేతులు నరికినట్లైంది. అయ్యసచ్చిండు. భూమి పొయ్యింది. మంద మాయమైంది కచ్చేర్ల దరఖాస్తిస్తే ఎవరికో బువ్వబెట్నవని ఎముకల్ల సున్నం దీసిరి. బక్కని బత్కు కుందెనకింద మేసి కుల్లబొడ్సినట్లై'ంది. ఎటూ తోయలే. ఎవరికీ సెప్పలే. ఎటో.... ఎల్లిపోయిండు.

❖ ❖ ❖

శిన్కుబడి ఇత్తనాలేసింద్రు. పుల్లసొల్లు పటేలు కొడ్కు పోతం జేసిండు. శ్రావణమాసం ల చెట్ల కిందికి పోతుంద్రు.

కాపిన డప్పులు జోరుగ మోగుతున్నై. పుదిచ్చిన యాట నడుస్తుంది. ఆడోల్లు బొనాలెత్తుకుంద్రు పిల్లజెల్ల కేరింతలు. ఈలలు కేకలు ఊరు ఊరంత ఊగి పోతుంది.

దరువేస్తున్న శిర్రలు ఒక్కసారిగ ఆగిపోయిన్నై. డప్పులాగేసరికి ఈలలు కేకలు అన్నీ ఆగినయ్. ఎక్కడొల్లక్కడ కొయ్యబారి పోయింద్రు. యాట పిల్ల చిత్తిరి చూపులు చూస్తుంది. ఎన్క ఉన్నొల్ల ఏం అర్థమైతలే. అంతదూరంల ఉన్న బొడ్రాయిని చూసేసరికి డప్పులొల్లకు గుండెల్ల డప్పులు మోగిన్నై. శిర్రబడ్తలేదు. కాలుకదుల్తలేదు. 'మెయ్యి.. దరువెయ్యి' అనుకుంట తోసుకొచ్చిన జనానికి నోట మాట పడిపోయింది. ఊరు ఊరంత బొడ్రాయి సుట్టు మూగింద్రు 'రేయ్ ఇక్కడ బలయ్యింది. ఇంకా పోతెందుకు ఇడ్సిపెట్రదాన్ని' ఎవరో కేకేసింద్రు.

బోడ్రాయి కాడ నెత్తురు పారుతుంది. పక్కన్నే పీనిగుంది. పెద్ద పటేలు కొడ్కు తల్కాయ బొడ్రాయి ముందు కొబ్బరి శిప్పొలిగ పడి ఉంది. బలి తప్పిచ్చుకున్న గొర్రెపోతు చెంగనాలు గొట్టుకుంట ఉరుకుతుంది. ❖

## రహమతుల్లా కథలు 'బా' ఆవిష్కరణ

రహమతుల్లా రచించిన 'బా' కథాసంపుటి ఆవిష్కరణ ఆగస్టు 24 సాయంత్రం బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో జరిగింది. ప్రముఖ ఉర్దూ రచయిత్రి జిలానీబానూ పుస్తకాన్ని ఆవిష్కరించారు. ఈ సభకు ప్రముఖ కవి కె. శివారెడ్డి అధ్యక్షత వహించారు. ఓల్గా, ఖాదర్‌మొహియుద్దీన్, స్వామి పుస్తకాన్ని సమీక్షించారు. స్వామి మాట్లాడుతూ భారతీయ సమాజం బహుళత్వపు విలువలు కలిగినది. చరిత్ర గమనంలో ఇక్కడ రకరకాల జాతులూ, సంస్కృతులూ ఐక్యమైనాయి. మైనారిటీల మీద సాంఘిక రాజకీయ పరమైన దాడులు జరుగుతున్న నేపథ్యంలో వేపచెట్టూ, జువ్విచెట్టూ అంటుతొడిగిన సహజీవనకళను హిందుముస్లిం ప్రజలకు అనువర్తింప చేసిన మానవీయకథాహారం రహమతుల్లా 'బా' కథల సంపుటి అన్నారు.

ఓల్గా మాట్లాడుతూ అన్ని మతాల్లో మాదిరిగానే ఇస్లాం మతంలోని కొన్ని కట్టుబాట్లు, నిర్బంధాల కారణంగా స్త్రీలకు స్వేచ్ఛ లేకుండా పోయి వారు జీవచ్ఛవాల్లా జీవిస్తున్నారని నర్గిస్, బందీ పింజరే కేచినా కథల్లోని పాత్రలు నర్గిస్ పర్విన్ ద్వారా రహమతుల్లా సమర్థవంతంగా చెప్పారు. అదే విధంగా సమాజంలోని కర్కశత్వం కారణంగా మంచి స్త్రీల మధ్య కూడా దూరం పెరిగిపోతున్నదని అమ్మీజాన్ కథ ద్వారా చాలా సహజంగా రాశారు డా॥ కె. శివారెడ్డి అధ్యక్షోపన్యాసం చేస్తూ రహమతుల్లా కథలు నాకు చాలా ఇష్టమైన కథలు. నా చుట్టూ




ఉన్నజీవితాన్ని ఆయన కథీకరించినట్లుగా ఉంది అన్నారు. ఖాదర్ మొహియుద్దీన్ మాట్లాడుతూ ముస్లిం సమాజం మీద జరుగుతున్న విష ప్రచారాన్ని ఈ పుస్తకం పటాపంచలు చేస్తుందన్నారు.

జిలానీ బానూ పుస్తకాన్ని ఆవిష్కరించి ఈ కథలు ఉర్దూ భాషలో తర్జుమా కావాల్సిన అవసరముందన్నారు. దర్భశయనం శ్రీనివాసాచార్య వందన సమర్పణతో సభ ముగిసింది. రచయిత రహమతుల్లా తన ప్రతిస్పందనగా కథారచన తృప్తి సాధనే కాదు పవిత్రమైన బాధ్యత కూడా అని అన్నారు.

## సామాజిక దార్శనికుడు గుర్రం జాషువా

### కర్నూలు సభలో వక్తల వుద్ఘాటన

పద్మభూషణ్, కవికోకిల గుర్రం జాషువా సామాజిక దార్శనికుడని పలువురు వక్తలు ఉద్ఘాటించారు. కవి గుర్రం జాషువా 34వ వర్ధంతి సభ జులై 24న సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో కర్నూలులోని కోల్స్ కాలేజీలో జరిగింది. సభకు పలువురు వక్తలతోపాటు సాహిత్యాభిమానులు, యువకవులు హాజరయ్యారు. ప్రధానవక్తగా హాజరైన శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు డాక్టర్ తుమ్మల రామకృష్ణ మాట్లాడుతూ మానవ జీవన అధ్యయనమే సాహిత్యమని, తన కవిత్వం, జీవితం ద్వారా సమాజాన్ని దర్శించిన కవిగా జాషువాను కొనియాడారు. ఆయన ఆశయాన్ని కొనసాగించడం నేటి యువకవుల కర్తవ్యమని పిలుపునిచ్చారు. కటిక పేదరికంలోనూ అకుంఠిత దీక్షతో సాహితీరచన చేసిన జాషువా చంద బద్దకావ్యంలో సాహిత్యాన్ని కొనసాగించారని వివరించారు. సభాధ్యక్షులు, ప్రముఖ రచయిత జి. శుభాకర్ రావు మాట్లాడుతూ అస్పృశ్యతపై జాషువా సాహితీ సమరం గావించి "విశ్వనరుడను" అంటూ సగర్వంగా ప్రకటించుకున్నట్లు తెలిపారు. భారీ వర్షాన్ని కూడా లెక్కచేయకుండా సుమారు 90 మంది సాహితీ ప్రియులు హాజరై సభను విజయవంతం చేశారు. సీనియర్ రచయితలు డాక్టర్ శాంతమ్మ, అనెన్, ఇనయతుల్లా, ఎలమర్తి రమణయ్య, సూర్యకళ, కె.జి. జయరామిరెడ్డి తదితరులు పాల్గొని "సాహితీ స్రవంతి" ద్వారా ఇలాంటి కార్యక్రమాలను చేపట్టే ఎం.పి. బసవరాజు కృషిని అభినందించారు. సెయింట్ మేరీస్ తెలుగు శాఖాధ్యక్షులు బాలశౌరి మాట్లాడుతూ జాషువా రచనలు దళితులకు ప్రేరణ కల్గిస్తాయన్నారు.




మానసిక అస్పృశ్యతను సమాజం తొలగించుకోవాల్సిన అవసరం ఎంతైనా వుందన్నారు. మాంటిస్సోరి తెలుగు పండితులు శ్రీమతి చాయామణి మాట్లాడుతూ జాషువా ఆదర్శ సమాజం కోసం పరితపించినట్లు ఆయన రచనలు పరిశీలించిన వారికెవరికైనా ఇట్టే తెలిసిపోతుందన్నారు. సభలో ముందుగా జంధ్యాల రఘుబాబు, గుర్రం మునయ్య జాషువా చిత్రపటానికి పూలమాల వేసి వక్తలను వేదికపైకి ఆహ్వానించారు. అనంతరం మాంటిస్సోరి తెలుగు ఉపాధ్యాయిని శ్రీమతి నిర్మల ఆలపించిన "మా తెలుగు తల్లికి మల్లెపూదండ" ప్రార్థనతో సభ ప్రారంభమైంది. కార్యక్రమంలో సిస్టర్‌స్టాన్సిల్లా, మాంటిస్సోరి విద్యా సంస్థల విద్యార్థినీ, విద్యార్థులు శ్రావ్యంగా జాషువా పద్యాలను ఆలపించారు. తెలుగు పండిట్ ట్రైనీలు అనేక మంది పాల్గొన్న ఈ సభలో విద్యార్థి తాయప్ప జాషువాపై చెప్పిన కవిత సభను అలరించింది. ఎలమర్తి రమణయ్య వందన సమర్పణతో సభ ముగిసింది.

-ఎం.పి. బసవరాజు, కర్నూలు






ప్రసంగిస్తున్న అధ్యక్షులు కోట్ల వెంకటేశ్వరరెడ్డి, రామకృష్ణారెడ్డి, వనగంటి ఈశ్వర్, వల్లభాపురం జనార్దన సమ్మేళనంలో పాల్గొన్న సాహితీ మిత్రులు

# రైతుల ఆత్మహత్యలపై పాలమూరు కవుల స్పందన

వ్యవసాయం 'కంపెనీ' వ్యవసాయంగా మారుతున్న నేపథ్యంలో రైతును నిస్సహాయ స్థితిలోకి, దిక్కుతోచని పరిస్థితిలోకి, అంతిమంగా ఆత్మహత్యల వైపు నెట్టి వేస్తున్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ విధానాల తీరుతెన్నులపై ప్రజా సాహిత్యవేదిక పిలుపు మేరకు జూన్ 13న జరిగిన కవి సమ్మేళనంలో జిల్లాకు చెందిన 32 మంది కవులు, రైతులకు వెన్నుదన్నుగా నిలబడి అక్షరాయుధాలను ఝుళిపించి జిల్లా సాహిత్య చరిత్రలో సామాజిక కవులుగా తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించారు.

ముందుగా జిల్లా రైతు సమాఖ్య అధ్యక్షుడు డి. రామకృష్ణారెడ్డి ప్రసంగిస్తూ రైతు అవసరాలను గుర్తించని ప్రభుత్వ విధానాలే రైతు ఆత్మహత్యలకు మూలమని విమర్శించారు. రైతు సంఘం జిల్లా అధ్యక్షులు వనగంటి ఈశ్వర్ కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ప్రపంచీకరణ ప్రైవేటీకరణ నేపథ్యంలో అమలు చేస్తున్న విధానాలే రైతు ఆత్మహత్యలకు దారి తీస్తున్నాయని విమర్శించారు.

ఆ తరువాత ప్రజాసాహిత్య వేదిక ప్రధాన కార్యదర్శి కోట్ల వెంకటేశ్వరరెడ్డి అధ్యక్షతన కవి సమ్మేళనంలో జరిగిన 32 మంది కవులు కవితాగానం చేశారు. ముందుగా యువకవి నందిగామ కిశోర్ "ప్రపంచానికి తిండిపెట్టిన వాడు ఆత్మహత్య ఎందుకు చేసుకుంటాడు" అంటూ రైతు ఆత్మహత్యలను ప్రభుత్వ హత్యలుగా తన కవితలో వర్ణించాడు. లక్ష్మణగౌడు "ఇది చరిత ఎరుగని దారుణం, అణుయుగంలో ఆత్మహత్యలా ఇది అతిహేయం" అంటూ తన 'రైతు రాజు' కవితలో ప్రస్తుత వ్యవస్థపై అసహ్యాన్ని ప్రకటించాడు. "పిచ్చుకలు, చిలుకలు విహరించిన పల్లెలపై దేగలు వాలుతున్నాయి" కష్టాలకు మన కర్షకుడు ఎరగా మారుతున్నాడని రంగినేని మన్మోహన్ తన ఆత్మీయతను ప్రకటించాడు. రైతు ప్రాధాన్యతను గుర్తించని సర్కారుకు చురకలంటిస్తూ మర్యాద సురేందర్‌రెడ్డి "నీ చుట్టూ ఉన్న సమాజం, నీపాట పాడే సర్కారు నీ గురించి ఆలోచించినపుడు" "నీవు పంటపండించు, అంత వరకు ప్రకటించు క్రాప్ హాలీడే" అంటూ వెక్కిరిస్తాడు. కాళిదాసు తన కలంతో "రైతుకు విప్లవ పాఠాలు నేర్పుతూ" ప్రభుత్వ వ్యవసాయ వ్యతిరేక చర్యలకు నిరసన ప్రకటించమంటాడు. ఎదిరించటం మొదలుపెట్టమంటాడు. "పట్టపగలయినా ఆ యింట అమావాస్య చీకట్లు, పండగ పూటయినా ఆ యింట అలవాటు పడ్డ పస్తులు" అంటూ రైతుల దైన్యస్థితిని కె.ఎ.ఎల్. సత్యవతి బలంగా వ్యక్తీకరించారు. "ధరలు మార్కెట్ యార్డులో మౌనంగా రోదిస్తుంటే రైతు గుండె ఆకలికి మండుతున్న అగ్నిగుండమయిందని" భీంపల్లి శ్రీకాంత్ రైతుస్థితిని అక్షరబద్ధం చేశాడు. కమలేకర్ శ్యాం ప్రసాద్ తన కవితలో "విరిగిన నాగలి, ఎండిన డొక్కలు, వారి ఆస్తిపాస్తులు. బోరుబావుల్లో గంగమ్మ జాడలేదంటూ పాలమూరు రైతే కాదు దేశంలోని రైతు వ్యవసాయం తీరుతెన్నులను వర్ణించాడు. "రైతన్నా ఆత్మహత్యకాదు సమస్యకు పరిష్కారం, నిబ్బరాన్ని ప్రదర్శించు, నిండు పిడికిలి బిగించు" అంటూ రైతు పక్షాన నిలబడిన ఎం. బాలకిష్టయ్య తన కవితను వినిపించాడు. సకల రోగాలకు మందు సమస్యను విశ్లేషించి ప్రజావ్యతిరేక ప్రభుత్వాలను నిలదీయటమొక్కటే మార్గమని ప్రబోధిస్తూ "మాటలతో మభ్యపెట్టే సర్కారును నిలదీస్తే అంగబలం, అర్థబలం సమకూరుతుందని ఎస్. భాస్కర్‌రెడ్డి గీతాలాపన చేశారు" దేశానికి వెన్నెముక రైతు, అదిప్పుడిరిగింది. దేశమెలా నిలబడుతుందని ప్రశ్నిస్తాడు తన కవితలో దేవదానం. "నీ ఆత్మహత్య పత్రికలకు పతాక శీర్షిక, ప్రభుత్వాలకు చెత్తబుట్టలో వేసే గుడ్డ పీలిక" అంటూ వల్లభాపురం జనార్దన రైతు పట్ల ప్రభుత్వాల విధానాలను వెక్కిరిస్తూ "ఆత్మహత్యలకు గుడ్ బై చెప్తా జరగబోయే నా హత్యను నేనే పరిశోధిస్తా, స్వార్థ సామ్రాజ్యవాదం విసిరే సవాలుకు జవాబు చెప్తా" అంటూ రైతు పక్షంలో చేరుతాడు ప్రజాకవి" దేశానికి వెన్నెముక నీవు అనడానికి ఎంతో బాగుందీ ఉపమానం సన్నకారురైతు వెన్నెముక ఎన్ని ముక్కలైందో పెద్దకారులో తిరిగే వారికేం తెలుసు" అంటూ విరజాజి రామిరెడ్డి సాదాసీదా మాటల్లో గాంభీర్యం ప్రదర్శించాడు. సామ్రాజ్యవాద దోపిడీని ఎండగడుతూ నవీన్ "మే రా నంబర్‌కబ్ ఆయేగా అంటూన్న అమాయకపు పిల్లాడిలా ఆత్మహత్యల వరుసలో నిలబడ్డ రైతును ఆత్మవిశ్వాసం మెట్లెక్కిద్దాం" అంటాడు.

"మా ఇంట్లోకి పిట్టరావడం మానేసింది. ఆడా మగ పిట్టలకిచకిచల కబుర్లు వేర్లు తెగిన చెట్లలా కూలిపోయాయి" అంటూ బి. వెంకటయ్య ప్రతీకాత్మకంగా వ్యవసాయరంగం స్థితిని చిత్రించారు. "ప్రాణాలు తీసే ప్రభుత్వాలు పతనమైనాయి. ఫ్లయ్‌ఓవర్ బ్రిడ్జిల కింద నీరో చక్రవర్తులు తలదాచుకుంటున్నారు. అనేకానేక ఉక్కిరిబిక్కిరిల మధ్య నువ్వునేనూ మనమూ ఊపిరి పీల్చుకుంటున్న తరుణంలో రైతన్న నీ యీ అఘాయిత్యమేమిటని?" కోట్ల వెంకటేశ్వరరెడ్డి ప్రశ్నిస్తూ ఆత్మహత్యలు సమస్యలకు పరిష్కారం కాదని 'తథాస్తు' కవితలో ప్రబోధిస్తాడు.

ఈ కవి సమ్మేళనానికి నందిగామ కిశోర్ ఆహ్వానం పలుకగా ప్రజాసాహిత్యవేదిక అధ్యక్షులు వల్లభాపురం జనార్దన కవిసమ్మేళనం నిర్వహించి సభను అనేక ఆలోచనలతో ముంచెత్తాడు.

-కోట్ల వనజాత

## విశాఖలో అరసం మహాసభలు

ఆగస్టు 21, 22 తేదీల్లో విశాఖ పట్టణంలో చాసో సభావేదికపై రాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘం 14వ మహాసభలు జరిగాయి.

మహాసభలను కేరళలోని శంకరాచార్య విశ్వవిద్యాలయం వైస్ ఛాన్స్‌లర్ ఆచార్య కె.ఎన్. ఫణిక్కర్ ప్రారంభిస్తూ "లౌకికవాద పునాదులపైనే భారత చరిత్రను నిర్మించాలి. భారతీయ సంస్కృతి తరతరాలుగా ప్రగతిశీలకంగానే కొనసాగింది. మధ్యమధ్యలో పొడసూపే ఎదురుదెబ్బలను, ఆటుపోట్లను ఎదుర్కొంటూనే ముందుకు పురోగమిస్తున్నది. ఇతర జాతులను, మతాలను, భాషలను గౌరవించే ఉత్తమ పురస్కారాన్ని భారతీయ సంస్కృతి ఇక్కడి ప్రజలకిచ్చింది. భారతజాతి అతి ప్రాచీన కాలం నుండి నాగరికతగల జాతి. అయితే గత కొన్ని శతాబ్దాలుగా ఇది అనాగరీకరణ (డి-సివిలైజేషన్) దాడులను ఎదుర్కొంటున్నది. లౌకిక వాదమంటే కేవలం హిందూ-ముస్లిం సమస్యకాదు. బాబ్రీ మసీదు, గుజరాత్ ఘటనలు మాత్రమే కాదు. అది సామాజిక జీవనానికి సంబంధించిన విషయం. ఒక జీవన విధానానికి సంబంధించిన అంశం.

'భారతీయ సామాజిక ధర్మం లౌకిక వాదమే' అన్న అంశాన్ని ప్రజల మనోభావంగా మలిచే బాధ్యత కవులు, కళాకారులు, రచయతలపైన ఉంది. సాహిత్యం ఒక బలమైన సాధనం. ప్రజల చైతన్యాన్ని పదును పెట్టడానికి మీ కలాలను ఆయుధాలుగా ఉపయోగించండి. ఇప్పుడు మన సమాజంలో లౌకికవాదానికీ, మతోన్మాదానికీ మధ్య భావజాల పోరాటం జరుగుతున్నది. ఖచ్చితంగా, కవులూ, రచయితలు తాము ఎటువైపో నిర్ణయించు కోవాల్సిన అనివార్యత ఏర్పడింది" అని స్పష్టం చేశారు.

ప్రారంభ సదస్సుకు విశాఖ మేయర్ శ్రీమతి రాజాన రమణి అధ్యక్షత వహించి, మహాసభ విజయాన్ని కాంక్షిస్తూ ప్రసంగించారు. తర్వాత రాష్ట్ర 'అరసం' అధ్యక్షులు ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి అధ్యక్షతన జరిగిన 'ఆత్మీయ సదస్సు'లో రాష్ట్ర 'విరసం' కార్యదర్శి శ్రీమతి టి. కృష్ణాబాయి, 'సాహితీ స్రవంతి' కన్వీనర్ తెలకపల్లి రవి, రాష్ట్ర సిపిఐ సహాయ కార్యదర్శి డా॥ కె. నారాయణ, మాజీ పార్లమెంట్ సభ్యులు పద్మశ్రీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, జిల్లా సిపిఎం కార్యదర్శి ఎం.వి.ఎస్. శర్మ, జిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి జె.వి.ఎస్.ఎన్. మూర్తి 'విశాల సాహితి' అధ్యక్షులు ఆచార్య కె. మలయవాసిని, 'ఇప్టా' ఉపాధ్యక్షులు కె. ప్రతాపరెడ్డి, ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్యమండలి ప్రధాన కార్యదర్శి సాంబశివరావు, సహృదయ సాహితి' అధ్యక్షులు ఎల్.ఆర్. స్వామి, 'జనసాహితి' బాధ్యులు ఛాయారాజ్ తదితరులు సందేశాలిచ్చారు. డా॥ ఆవంత్స సోమసుందర్ తమ సుదీర్ఘ సాహిత్యోద్యమ అనుభవాలను వివరించారు.

మధ్యాహ్నం "సాంస్కృతిక వక్రీకరణలు - లౌకిక విలువలు" అంశంపై జరిగిన సదస్సుకు ఆచార్య కె.ఎస్. చలం అధ్యక్షత వహించారు. పరకాల పట్టాభి రామారావు, జ్వాలాముఖి, చలసాని ప్రసాద్, ఎం.రామకోటి తదితరులు ఈ సదస్సులో ప్రసంగించారు. ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి అధ్యక్షతన "సాహిత్యంలో ప్రగతిశీల ధోరణులు" అన్న అంశంపై సదస్సు జరిగింది. ప్రముఖ కవి కె. శివారెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. సుప్రసిద్ధ నవలా రచయిత 'అంపశయ్య నవీన్ "ఆధునికానంతరవాదం - వివాదం" అన్న అంశంపై సహేతుక ప్రసంగం చేశారు. "సమకాలీన సాహిత్యం - విమర్శ" అన్న అంశంపై ప్రసంగించిన ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి ఇప్పుడొస్తున్న విమర్శనా సాహిత్యం తీరు తెన్నులను సోదాహరణ పూర్వకంగా వివేచించారు. రచయిత సింగమనేని నారాయణ మాట్లాడుతూ సాహిత్యమంతా ప్రాంతీయ సాహిత్యమే, ప్రతి రచయితా తనకు తెలిసిన జీవితాన్ని తన ప్రాంత జీవితాన్ని చిత్రిస్తాడు" అన్నాడు.

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ జనరల్ మేనేజర్ పి. రాజేశ్వరరావు అధ్యక్షతన జరిగిన గ్రంథావిష్కరణ సభలో అనేక ప్రగతిశీల గ్రంథాలు ఆవిష్కరింపబడినాయి.

## గూగీ పై దాడి : శ్రీమతి గూగీపై అమానుషం

గూగీ. వా థియాంగో కెన్యా రచయిత రాజకీయ నాటకాలు నవలలవల్ల సుప్రసిద్ధుడు. వివిధ అంశాల మీద ఆయన 20 దాకా రచనలు చేశారు. తాను రాసిన 'ఐ విల్ మేరీ వెన్ ఐ వాంట్' (నేను కావాలనుకున్నప్పుడు పెళ్ళి చేసుకుంటాను) అనే నాటకం, 'పెటల్స్ ఆఫ్ బ్లడ్' (నెత్తుటి పూరేకు) అనే నవలలో వెలిబుచ్చిన రాజకీయ సందేశం కారణంగా కెన్యా పాలకులు ఆయనను 1977లో జైలుకి పంపించారు. ఒక ఏడాది జైలు శిక్ష అనుభవించిన తరువాత 1978లో జైలు నుంచి విడుదలయ్యారు.

1978 నుంచి గూగీ వా థియాంగో తన రచనలు ఆంగ్ల భాషలో చేయడానికి బదులుగా మాతృభాష అయిన గికుయూ లేదా కికుయూలో చేయసాగారు. 1980లో గూగీ తన మొదటి నవల అయిన 'ఐతానీ ముతారా ఐని' (డెవిల్ ఆన్ ది క్రాస్) గికుయూ భాషలో రచించారు. (ఈ నవల 'మట్టికాళ్ళ మహా రాక్షసి' పేరుతో తెలుగులో ప్రచురించబడింది) 1982లో గూగీ లండన్ ప్రవాసం వెళ్ళారు. అక్కడ నుండి అమెరికా వెళ్ళారు. తాను విధించుకున్న 22 సంవత్సరాల ప్రవాసం నుంచి గూగీ తన భార్య జీరీతో కలిసి జులై 31, 2004వ తేదీన స్వదేశం కెన్యాకి వచ్చారు. హఠాత్తుగా ఆగస్టు 11, 2004 అర్ధరాత్రి వేళ నలుగురు సాయుధ దుండగులు కెన్యా రాజధాని నైరోబీలోని గూగీ నివసిస్తున్న వోర్‌ఫోక్ టవర్స్ అపార్టుమెంట్‌లోకి బలవంతంగా చొరబడి ఆ భార్యాభర్తలపై దాడి చేశారు. వారి దగ్గర వున్న 467 డాలర్ల ధనాన్ని గుంజుకొని, తుపాకీ మడమలతో ఇద్దర్నీ బాగా చితకబాది రచయిత గూగీ మొహాన్ని సిగరెట్లతో కాల్చివేసి, అతనికళ్ళెదుటే జీరీని దుండగులు రేప్ చేశారు. ఆయన రచనలపై ద్వేషంతో చేసిన అత్యంత దారుణమైన సంఘటన ఇది ప్రపంచ స్థాయి రచయిత గూగీ, ఆయన భార్యపై జరిగిన ఈ అమానుషాన్ని పలువురు కవులు, కళాకారులు ఖండించారు.

అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం ఉపాధ్యక్షుడు డా॥ ఎస్వీ సత్యనారాయణ అధ్యక్షతన జరిగిన "కవితా గోష్టి"లో దాదాపు నలభై మంది కవులు తమ స్వీయ కవితలు వినిపించారు. శ్రీమతి విరియాల లక్ష్మీపతి ఈ కవితా గోష్టిని నిర్వహిం చారు.

డా॥ పి. చిరంజీవినీ కుమారి అధ్యక్షతన "ప్రసార మాధ్యమాల్లో మహిళ" అన్న అంశంపై జరిగిన సదస్సులో ఆచార్య చందుసుబ్బారావు, ఓల్గా, నాగసూరి వేణుగోపాల్, డా॥ ఆలూరి విజయలక్ష్మి, డా॥ సిహెచ్ సుశీల ప్రసంగించారు. "దళిత, మైనారిటీ, ప్రాంతీయ సాహిత్యాలు" అన్న అంశంపై డా॥ అద్దేపల్లి రామమోహన్‌రావు అధ్యక్షతన జరిగిన సదస్సులో డా॥ ఎండ్లూరి సుధాకర్, ముత్యాల ప్రసాద్, డా॥ మానేపల్లి, షేక్ కరీముల్లా విశ్లేషణాత్మక ప్రసంగాలు చేశారు.

స్నాతకోత్సవ సదస్సులో ముఖ్యఅతిథిగా పాల్గొన్న సిపిఐ రాష్ట్ర సమితి కార్యదర్శి, పార్లమెంట్ సభ్యులు సురవరం సుధాకరరెడ్డి మాట్లాడుతూ "రచయితలు సమాజానికి, మార్గనిర్దేశకులు కావాలి అన్నారు. సీనియర్ రచయితలు డా॥ ఆవంత్స సోమసుందర్, బొల్లిముంత శివరామకృష్ణ, డా॥ చాగంటి తులసి, ఘండికోట బ్రహ్మాజీరావు, ఆర్వీయార్‌లను సత్కరించారు.

### తీర్మానాలు

లౌకిక ప్రజాస్వామ్య ప్రగతిశీల రచయితల ఐక్యతకు కృషి చేయాలనీ, సాంస్కృతిక వక్రీకరణలను ఎండగడుతూ ప్రజాస్వామ్య రచనలు చేయాలనీ, ప్రసార మాధ్యమాల్లో మహిళల వికృత చిత్రణను నిరసించాలనీ, తెలుగు భాషకు విద్యారంగంలో ప్రథమ భాషా స్థాయిని కల్పించాలనీ, స్త్రీవాద, దళిత, మైనారిటీ, ప్రాంతీయవాద సాహిత్యాలపట్ల సానుకూలంగా స్పందించాలనే తీర్మానాలను మహాసభ ఆమోదించింది. ఆచార్య ఎస్వీ సత్యనారాయణ అధ్యక్షులు, పెనుగొండ లక్ష్మీనారాయణ ప్రధాన కార్యదర్శిగా నూతన కార్యవర్గం ఎన్నికైంది.

# కొప్పర్తికి సత్కారం



16వ ఉమ్మడిశెట్టి సాహిత్య అవార్డును కొప్పర్తికి ప్రదానం చేస్తున్న రాధేయ

కవితా సంకలనంలో స్వచ్ఛమైన మానవ సంబంధాలను సృష్టించారని సాహిత్యవేత్తలు జూన్ చివరి వారంలో అనంతపురం ప్రెస్‌క్లబ్‌లో 'స్పందన' అనంతకవుల వేదిక ఆధ్వర్యంలో కొప్పర్తి వెంకట రమణమూర్తి ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు ప్రదానోత్సవ సభ జరిగింది. ప్రముఖ సాహితీ విమర్శకులు ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో అవార్డు వ్యవస్థాపకులు, ప్రముఖ కవి రాధేయ 2003 ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డును కవితా సంకలన కర్త కొప్పర్తికి ప్రదానం చేశారు. 'విషాదమోహం' సంకలనాన్ని స్పందన కన్వీనర్ రాజారాం వెంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు ఆచార్యులు డాక్టర్ మేడిపల్లి రవికుమార్ సమీక్షించారు. ఈ సందర్భంగా రాచపాళెం అధ్యక్షోపన్యాసం చేస్తూ 105 సంవత్సరాల ఆధునిక తెలుగు కవిత్వానికి అనంతపురం వేదిక కావడం జిల్లాకే గర్వకారణమన్నారు. డాక్టర్ మేడిపల్లి రవికుమార్ మాట్లాడుతూ శ్రమైక జీవనం బ్రహ్మరాతను కూడా మార్చివేస్తుందన్నారు. కాలక్షేపానికి రాసేది కవిత్వం కానేకాదన్నారు. ప్రజల జీవన సంఘర్షణను, దళిత కవిత్వ నేపథ్యాన్ని కొప్పర్తి చక్కగా తన కవితల్లో వివరించారని తెలిపారు. టి. రాజారాం తనదైన శైలిలో కంచుకంఠంతో కొప్పర్తి కవితలను ఉదహరించిన తీరు సభికులను ఆకట్టుకుంది.

# ఏడు నవలలపై విరసం విమర్శా సదస్సు

తెలుగు సాహిత్య ప్రక్రియలలో విమర్శ పురోగమనం మందకొడిగా వుండటం సాహిత్య స్థాయి ఎదుగుదలకు ఆటంకం అవుతున్నందున సమాజ సాహిత్య సంబంధాన్ని స్థూలంగా అంగీకరించే విమర్శకులయినా ఒక చోటికి చేరి అన్వేషణకు పూనుకోవాలనే లక్ష్యంతో విప్లవ రచయితల సంఘం సెప్టెంబరు 11,12 తేదీలలో హైదరాబాదులో ఒక విమర్శ సదస్సు నిర్వహించింది.

ప్రముఖ విమర్శకులు వల్లంపాటి వెంకట సుబ్బయ్య ప్రధానోపన్యాసం చేస్తూ జీవితం పట్ల ఒక దృక్పథం లేకుండా మంచి నవలలు రావని అన్నారు. ఏ నవలనైనా అంచనా వేసేందుకు జీవితం వైవిధ్యాన్ని, లోతును ఎంత బాగా పట్టుకుందనేది చూడాలని సోదాహరణంగా చెప్పారు. ప్రపంచంలో వచ్చిన గొప్ప నవలలను చదవకుండా కేవలం తమకు తెలిసిన దాంతోనే రాయడం మొదలెడితే పరిమితులేర్పడతాయని చెప్పారు.మాండలికంలో రచన హర్షణీయమైనా అందరికీ అర్థం కావడం కూడా దృష్టిలో వుంచుకోవాలని కోరారు. వరవరరావు మాట్లాడుతూ నవలా ప్రక్రియలో పాశ్చాత్య ప్రమాణాలకు తూర్పు దేశాల ప్రమాణాలకు తేడా వుంటుందని నొక్కి చెప్పారు. ఈ విషయంలో గూగీ చూపిన రచనా మార్గం వర్ధమాన దేశాల రచయితలకు అనుసరణీయమన్నారు. గూగీ ఇంగ్లీషు భాషలో రచనలు చేయను అని ప్రకటించినట్టే మాండలికాల్లో రచనలు రావడానికి వెనక గల నేపథ్యాన్ని సవ్యంగా అర్థం చేసుకోవాలని చెప్పారు. ప్రారంభసభకు టి.కృష్ణాబాయి అధ్యక్షత వహించారు.

ఈ సదస్సులో కేశవరెడ్డి 'రాముడుండాడు, రాజ్జిముండాది' నవలపై చర్చలో తెలకపల్లి రవి, సీతారాం, నాగరాజులు, చండీదాస్ అనుక్షణికం నవలపై వేగుంట, అడ్లూరి రఘురామరాజు, వి.చెంచయ్యలు, అంటరాని వసంతం పై ఎస్వీ సత్యనారాయణ, గోగు శ్యామల, జి.హరగోపాల్‌లు, పతంజలి పెంపుడు జంతువులు పై కె.బాలగోపాల్, హెచ్చార్కె, చలసాని ప్రసాద్‌లు, స్వామి గద్దలాడతాండాయి పై గుడిపాటి, జివిఎస్ రామ్మోహన్‌లు, పులి ఆనంద మోహన్ వసంతగీతం పై నోముల సత్యనారాయణ, ఆర్వీయార్, ఎన్.వేణుగోపాల్‌లు, రేగడి విత్తులు పై కె. శ్రీనివాస్, ప్రసాదవర్మలు తమ తమ కోణం నుంచి విమర్శ చేశారు. నాలుగు సెషన్స్‌గా జరిగిన చర్చకు కృష్ణాబాయి, పి.రామకృష్ణారెడ్డి, జి.కళ్యాణరావు, పాణి అధ్యక్షత వహించారు.




రచయిత కర్ర ఎల్లారెడ్డి అదాలత్ కథలను ఆవిష్కరిస్తున్న ముదిగంటి సుజాతారెడ్డి, అంపశయ్యనవీన్, కె. జితేంద్రబాబు



అడిగోపుల వెంకటరత్నమ్ రచన "శ్వేతపత్రం" కవితా సంపుటిని ఆవిష్కరిస్తున్న డాక్టర్ సి. నారాయణరెడ్డి వేదికపై గోపీ, అద్దేపల్లి. అడిగోపుల [illegible]

RNI No : APTEL08350/01/1/2003-TC
Printed, Published and Owned by Sri **V. Krishnaiah**
1-1-187/1/2, Viveknagar, Chikkadapally, Hyderabad-500 020. Editor **T. Ravindranath**.
Printed at Prajasakti Daily Printing Press. 1-1-60/2, M.B. Bhavan, R.T.C. 'X' Road, Hyderabad.



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

# ప్రజలు దీవించిన ప్రభుత్వం ప్రజా సంక్షేమమే అంతిమ లక్ష్యం

## ప్రభుత్వ ప్రాధాన్యతలు

- రైతులకు ఉచిత విద్యుత్
- పావలా వడ్డీకే డ్వాక్రా మహిళలకు, రైతులకు, నిరుద్యోగులకు రుణాలు
- రాష్ట్రంలో ఖాళీగా ఉన్న ఉద్యోగాలు భర్తీ
- సంవత్సరానికి 8 లక్షల ఇండ్లు నిర్మించి మహిళల పేరిట కేటాయింపు
- పెండింగ్‌లో ఉన్న సేద్యపు నీటి ప్రాజెక్టులు 5సంవత్సరాలలో పూర్తి
- అప్పుల ఊబిలో చిక్కుకున్న కుటుంబాల పట్ల ప్రత్యేక శ్రద్ధ - తక్షణసహాయం
- రుణాలు చెల్లింపులో రైతుకు వెసులుబాటు

# VIJAYAVANI

## BOOKS FOR CHILDREN

- గ్రేడ్ - 0 : బొమ్మలతోనే కథలు
  *Grade-0 : Illustrated Stories without Words*
- గ్రేడ్ - 1 : గుణింతాలు, ద్విత్వాక్షరాలతో బొమ్మల కథలు
  *Grade-1 : Illustrated Stories with Simple Sentences using Dwithwaksharas*
- గ్రేడ్ - 2 : ద్విత్వాక్షరాలు, కొన్ని సంయుక్తాక్షరాలతో కథలు
  *Grade-2 : Illustrated Stories with Dwithwaksharas and a few Samyukthaksharas*
- గ్రేడ్ - 3 : బొమ్మలు - కథాకథనం
  *Grade-3 : Illustrated Stories with Narration*
- గ్రేడ్ - 4 : గేయాలు - పద్యాలు
  *Grade-4 : Lyrics and Poems*
- గ్రేడ్ - 5 : కథలు
  *Grade-5 : Illustrated Stories*

మరియు

- గ్రేడ్ - 6 : ఉపాధ్యాయులకు ఉపకరించే పుస్తకాలు
  *Grade-6 : For Teachers' Reference*

© VIJAYAVANI PRINTERS, CHOWDEPALLE - 517 257
Chittoor Dist., Andhra Pradesh ✆ : 08581 - 256234 Fax : 08581-256213

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A 113 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | ధ 25/6/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |